# పాఠశాలా నిర్వహణము

బోధనాభ్యసన పాఠశాలలోఁ జదువు విద్యార్థులకొఱకు వ్రాయఁబడినది

గ్రంథకర్త:
బి. ఇ. దేవరాజు, ఎం. ఏ., ఎల్. టి.,
హెడ్ మాస్టరు, ఎస్. పి. జి. ట్రెయినింగు స్కూలు,
నంద్యాల.




పబ్లిషర్సు;
వేంకట్రామ అండ్ కో.,
బెజవాడ - మదరాసు

1946

[వెల రు 1—8—0.

# ఉపోద్ఘాతము

మద్రాసు ప్రభుత్వము యొక్క విద్యాశాఖ వారు హయ్యరు గ్రేడు బోధనాభ్యసన పాఠశాలలలోని విద్యార్థుల నూతన పాఠ్య ప్రణాళికలోఁ 'పాఠశాలా నిర్వహణము' అను పాఠమును జేర్చి యంతకుముం దా ప్రణాళికలో నుండిన యొక కొఱతను దీర్చిరి. ఈ పాఠమును నేర్చుకొనుటకుఁ దెనుగు భాషలో గ్రంథములు లేనందున విద్యాశాఖవారు ప్రచురించిన 'ఎలిమెంటరీ ఎడ్యుకేషన్ మాన్యుయల్' అను గ్రంథము నాధారముఁ జేసికొని యీ గ్రంథమును రచించితిని. పాఠకులు గ్రంథములో నున్న లోపములను నాకుఁ దెలియజేసినచో వానిని కృతజ్ఞతతో నందుకొనగలవాఁడను.

గ్రంథమందలి భాషాలోపములను సవరణ చేసి నాకుఁదోడ్పడిన నా మిత్రులును, నంద్యాల మ్యునిసిపల్ హైస్కూలు ప్రధానాంధ్ర పండితులు నగు శ్రీయుత విద్వాన్ కావ్యతీర్థ మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారికి నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

గ్రంథకర్త



# విషయసూచిక

# SYLLABUS

(Elementary Garde)

## School Administration

1. The meaning of education. Elementary education—its aim. Permanent literacy. Its implications and the means of achieving it. Past condition and present efforts. The new policy in Mass Education. The relation of the school to the home and to the village or town. Assessment of conditions by statistics.

2. School site-Sanitation, Building, ventilation and lighting, adequacy of accommodation and "accessibility" of the school. School hygiene. Furniture and equipment—Library. School museum. School garden—its value in teaching and its function brightening the general atmosphere; alternatives in schools without space for garden—pot cultivation and window boxes. School play grounds.

3. Principles of elementary school curriculum-provision for practical work and for a study of local conditions. Preparation and planning of lessons and courses of study. The place of text-books. Time-tables for elementary schools—Provision for plural class teaching and bilingual classes. The place of school excursions in the curriculum. Home-work and its place in elementary schools.

4. Examinations—their meaning and purpose. Written and oral tests. Types of questions. Correction, analysis of errors and remedial treatment. The use and value of educational tests. Promotions and classification of pupils. Records of pupils' progress.

5. Discipline—its nature. Methods of discipline. Regulations relating to dress and behaviour. Importance of personal hygiene of pupils and methods of ensuring it in daily observance. Punctuality,

orderliness, and the queue system. The daily assembly and its purpose. Team spirit, house system pupil-leadership; perfect student government. Hobbies. The place of extra curricular activities. Scouting and other youth movements.

6. Duties of the head teacher and the staff. The teachers' Self improvement, use of the teachers' and association libraries, staff associations. Participation in pupils' activities, study of individual pupils.

7. Departmental rules and regulations. Educational and school statistics their correct preparation, interpretation and use. The principal school records and registers, including the censes register, and their maintenance. Stagnation and wastage, how to estimate them, their causes and remedial measures.

8. Inter-school co-operation, Teachers' Associations, study groups Inter school sports. Exhibitions and demonstrations of activities.

9. Parental co-operation through parent teacher contacts, visits to pupil's homes, formation and functioning of Parents' Associations and community service. Propaganda on behalf of the school. Aim and methods of propaganda.

10. The school as a community centre, reading room for old and present pupils, adult classes; the use of the magic lantern, cinematograph and radio receiver. School entertainments and their organization. Co-ordination of school work with craft instruction with the help of local artisans.

11. Infant Schools and technical schools. Mixed schools and the education of girls. Policy and methods in respect of increasing the enrolment of girls.

12. A general outline of modern teaching methods and curriculum organization, including the project method and the Wardha plan.

## Practical Work

1. Daily duties for a definite period during the course.

(a) to attend to the sanitation of the school building and compound and personal hygiene of pupils in the practising school.

(b) to supervise games and extra curricular activities;

(c) to maintain school records and registers: and

(d) to conduct the school assembly.

2. Making of charts and other teaching appliances.

3. Preparation of school statistics.

4. Preparation of time-tables and teaching notes.

5. Study of a time-table in the practising school, making a list of subjects to be taught and the time to be given to each per week and classifying the subjects into intellectual, handicrafts, arts and physical education.

6. Working out from the various syllabuses the minimum cost of providing the necessary equipment for teaching all the subjects in an elementary school.

7. Attendance at a course for Junior Red Cross counsellors and observation of a Junior Red Cross Group at work.

8. Attendance at the course for Scouters or Guiders and observation of a group or company at work.

# పాఠశాలా నిర్వహణము

## 1. ప్రాథమిక విద్య

విద్యయన నేమి ?:— విద్యయను పదము సంస్కృతభాష లోని 'విద్ జ్ఞానే' అను ధాతువునుండి వచ్చినది. 'విద్' అనగా తెలియుట అని అర్థము. కాబట్టి విద్యయను పదమునకు నూతనవిష యములను దెలిసికొనుట యని యర్థము చెప్పనగును. కాని సామా న్యముగా నీమాట పాఠశాలకు బోయి యొక గురువుకడ నేర్చుకొనుట యను నర్థముతో ప్రస్తుతము వాడబడుచున్నది. ఏదోయొక పాఠ శాలకు బోయి నేర్చుకొనునది మాత్రమే విద్యకాదని మనమందర మెఱుగుదుము. కొందఱు పాఠశాలకు బోవకయే యుత్తమవిద్య నభ్యసింపగలరు. ప్రకృతిలోని నానాసంభవములను గమనించుచు, తోడిమానవులతో సంభాషించుచు, నూతనస్థలములలో ప్రయా ణము చేయుచు క్రొత్తసంగతు లనేకములను దెలిసికొనుటకు నేర్చు కొనుటకును మనకందఱకు నవకాశములున్నవి. ఇది విద్యకాదని యెవరు చెప్పగలరు ? ఒకవిధముగ జూచినచో పాఠశాలవిద్యకంటె నీవిద్యయే విశాలమైనదని యనదగును. కాని, ఈ గ్రంథమున ప్రధా నముగ విద్య యనుదానికి సామాన్యార్థ మేమనియే మన మాలో చింపవలసి యున్నది.

(విద్యయనునది వ్యక్తిగతములైన శారీరక మానసిక నైతిక శక్తులను సంపూర్ణముగ వృద్ధిపొందించు నుత్తేజనకరమగు సాధనము.) పుష్పము వికసించి తనలోని పరిమళము బయటికి వెదజల్లినట్లే విద్య యను వ్యక్తిగతమై గుప్తముగానున్న సర్వశక్తులను వెలువరించి వానిని వికసింప జేయవలయును. అట్లు చేయనిది విద్యయే కాదన వలయును. కనుక బాలురు తమ చుట్టుప్రక్కలనున్న భౌతిక, నైతిక,

సాంఘిక పరిసరముల కనుగుణముగ నడుచుకొన గలుగునట్లు చేయుటయే విద్యకు బరమలక్ష్య మగుచున్నది.

కాన బాలురు బడిలో ప్రవేశించినది మొదలు మరల బడి విడుచువరకును నుపాధ్యాయుడే మాట్లాడుట కవకాశము కల్పించి బాలురు తమకు గలుగు సందేహములనుగురించి యడుగుటకుగాని, ఉపాధ్యాయుడు చెప్పినట్లవసరమగు పనులు చేయుటకు గాని యవకాశ మీయని విద్య విద్యకాదు.

గద్య పద్యకావ్యములను, శాస్త్రసూత్రములను నేర్చుకొని తప్పులు లేకుండ వల్లింపగల్గుటయు విద్యకాదు. ఉపాధ్యాయుడు బోధించు ప్రతివిషయమును బాలుడు గ్రహింపవలయును. దానిఫలిత మాతని జీవితములో నగపడవలయును. బాలుడు స్వతంత్రముగ దలంచుటకును ఆలోచించుటకును నూతన పరిస్థితుల నెదుర్కొనుటకును శక్తిమంతు డగునట్లు చేయునదియే విద్య.

విద్యయొక్క యుద్దేశము:— లోకము జను లనేకోద్దేశములతో దమబిడ్డలకు విద్య చెప్పింతురు. ఈ యుద్దేశములలో మన దేశమునకు ప్రధానమైనది జీవితాధారకమని చెప్పవచ్చును. కాని ఇది యంత గొప్పయుద్దేశముకాదు. ఏలయన పెరిగి పెద్దవాడైనప్పు డతనికి మంచి యుద్యోగము లభించవలె ననునదియే పరమోద్దేశమైనయెడల బాలుర మనోభివృద్ధి కుపాధ్యాయులంతగా బాటుపడరు. అప్పుడు పరీక్షలలో గృతార్థులగుటయే బాలుర యుద్దేశముగా నేర్పడి సరియగు విద్యకు దోహదము కలుగకపోవచ్చును. కాన జ్ఞానోపార్జనమే తమ యుద్దేశముగా విద్యార్థులు భావించుట యుచితముగ నుండును.

(“విద్య యనగా సంపూర్ణజీవితమునకు సిద్ధపడుట” యని హార్బర్టుస్పెన్సరు పండితుడు వాక్రుచ్చియున్నాడు.) సంపూర్ణజీవితమున నొక వ్యక్తియొక్క సకల శక్తులను జక్కగ వికసించి మానవ సంఘమున కుపయోగించునవై యుండవలయును. (“భావికాలమున

నొకవ్యక్తి ఏపనిచేయ నేర్పరచుకొననో యాపనులకు గావలసిన శిక్షణము పొందుటయే విద్యయొక్క యుద్దేశ''మని కొందఱందురు. అనగా బాలుడెదిగిన పిదప నేత, కుమ్మరి, కమ్మరి, శిల్పము, వైద్యము మొదలగుపనులను జేయ సంకల్పించుకొన్న మొదల నా పనులకు గావలసిన శిక్షణము పొందుటయే విద్యయని వీరి యభిప్రాయము. ఇదియే విద్యయన్నచో విద్యకు మిగుల సంకుచితమైన యర్థము నిచ్చినట్లుండును. బాలు డెదిగినపిమ్మట దన జీవనోపాధిని సంపాదించుకొనుటకు శక్తిగలిగి సద్వర్తనుడై మానవసేవ చేయ ప్రోత్సహించుటయే విద్యయొక్క యుద్దేశము. ఎంతచదువు చదివినను సద్వర్తనము లేనివాని విద్య పనికిరాదు. కనుక విద్యయొక్క యుద్దేశములలో సద్వర్తన మొక ప్రధానోద్దేశమై యుండవలయును. విద్య నైతికాభివృద్ధికి దారి తీయవలయును, సద్వర్తన మొక్క దినములో వచ్చునదికాదు. బాలునిలో నిది క్రమముగ నేర్పడును. సద్వర్తన మలవడుటకు దగిన యవకాశమును గల్పించి వానిని బాలుడు వినియోగించునట్లు చేయుచు వాడెదిగినపిదప దన ధర్మమును విడువక సన్మార్గుడై దేశభక్తియు దైవభక్తియు గలిగి సత్పౌరుడుగ మెలగునట్లు చేయుటయే విద్యయొక్క యుద్దేశము.

ప్రాథమికవిద్య:—విద్యను ప్రాథమికవిద్య, ఉన్నత, కళాశాలవిద్య యని మూడుభాగములు చేయవచ్చును. ఉన్నతవిద్య, కళాశాలవిద్య-వీనినిగూర్చి యిచ్చట జర్చింప బనిలేదు. ప్రాథమిక విద్యను గూర్చియే ఆలోచింపవలసి యున్నది. ప్రాథమికవిద్య యన నేమి? సాధారణముగ నొక పాఠశాలలోని మొదటి నైదుతరగతులలో నేర్పబడు విద్యకు ప్రాథమికవిద్యయని పేరు. తరువాతి కాలములో నేర్చుకొను విద్యకంతకును నిది పునాది. ఈ ప్రాథమికవిద్య యొక్క యుద్దేశమేమి? పాఠశాలలో ప్రవేశించు ప్రతిబాలుడును ధారాళముగ జదువుటకును, వ్రాయుటకును, సామాన్యమైన లెక్కలుచేయుటకును శక్తిగలవాడై తన పరిసరముల నున్న ప్రకృతి చిత్రములను గొంతవరకు గ్రహించి సాంఘికముగ దన బాధ్యలను

హక్కులనుగుర్తించి వానిని తృప్తికరముగ నెఱవేర్పగలుగునట్లు చేయుటయే. ఈ యుద్దేశము నెరవేఱుటకు పాఠశాలలో బోధింపు పాఠము లేర్పరుప బడవలయును. కావుననే నేటి ప్రాథమికపాఠశాలలలో జదువుట, వ్రాయుట, లెక్కలు వేయుట యనునవి ప్రధానపాఠములుగ నేర్పబడుచున్నవి. బాలుర జ్ఞానాభివృద్ధి కక్షరాస్యత మిగుల యవసరము. కనుక వాచకమును బోధించుటకు పాఠశాలలో నెక్కువ కాలము వినియోగింప బడుచున్నది. సులభశైలిలోనున్న గ్రంథములను ధారాళముగ జదువగలుగుట, ఉత్తరములు వ్రాయుట, ప్రత్యుత్తరములను జదువుట, సామాన్యమైన వార్తాపత్రికలను జదివి గ్రహింపగలుగుట యివి యక్షరాస్యతలోని ప్రధాన విషయములు.

అంకెలను కూడుట, తీసివేయుటమాత్రమేగాక గృహసంబంధమగు లెక్కలను వ్రాసి యుంచుకొనుట, వర్తకులు వ్రాయు లెక్కపద్ధతులను గ్రహించి యప్పుమొత్తములకు వడ్డి కట్టుట మొదలగునవి తెలిసి యుండవలయును.

ప్రాథమిక పాఠశాలలో విద్యముగించు విద్యార్థులలో ననేకులు గ్రామములలో వ్యవసాయవృత్తిలోనో, తత్సంబంధమైన పరిశ్రమలలోనో తమ జీవితమును గడపవలసియుండును. ప్రకృతి విషయముల నెఱిగియున్నచో దమ పనిపాటలను తెలివిగను సులువుగను జేసికొనుటకు వారికి వీలుకలుగును. కనుక మొక్కలు పెరుగుటకు గావలసిన వసతులు, కీటకములవలన గలుగు మేలు కీడులు, జంతువులు-వాని యుపయోగములు, పక్షులు-వాని యభ్యాసములు మున్నగు సంగతులు ప్రకృతి పాఠములలో నేర్చుకొనవలయును. మొక్కలను గూర్చిన విషయములు నేర్చుకొనుటకు బడితోట మిగుల సాయపడగలదు. అంతియగాక చేతుల కష్టము నగౌరవముగ జూచు మన దేశమునందు జేతులతో గష్టపడి పని చేయుటయం దగౌరవ మించుకేనియు లేదని బాలురకు బోధించుటకు చక్కనియవకాశము సయితము బడితోట మూలమున లభించును.

ప్రకృతివిషయములతోఁబాటు ప్రాథమిక పాఠశాలలో భూగోళ విషయములను, ముఖ్యముగ స్థానిక భూగోళమును నేర్ప వలసియుండును. బాలురకు గ్రామము, తాలూకా, జిల్లా భూగోళమును బోధింపవలయును. వానితోఁగూడ సూర్యచంద్రాదులు, ఋతువుల మార్పులు, వర్షము, పైరుపచ్చలు, వ్యాపారము, వర్తక మార్గములు మొదలగు వానిఁగూర్చి క్లుప్తముగ బోధింపవలయును. బాలురెదిగి పౌరులగుచున్నారు. కనుక పౌర ధర్మములనుగూర్చియు వారికి బోధింపవలసియున్నది. చిత్రలేఖనము, కుటీర పరిశ్రమలు నేర్చుకొనుటయందు బాలుర కుత్సాహము గలిగించి వానిని సమితము నేర్పవలయును. కథలు, పాటలు, గానము మొదలగు మూలమున నీతిబోధయు చరిత్రయు నేర్పుట కవకాశము లున్నవి. వానిని ప్రాథమిక పాఠశాలలలో నేర్పుట మిగుల అవసరము. ఈ బోధన యంతయు మాతృభాషామూలముననే జరుగవలయును. ప్రాథమిక విద్యలో నీయంశము లన్నియు నిమిడియున్నవి.

ప్రాథమిక పాఠశాలలలో 6 నుండి 8 తరగతులు సయితము గల పాఠశాలలున్నవి. ఈ తరగతులలో మొదటి యైదు తరగతులలో బోధించిన విషయములకంటె గహనమగు విషయములను బోధింపవలయును. అంతియగాక బాలుర కేదియో యొక వృత్తిని నేర్పు నుద్దేశముతోఁ జేతిపనులను, కుటీర పరిశ్రమలను నేర్పవలయును.

పైని చెప్పఁబడిన పాఠములన్నియు జెప్పఁబడియున్నను బాలురలో శాశ్వతమగు నక్షరాస్యతను గలిగించుట ప్రాథమిక పాఠశాలల ప్రధానోద్దేశమని మఱచిపోరాదు. అనఁగా బాల్యమున బడిలో ప్రవేశించి చదువు నేర్చుకొన్నవాఁడు తన జీవితకాల మంతయు, చదువను, వ్రాయను శక్తిగలిగి యుండవలయును.

ఒకసారి బడిలో ప్రవేశించిన బాలుఁ డయిదు తరగతులు ముగించువరకు బడిని విడువకుండునట్లు చూడవలయును. అయిదవ తరగతి ముగించకుండ బడి చాలించుకొన్నచో నట్టి బాలుఁడు

చదువను, వ్రాయుటను సంపాదించుకొన్న శక్తి శాశ్వతముగ నుండదని పరిశోధనల వలన విద్యావేత్తలు తెలిసికొనియున్నారు. గ్రామములలోని జనులు పేదలగుటచేతను, విద్యవలని మేలులను గ్రహింపకపోవుట వలనను దమ బిడ్డలు పది, పదునొకండేండ్ల వయస్సునకు రాఁగానే, వారైదవతరగతిలో నుండినను సరే, వారిని బడినుండి తొలగించి, పొలములోని పనులకుఁ బంపుచుందురు. అట్టి బాలురు తాము నేర్చుకొన్న చదువును మఱచిపోవుదురు. కనుక బాలుఁడావయస్సునకు రాకపూర్వమే యయిదవ తరగతి ముగించుకొనఁ గలుగునట్లుపాధ్యాయులు శ్రద్ధ చేయవలయును. అనగా గ్రామములో నయిదాఱేండ్ల వయస్సులో నున్నబిడ్డల నందఱను బాఠశాలలో చేర్చుటకును, వారు క్రమముగ బడికివచ్చి పాఠములు నేర్చుకొనునట్లును ఉపాధ్యాయులు శ్రమపడినచో నట్టి బాలబాలిక లందఱును పది పండ్రెండేండ్ల వయస్సు రాకపూర్వమే యయిదవ తరగతి ముగించుకొని, శాశ్వతాక్షరాస్యతను సంపాదించుకొన్న వారగుదురు. ఈ విషయములో తల్లిదండ్రులునయితే నుపాధ్యాయులకుఁ దోడ్పడి తమ పిల్లలు బడికిఁ గ్రమముగఁ బోవునట్లు చూచుటయేగాక చదువు ముగించుదనుక వారిని బడినుండి తొలగింపకయు నుండవలయును.

కాని, ఐదవతరగతి ముగించకయే బడివిడిచిన బాలురేమి అయిదవ తరగతి ముగించిన బాలురేమి బడివిడిచిన పిదప చాలకాలమువరకు మరలఁ బుస్తకములను ముట్టకపోవుటవలన వారు నేర్చుకొన్న చదువు మఱచిపోవుట తటస్థింపవచ్చును. అట్టి పరిస్థితులలో నుపాధ్యాయుఁడు రాత్రి పాఠశాలల నేర్పఱచి బడి చాలించుకొన్న బాలురను, యువకులను జేర్చుకొని వారివారి వయస్సునకును వారివారి జ్ఞానమునకును దగినట్లు పాఠములను జెప్పవలయును. లేదా గ్రంథమునిచ్చి చదివింపవలయును. గ్రామములోని పెద్దమనుష్యుల సాహాయ్యమున నొక గ్రంథాలయము నేర్పఱచి నానావిధ గ్రంథములను దెప్పించి యా గ్రామము నందలి విద్యావంతు లందఱును గ్రంథములను దీసికొని చదువుకొనున ట్లేర్పఱుప వచ్చును. ఉదాహ

గుణము గలిగి యుత్సాహవంతులుగ నుండు కొందఱు గ్రామస్థుల సాయమున వార్తాపత్రికలను తెప్పించి చదువునట్లు ప్రోత్సహించిన యెడ బడివిడిచి చదువు మఱచిపోవుచున్నవారు తము నేర్చిన విద్య మఱవుదగులకుండ నానాటి వృద్ధి చేసికొనుట కవకాశము కల్పించిన ట్లగును. సాధారణముగ గ్రామములలోని యువకులకు నాటకము లన్న మిగుల నిష్టము. బడివిడిచిన యువకుల కుపాధ్యాయుడు నాటకములను దాను స్వయముగ నేర్పియో, లేక యితరులచే నేర్పించియో వారు కొన్ని నాటకములను ప్రదర్శించునట్లు చేయవచ్చును. ఇట్లు చేసిన పక్షమున చదివిన చదువును సరిగా నుపయోగపెట్టుటకును, గట్టిచేసుకొనుటకును మంచి మార్గ మేర్పడినట్లగును. బడివిడిచిన వారు ప్రతిదినము తమతమ గ్రంథములలో నేదో కొంతభాగమును నియతపారాయణముగా బఠింపవలయును. అట్లు చేసినచో వారి యక్షరజ్ఞానము నశింపక దినదినాభివృద్ధి చెందగలదు.

ప్రాథమికవిద్య, దాని పూర్వస్థితి:— ఆంగ్లేయులు ఇండియాకు రాకపూర్వమే యీ దేశమున హిందూమహమ్మదీయ విద్యావిధానములు నెలకొని యుండినవి. కాని యీ విద్యావిధానములు మతసంస్థల నంటిపెట్టుకొనియుండినవి. అగ్రవర్ణజుల కొఱ కేర్పడిన పాఠశాలలలో పండితులు విద్యార్థులకు సంస్కృతము, తర్కశాస్త్రము, న్యాయశాస్త్రము, తత్త్వశాస్త్రము మొదలగునవి నేర్పుచుండిరి. తక్కినవర్ణములవారికి అనగా ముఖ్యముగా వర్తకులు, రైతులు. మొదలగువారి పిల్లలకు వీధిబడులలో చదువుట, వ్రాయుట, లెఖలువేయుట నేర్పుచుండిరి. ముసల్మానులలో గొప్పవారు తమ కుమారులకు మసీదుల సమీపమునయున్న పండితులచే విద్య చెప్పించుచుండిరి. కాని జనసామాన్యమునకు విద్యయనునది లేకుండెను.

బ్రిటిషువా రిండియాలో రాజ్యము సంపాదించుకొన్న పిదప విద్యాపరిస్థితులలో మార్పు కలిగెను. ఎట్లన హిందూదేశములో దమ యేలుబడిక్రింద నున్న రాజ్యభాగములలోని జనసామాన్యమునకు విద్య చెప్పించుట దొరతనమువారి విధియని 1854 లో

తూర్పిండియా వర్తకసంఘాధికారులు ప్రకటించి. పాశ్చాత్యవిద్యా విధానము ననుసరించి కళలు, శాస్త్రములు, తత్త్వశాస్త్రము, సారస్వతము హిందూదేశస్థులకు నేర్పింప నిశ్చయించిరి. ఈ నిశ్చయము నమలుజరుపుటకై వారు విద్యాశాఖ నొకదానిని నేర్పఱచిరి. విశ్వవిద్యాలయములను స్థాపించిరి. ఉపాధ్యాయుల శిక్షణము నిమిత్తము బోధనాభ్యాస పాఠశాలల నేర్పఱచిరి. కళాశాలలను, పాఠశాలలను స్థాపించిరి. దేశీయపాఠశాలలను నభివృద్ధిపరచిరి. పాఠశాలలకు ద్రవ్యసాహాయ్యముచేయు పద్ధతి నేర్పఱచిరి. దీనితో హిందూదేశము నందలి పూర్వవిద్యావిధానము మాని నూతన విద్యావిధాన మనుభవములోనికి వచ్చెను. ఉన్నతవిద్య, కళాశాల విద్యల ననుసరించి ప్రాథమికవిద్య సయితము మార్పు చెందెను.

1882 లో విద్యావిషయములను గూర్చి విచారణ సల్పుట కేర్పఱుపబడిన విచారణసంఘము విద్య నభివృద్ధిపరచుట కనధికారు లేర్పరచు పాఠశాలలను ప్రభుత్వమువారు ప్రోత్సహింపవలయునని సూచించెను. పిదప గొంతకాలమునకు 1884 లో జిల్లాబోర్డులు, పురపాలక సంఘములు నేర్పడినవుడు పాఠశాలలను జరుపు భార మాసంస్థలకే యప్పగించిరి. ప్రాథమికవిద్య యీ సంస్థల యాజమాన్యముననే నేటికి సాగుచున్నది. ఈ సంస్థలకు జెందని పాఠశాలలును నేడు వేలకొలది గలవు.

మన రాజధానిలోని ప్రాథమిక పాఠశాలలకు జెందిన కొన్ని వివరము లీక్రింద జూపబడినవి.

| సంవత్సరము | ప్రాథమిక పాఠశాలలసంఖ్య | బాలురసంఖ్య |
|---|---|---|
| 1886 | 13,358 | 3,59,000 |
| 1896 | 18,952 | 5,84,000 |
| 1906 | 21,379 | 6,92,000 |
| 1920 | 32,482 | 13,26,539 |
| 1930 | 50,121 | 22,95,256 |

(బాలికా పాఠశాలలుగాని, వారిసంఖ్యగాని ఇందులో జేరలేదు.)

పైని జూపిన విధమున పాఠశాలల సంఖ్యయు, నందు జదువు బాలుర సంఖ్యయు హెచ్చుచుండినను, రాజధానిలోని విద్యా వంతుల సంఖ్యమాత్ర మంతగా హెచ్చలేదు. మన రాజధానిలోని విద్యావంతుల సంఖ్య తృప్తికరముగ హెచ్చకుండుటకు గతకాలములో ప్రాథమికవిద్య తృప్తికరముగ సాగకపోవుటయే కారణము. ప్రాథమికవిద్య సరిగా జరుగకపోవుటకనేక కారణములు కలవు. ఈ క్రింద జూపినవి వానిలో ప్రధానములైనవి.

1. బడిలో ప్రవేశించిన బాలురు చదువు ముగించకమునుపే బడివిడుచుట. 1922 లో మన రాజధానిలో ప్రాథమిక పాఠశాలల లోనికి 7,61,073 మంది బాలబాలికలు మొదటితరగతిలో ప్రవేశించిరి. 1926 లో 61,950 మంది మాత్ర మైదవతరగతిలో నుండిరి. అనగా 6,99,128 మంది యైదవ తరగతికి రాకముందే బడివిడిచిరి. కనుక వీరెవ్వరుగాని యక్షరాస్యతను సంపాదించిరనజాలము. కనుక వీరి విద్యకై వెచ్చింపబడిన ధనమును, ఉపాధ్యాయుల కృషియు వ్యర్థములాయెనని మాత్ర మనవచ్చును.

2. అసంపూర్ణ పాఠశాలలు : ఇదివరలో మొదటి అయిదు తరగతులును గల సంపూర్ణపాఠశాలల సంఖ్య చాలతక్కువ. అందువలన బాలురు పాఠశాలలో ప్రవేశించి యుండినను రెండు మూడు తరగతులు చదువగనే బడి మానివేయుచుండిరి. ఇట్లగుటచే వీరు క్రమక్రమముగ నిరక్షరులక్రిందకే వచ్చుచుండిరి.

3. ఒంటరి యుపాధ్యాయుడు గల పాఠశాలలుండుట : ఒక పాఠశాలలో రెండు మూడు తరగతులున్నచో అన్ని తరగతుల బాలురకును నుపాధ్యాయు డొక్కడే నైనయెడల నీతడు తనపనిని తృప్తికరముగ జేయుటకవకాశములు లేవు. మూడుతరగతులకు నేక కాలమున బాఠములు చెప్పుట కష్టము. అంతియగాక యట్టి యుపాధ్యాయుడు సోమరియై పనిచేయకున్నను నుండవచ్చును. అతనిని దండించువా రుండరు. అతనికేవైన బోధనావిషయములు తెలియు

కుండిన పక్షమున ఆ విషయములను దెలిసికొనుటకు వసతులు సముతము తక్కువయే, కనుక నట్టి పాఠశాలలలో బాలుర విద్య క్రమముగా నెట్లు సాగగలదు?

4. పెట్టుబడికిం దగిన ప్రతిఫలమీయని పాఠశాలలుండుట: సర్కారువారివలన జీతముగాని లేక ద్రవ్యసహాయమునుగాని పొందు నొక యుపాధ్యాయునకు 80 మంది బాలురవలె నొకేతరగతి పాఠములు చెప్పుచున్నప్పు డతని మూలమున వ్యయమగు ప్రభుత్వ ద్రవ్యము సార్థకమగుచున్నదని చెప్పవచ్చును. కాని ఒక యుపాధ్యాయుడే రెండు మూడు తరగతులకుం జదువు చెప్పువాడైనను, ఆయా తరగతులలో 30 మందికంటె తక్కువమంది విద్యార్థులున్నను అట్లు నడుపబడుచున్న పాఠశాల లందులకై వెచ్చపెట్టు ద్రవ్యమునకు ఫలము నిచ్చుట లేదనియే చెప్పవలసియుండును. ఇట్టి పాఠశాలలనేకములు మొన్నటిదనుక నుండినవి. ఒక్కొక్కప్పుడు వర్ణభేదములు, అంటరానితనము అనువానివలన నిట్టి బడులు తప్పనిసరి యగుచుండెను.

5. విద్యావిషయిక యోగ్యతలు లేని యుపాధ్యాయుల నియామకము: గ్రామములోనే రెండవతరగతి చదివి పిదప 'నేషనల్ స్కూల్'నకుం బోయి సర్టిఫికేటును బొందిన యుపాధ్యాయులు పిల్లల కేమిపాఠములను బోధింపగలుగుదురు? బోధనాభ్యసశిక్షణము పొందని యుపాధ్యాయులు గతకాలములో ననేకులు పాఠశాలలలోం బనిచేయుచుండిరి. అట్టి యుపాధ్యాయుల మూలమున పిల్లలు విద్యలో ముందునకు సాగక యొక్కొక్క తరగతిలోనే రెండు మూడేండ్లుండి యంకటితో విద్యకు స్వస్తిచెప్పుచుండిరి.

6. పాఠములను బోధించుట కెక్కుడి యవసరముగం గావలసిన యుపకరణములను పాఠశాలాధికారులు సమకూర్పక పోవుట: వలయు పరికరములను సమకూర్పక పోవుటవలన బాలురకు పాఠములు సుబోధకములగునట్లు ఉపాధ్యాయులు చెప్పజాలకుండిరి.

7. ఉపాధ్యాయుల కష్టనష్టాదులకు సరియైన పాలని జీతము లేర్పరచుట! అవిశ్రాంతమైన సకాలమున తీయకుండుట: ఉపాధ్యాయునకు రెండు మూడు నెలలకొకసారి జీతమిచ్చినచో నతడు తన కృత్యములను దినదిన తృప్తికరముగఁ జేయజాలకుండును. ఒక ప్రక్క పొట్టకూటికై విచారించుకొనునా? మఱియొకప్రక్క చదువు చెప్పునా? కనుక విద్యాశాసనముక్రింది పెద్ద పెట్టనవచ్చును.

8. అల్పసంఖ్యాకులైన డిప్యూటీ ఇనస్పెక్టర్లుండుట: పూర్వము రమారమి 150 పాఠశాలల కొక డిప్యూటీ ఇన్‌స్పెక్టరు చొప్పున నుండెడివారు. పాఠశాలల సంఖ్య యధికమగుటచే ఆయన తన రేంజిలోని పాఠశాలల నొక్కసారి (గ్రాంటుపరీక్షకు) కంటె నెక్కువ సార్లు పరీక్షింప వీలులేకుండెను. కావున గ్రాంటుపరీక్ష కాగానే యుపాధ్యాయులలో ననేకులు తమ పనిలో అశ్రద్ధ చూపుచుండిరి.

పరిస్థితు లిట్లున్నప్పుడు ప్రాథమికవిద్య జయప్రదముగ సాగక పోవుటయందు వింత లేదుగదా!

ప్రాథమిక విద్యాభివృద్ధికై ప్రస్తుత ప్రయత్నములు:—

ప్రాథమికవిద్యను జయప్రదముగ సాగించు నుద్దేశముతో మదరాసు ప్రభుత్వమువారు 1920 లో ప్రాథమిక విద్యాశాసనము నొకదానిని జేసిరి. దానిమూలమున ప్రతిజిల్లాలోను విద్యా సంస్థల యొక్కయు, స్థానిక సంస్థలయొక్కయుఁ బ్రతినిధులు గల జిల్లా విద్యాసంఘమొకటి యేర్పరుప బడెను. ఈ సంఘము లాయా జిల్లాలలోని ప్రాథమిక విద్యను జెందిన విషయములను జర్చించి వలయు నేర్పాటులను జేయుచుండెను. (ఇవి 1939వ సంవత్సరము రద్దుచేయఁబడెను) నిర్బంధవిద్యా విధానమును బ్రయోగించినచో త్వరితముగ విద్య వ్యాప్తి చెందఁ గలదని ప్రభుత్వము వారు 1920 నుండియుఁ బురపాలక సంఘములును, మరి యితర సంస్థలును నిర్బంధ ప్రాథమికవిద్య నచటను జరుపవచ్చునని శాసించిరి. ఆ శాసనమువలన ఈనాఁడు మన రాజధానిలో ముప్పదియేడు పురపాలక

సంఘములును, వీడు యితరసంస్థలును ఈ విధానము నడుపుట జరుపుచున్నవి. స్థానికసంస్థ లిష్టపడినచో విద్యాశుల్కము (పన్ను) ను గూడ వసూలు చేయవచ్చునని యీహక్కునుగూడఁ బ్రసాదించుచు ప్రభుత్వము వారు 1934 లో విద్యాశాసనము సంస్కరించిరి. మరియు నాయాసంస్థలు వచ్చునాదాయములో నింత మొత్తమని నియమితముగాఁ బ్రాథమికవిద్యకై వెచ్చించవలెనని కూడ నిర్ణయించిరి.

ఇట్టి యేర్పాట్లు చేయుచున్నను ప్రాథమికవిద్యాస్థితి చక్కఁబడకున్నది. ఇట్లుండుటవలన నీ ప్రాథమికవిద్య విషయమై యాలోచించి మఱికొన్ని యేర్పాటులు చేయుటకై ప్రత్యేకముగ నొక యుద్యోగిని 'డిప్యూటీడైరెక్టరు' అను పేర సర్కారువారు నియమించిరి. మొట్టమొదట డిప్యూటీడైరెక్టరుగా వచ్చిన శ్రీ ఛాంపి యను దొరగారు ప్రాథమికవిద్యను గూర్చి తగు పరిశోధనలుచేసి ప్రాథమిక పాఠశాలలను బాగుపరచుటకొక విధానమును సూచించిరి. ఆ విధానమందలి సూచనలేమన: ఒక పెద్దగ్రామములో ననేక పాఠశాలలుండగా వాని నన్నింటిని జేర్చి యొక పెద్ద పాఠశాలగా, చేయుటయు, నట్టి కేంద్రపాఠశాల దూరమైనపుడు నడచి రాజాలని చిన్నబాలుర కొఱకొకటి రెండు మూడు తరగతులుగల మఱికొన్ని పోషక పాఠశాలల నేర్పరచుటయు—ఇవి యతని విధానములోని ప్రధాన సూచనలు. కాని యీ సూచనలు పూర్తిగ నడుపుట జరుపుటకు బూర్వమే వారు గతించిరి.

పిమ్మట విద్యాశాఖకు డైరెక్టరుగా నుండిన శ్రీ స్టాతము దొరగారు ప్రాథమిక విద్యాభివృద్ధికై కంకణము కట్టుకొని యత్యంత శ్రద్ధవహించి యనేక నూతన శాసనములను చేసియున్నారు. అట్టి చట్టముల మూలమున బడిలోఁ బ్రవేశించిన విద్యార్థులు విద్య ముగియకముందే తమయిష్టము వచ్చినట్లు చాలించుకొనుట కవకాశము లేకుండఁ జేయబడెను. ఒంటరి యుపాధ్యాయుఁ డున్న పాఠశాలలు వందలకొలది మూసివేయబడెను. కొన్ని పోషకపాఠశాలలుగ మార్చి వేయఁబడెను. అది మొద లొక్కరికంటె నెక్కువమంది యుపాధ్యా

ములు పనిచేయుచున్న పాఠశాలలకే యెక్కువ ప్రోత్సాహమొసగబడెను. ఇప్పటికిని నట్లే జరుగుచున్నది. మఱియు నసంపూర్ణ పాఠశాలలును. పెట్టుబడికిఁ దగిన ఫలము నియ్యఁజాలని పాఠశాలలును బూర్తిగా మూసివేయబడెను. కొన్నింటికి సర్కారునుండి పొందబడు ద్రవ్యసహాయము చాలవఱకు తగ్గింపబడెను. ఇప్పుడును నట్లు జరుగుచున్నది. ఒక్కొక్క గ్రామములోఁ బరిమితికి మించియున్న పాఠశాలలు మూయబడినవి. మఱియుఁ గొన్ని నిబంధనలను బెట్టి యందులకుఁజాలని పాఠశాలలకు గ్రాంటుతగ్గింపబడెను. ఎట్లనఁగ ఒక యుపాధ్యాయునకు సరాసరి లెక్కను బ్రతిదినము కనీస మిరువదిమంది బాలుర వంతున హాజరు కనఁబడవలెననియుఁ బాఠశాలలో నొకటినుండి రెండు తరగతు లుండవలెననియు నాలుగైదు తరగతులలో నొకటి రెండు తరగతులలోనున్న బాలుర సంఖ్యలో నాల్గవ పాలునకు తగ్గియుండరాదనియు నిబంధన లేర్పరచి, యందులకుఁ జాలని పాఠశాలలకు గ్రాంటులను తగ్గించుచు వచ్చిరి. ఇంతియగాక గ్రామములోనుండు పాఠశాల యన్నిజాతులవారి కందుబాటగు స్థలములోనుండ వలెననియు అందు నిమ్నజాతుల బాలురు తప్పక యుండ వలెననియు, అట్లు లేకున్న గ్రాంటులో కోత కోయఁబడుననియు నిర్బంధము చేసి యట్లు చేయుచున్నారు. గ్రామములోఁ బ్రత్యేకముగ బాలికాపాఠశాల లేనియెడల నాగ్రామములోని బాలుర పాఠశాలలోనే దాదాపు సగము మంది బాలిక లుండవలసినట్లును, అట్లు లేకున్నయెడల గ్రాంటు తగ్గించునట్లును నిర్ణయించి యీ విధముగానే జరిపించుచున్నారు.

1939 సం॥లో ప్రాథమిక పాఠశాల విద్యాప్రణాళిక కొంత మార్పు చేయబడినది. ఈమార్పుల నుపాధ్యాయుఁడుగా నుండువాడు కనీసము హైస్కూల్ గ్రేడ్ ట్రెయినింగైన వాఁడుగ నుండవలెనని నిబంధింపఁబడినది మఱియు నుపాధ్యాయుల కష్టముల నివారించుటకు గ్రాంటులు హెచ్చింపబడినవి. ఉపాధ్యాయులు తమపనిని సక్రమముగ జేయునట్లు చూచుటకు డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ల సంఖ్య

హెచ్చింపబడినది. ఈక్రొత్తపట్టముల మూలమున విస్తరించిన పనిని విచారించుటయందు డైరెక్టరుగారికి దోడ్పడుటకు కొందఱు డివిజనల్ ఇన్‌స్పెక్టర్లు నేర్పఱుపబడి యున్నారు. ప్రస్తుతము ప్రతియేట రెండు కోట్ల రూప్యములు మన రాజధానిలో ప్రాథమికవిద్యపై వెచ్చింపబడుచున్నది. ఇన్ని యేర్పాటులతో మన రాజధాని యందలి ప్రాథమికవిద్య యికముందు సర్వతోముఖముగా నభివృద్ధి జెందగలదని నమ్ముట కాస్పద మేర్పడినది.

<u>పాఠశాలలకును ఇంటికిని గల సంబంధము</u>:— బాలురు మిక్కిలి చిన్నవయస్సున అనగా నైదారేండ్ల ప్రాయమున మొదట పాఠశాలకు వత్తురు. వారి కది నూతనానుభవము. అంతవఱకు వారింటిలోఁ దమ తల్లిదండ్రుల యొద్దనేయుండి వారి ప్రేమాదరములలోఁ బెరుగుచుందురు. బాలుడు బడికి వచ్చినపుడు ఉపాధ్యాయుఁడు ప్రేమతో వానినిఁ జేరదీసి వాఁడు తన యింట నున్నపు డెంత సంతోషముగ నుండెనో బడిలోఁగూడ నంత సంతోషముగ నుండఁగలుగునట్లు చేయవలయును. బాలుర మూలమున బడికిని గ్రామములోని యిండ్లకును దగ్గర సంబంధ మేర్పడ వలయును. బడిగది శుభ్రముగానుండి తగిన పటములతో నలంకరింపఁబడి యాకర్షణీయముగ నున్నచో బాలురచ్చట నెంత కాలమైన నుండఁగోరుదురు. బడిలోని యితర బాలురసైతము క్రొత్తగా వచ్చిన బాలుర యెడల ప్రేమభావముతో మెలఁగినయెడల క్రొత్తగా వచ్చినవారి కదియత్యంతానందమును గలిగించును. ఉపాధ్యాయుఁడు బడిలో నేర్పు పాఠముల మూలమున బాలుని వయస్సు దినదినాభివృద్ధి చెందుచుండుట వలనను, వానిలో సత్ప్రవర్తన మేర్పడుచుండుటవలనను, వాని తల్లిదండ్రులకు బడిమీఁద నభిమానము తప్పక కలుగును. అట్లు కలుగవలయునుగూడ. బడిలోని బాలురలో నొక్కొక్కని గుణ లక్షణముల నుపాధ్యాయుఁడు చక్కఁగ గమనించి వానినిగూర్చి వాని తల్లిదండ్రులతో మాటలాడి వాని యభివృద్ధికై వారు చేయఁగల పనులను బట్టి వారికి సలహా నొసఁగవలయును. ఈ విధముగ నుపాధ్యాయునికిని

బాలుర తల్లిదండ్రులకును సంబంధ మేర్పడగఁ దల్లిదండ్రు లుపాధ్యాయునియెడలను పాఠశాలయెడలను నాదరము చూపుట తమ పిల్లలను బడికి క్రమముగ బంపగల్గుదురు.

పాఠశాలకును గ్రామమునకును గల సంబంధము:— గ్రామమును బాహ్యప్రపంచముతోఁ గలుపుటకు గ్రామపాఠశాల సాధనముగా నుండవలయును. గ్రామములోని సంగతులు బయటికిఁ బోవుటకును, బాహ్యప్రపంచపరిస్థితులు గ్రామములో తెలియుటకును ఆ గ్రామములోని పాఠశాలయే ముఖ్యకారణముగా నుండవలయును. ఈ పని క్రమముగ జరుగుట కుపాధ్యాయుడు తగినవాఁడుగ నుండుట యవసరము. వార్తాపత్రికలను దెప్పించి వానిలోని సంగతులను గ్రామస్థులకు జదివి చెప్పుటయేగాక, ఆరోగ్య, వ్యవసాయ, విద్యాశాఖలకుఁ జెందిన యుద్యోగులు గ్రామమునకు వచ్చినప్పుడుగాని, ప్రత్యేకముగ రప్పించిగాని వారిమూలమున గ్రామస్థులకు జ్ఞానబోధకములగు నుపన్యాసముల నిప్పింపవలయును.

పాఠశాలలలోని బాలురకు నీతిబోధకములగు నాటకములను నేర్పి తత్ప్రదర్శనముల మూలమున గ్రామస్థులలో కులము, వివాహము, స్త్రీలు మున్నగు విషయములనుగూర్చి సరియైన యభిప్రాయములను గలుగఁజేయుటకుఁ బాటుపడవలయును. మఱియు నుపాధ్యాయుఁడు బాలురతోఁ గలిసి యారోగ్యవార ప్రదర్శనములను జరుపుటయేగాక గ్రామమును శుభ్రపఱచు పనికిఁగూడ గ్రామపాఠశాల పూనుకొనునట్లు చేయవలయును.

గ్రంథాలయములను, బఠనసంఘములను నేర్పఱచి తీఱిక సమయమున వానిని నడుపుచు గ్రామస్థులతోఁ జెలిమి చేసికొని వారి జ్ఞానాభివృద్ధికి తగు ప్రయత్నములు చేయవలయును. అట్లు చేయుట కుపాధ్యాయునికి అవకాశములు లేకపోలేదు.

పాఠశాలలలోని బాలుర తల్లిదండ్రుల నందఱనొక్క సంఘముగ నేర్పరచి పాఠశాలను, అందులో జరుగుపనిని, పిల్లల చేతిపనులను

జూచుటకు వారి నాహ్వానించి, తన్మూలమున వారికి పాఠశాల యెడల మంచి శ్రద్ధ గలుగునట్లు ప్రోత్సహింపవచ్చును. అంటు వ్యాధులు చెలరేగినపుడును, ఇతర కష్టసమయములలోను ఉపాధ్యాయుడు తమ విద్యార్థులతో గూడిపోయి యా కష్టములో నున్నవారి కుచితసాహాయ్యమును చేయవలయును. అట్లు చేసినచో గ్రామస్థులు పాఠశాలను మిక్కిలి ప్రేమించి దాని యభివృద్ధికై తప్పక పాటుపడగలరు.

ప్రాథమిక విద్యను గూర్చిన లెక్కలు:—మన రాజధానిలో ప్రాథమికవిద్య తృప్తికరముగ నభివృద్ధిపొందుచుండ లేదనియు, నట్లు వృద్ధిపొందకపోవుట కనేక కారణము లున్నవనియుఁ జూచితిమి. ఆ కారణములలోఁ గొన్నింటిని తేటపరచుటకుఁ బ్రాథమికవిద్యను గూర్చిన లెక్కలు పరీక్షించుట యవసరము.

ప్రథమమున పాఠశాలలయొక్కయు, విద్యార్థులయొక్కయు సంఖ్యలను జూపు పట్టికలను జూతము.

1930—31 నుండి పాఠశాలల సంఖ్య తగ్గుచుండినను విద్యార్థుల సంఖ్య హెచ్చుచుండుటను గమనించుము.

పాఠశాలలయొక్కయు విద్యార్థులయొక్కయు సంఖ్యలు

బాలికలు

| సంవత్సరము | | పాఠశాలల సంఖ్య | | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|---|---|
| 1930—31 | ... | 5658 | ... | 3,43,502 |
| 1931—32 | ... | 5682 | ... | 3,58,895 |
| 1932—33 | ... | 5533 | ... | 3,61,762 |
| 1933—34 | ... | 5472 | ... | 3,74,912 |
| 1934—35 | ... | 5844 | ... | 3,81,514 |
| 1935—36 | ... | | | |
| 1936—37 | ... | 4832 | ... | 3,80,760 |
| 1937—38 | ... | 4725 | ... | 3,84,748 |
| 1938—39 | ... | 4604 | ... | 3,92,400 |

## పాఠశాలలయొక్కయు విద్యార్థులయొక్కయు సంఖ్యలు

### బాలుర పాఠశాలలు

| సంవత్సరము | పాఠశాలల సంఖ్య | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|
| 1920—21 | 32,482 | 13,26,539 |
| 1921—22 | 33,624 | 13.71,779 |
| 1922—23 | 35,106 | 14,59,170 |
| 1923—24 | 37,708 | 15,79,147 |
| 1924—25 | 40,340 | 16,95,863 |
| 1925—26 | 43,631 | 18,35,249 |
| 1926—27 | 46,378 | 19,25,617 |
| 1927—28 | 48,407 | 20,94,138 |
| 1928—29 | 50,096 | 21,93,845 |
| 1929—30 | 50,453 | 22,57,377 |
| 1930—31 | 50,121 | 22,95,256 |
| 1931—32 | 46,681 | 22,64,776 |
| 1932—33 | 44,359 | 22,48,189 |
| 1933—34 | 43,976 | 23,38,608 |
| 1934—35 | 43,787 | 24,17,410 |
| 1935—36 | 43,665 | 24,85,077 |
| 1936—37 | 41,128 | 24,92,909 |
| 1937—38 | 39,411 | 24,90,211 |
| 1938—39 | 37,366 | 25,13,620 |

విద్యార్థుల సంఖ్యను తరగతివారీగా జూపుట

| సంవత్సరము | I | II | III | IV | V |
|---|---|---|---|---|---|
| 1922—23 | 7,61,073 | 2,93,116 | 2,01,891 | 1,43,132 | 45,101 |
| 1923—24 | 8,17,406 | 3,19,739 | 2,20,093 | 1,54,908 | 49,646 |
| 1924—25 | 8,74,378 | 3,44,779 | 2,37,539 | 1,66,023 | 53,422 |
| 1925—26 | 9,57,856 | 3,64,392 | 2,53,504 | 1,79,159 | 57,829 |
| 1926—27 | 10,46,442 | 3,88,591 | 2,70,728 | 1,93,118 | 61,950 |
| 1927—28 | 10,99,309 | 4,11,057 | 2,84,772 | 2,04,212 | 65,947 |
| 1928—29 | 11,42,814 | 4,30,412 | 3,00,177 | 2,17,049 | 69,939 |
| 1929—30 | 11,61,243 | 4,44,601 | 3,13,105 | 2,36,397 | 72,863 |
| 1930—31 | 11,64,788 | 4,51,899 | 3,21,161 | 2,36,194 | 76,793 |
| 1931—32 | 10,95,909 | 4,59,894 | 3,26,894 | 2,47,710 | 82,536 |
| 1932—33 | 10,51,958 | 4,57,244 | 3,36,416 | 2,57,282 | 86,499 |
| 1933—34 | 10,97,850 | 4,65,129 | 3,46,580 | 2,70,479 | 93,317 |
| 1934—35 | 11,17,859 | 4,82,381 | 3,57,230 | 2,86,205 | 1,01,471 |
| 1935—36 | 11,37,992 | 4,95,939 | 3,68,407 | 2,92,955 | 1,08,186 |
| 1936—37 | 11,33,536 | 4,99,131 | 3,66,563 | 2,97,257 | 1,10,867 |

ఒంటరి యుపాధ్యాయుడు గల పాఠశాలలు 1936—37

| | బాలురు | | బాలికలు | |
|---|---|---|---|---|
| | పాఠశాలల సంఖ్య | విద్యార్థుల సంఖ్య | పాఠశాలల సంఖ్య | విద్యార్థుల సంఖ్య |
| మొదటితరగతి మాత్రమే | 247 | 5879 | 33 | 914 |
| I, II, త॥ మాత్రమే | 1127 | 27963 | 128 | 4028 |
| I, II, III త॥ మాత్రమే | 3432 | 92057 | 404 | 12310 |
| మొదటి నాలుగు లేదా అయిదు తరగతులు | 12418 | 352202 | 720 | 24756 |
| మొత్తము | 17224 | 478101 | 1285 | 42008 |

ఒంటరి యుపాధ్యాయుడు గల పాఠశాలలో దృష్టికరము ఁ పని జరుగుట కష్టము.

## ప్రాథమిక పాఠశాలలలోని యుపాధ్యాయుల సంఖ్య

| సం॥ | పురుషులు: తర్బీతు పొందనివారు | పురుషులు: తర్బీతు పొందినవారు | పురుషులు: మొత్తము | స్త్రీలు: తర్బీతు పొందనివారు | స్త్రీలు: తర్బీతు పొందినవారు | స్త్రీలు: మొత్తము |
|---|---|---|---|---|---|---|
| 1930—31 | 43,511 | 54,686 | 98,197 | 3,507 | 8,812 | 12,319 |
| 1931—32 | 39,222 | 57,312 | 96,534 | 2,984 | 9,420 | 12,404 |
| 1932—33 | 35,510 | 59,146 | 94,656 | 2,592 | 9,974 | 12,566 |
| 1933—34 | 32,751 | 62,451 | 95,202 | 2,362 | 10,960 | 13,322 |
| 1934—35 | 31,446 | 65,644 | 97,090 | 2,204 | 11,673 | 13,877 |
| 1935—36 | | | | | | |
| 1936—37 | 26,250 | 68,460 | 94,710 | 2,347 | 13,133 | 15,480 |
| 1937—38 | 20,471 | 71,367 | 91,838 | 1,994 | 13,978 | 15,972 |
| 1938—39 | 16,961 | 72,723 | 89,684 | 2,061 | 14,575 | 16,636 |

ప్రాథమిక విద్యకై సర్కారువారు చేయుచున్న వ్యయము

| సంవత్సరము | బాలుర పాఠశాలల కొఱకైన వ్యయము | ఒక్కొక్క విద్యార్థి కైనవ్యయము | బాలికాపాఠశాలల కొఱకైన వ్యయము | ఒక్కొక్కవిద్యార్థిని కైనవ్యయము |
|---|---|---|---|---|
| 1930—31 | రూ 1,89,68,005 | రూ 8.42 | రూ 43,34,152 | రూ 14.23 |
| 1931—32 | రూ 1,91,22,295 | రూ 8.58 | రూ 43,50,268 | రూ 12.43 |
| 1932—33 | రూ 1,84,90,470 | రూ 8.27 | రూ 41,92,190 | రూ 11.77 |
| 1933—34 | రూ 1,90,71,430 | రూ 8.36 | రూ 42,91,162 | రూ 11.77 |
| 1934—35 | రూ 1,91,78,351 | రూ 8.11 | రూ 43,45,734 | రూ 11.63 |
| 1935—36 | | | | |
| 1936—37 | రూ 1,93,80,058 | రూ 7.89 | రూ 41,95,946 | రూ 11.05 |
| 1937—38 | రూ 2,01,53,031 | రూ 8.08 | రూ 42,71,196 | రూ 11.28 |
| 1938—39 | రూ 2,08,54,985 | రూ 8.26 | రూ 43,84,485 | రూ 11.22 |




## ప్రశ్నలు

(1) విద్య యనగేమి? దాని యుద్దేశమేమి? ప్రస్తుతము పల్లెటూరి జనుల విద్యలోని లోపములను గొన్నింటిని పేర్కొని వానిని నివారణచేయు పద్ధతులను వివరింపుము.

(2) ప్రాథమిక విద్యలో ప్రకృతిపరిశీలనము నెందులకు చేర్పవలయును?

(3) గ్రామములలో శాశ్వతముగ నక్షరాస్యతను గలిగించుపద్ధతులను పేర్కొనుము?

(4) హిందూదేశములో నుండిన పూర్వపు విద్యావిధానమునకును, ప్రస్తుత విద్యావిధానమునకును గల కొన్ని భేదములను దెల్పుము.

(5) ఒంటరి యుపాధ్యాయుడు గల పాఠశాలలో తృప్తికరముగ పనిజరుగదా? ఎందులకు?

(6) బోధనాభ్యసన తర్ఫీదులేని యుపాధ్యాయుల సంఖ్య యెట్లు తగ్గినదో చూపుటకు పటమును వ్రాయుము.

(7) గ్రామపాఠశాలను గ్రామబాలుర కాకర్షణీయముగ నెట్లు చేయుదువు?

(8) గ్రామపాఠశాల లేని గ్రామమును, బడి యున్న గ్రామమును నీకు దెలిసినవానిని, 1. బాలుర శుభ్రత 2 గ్రామశుభ్రత 3. గ్రామస్థుల సామాన్యజ్ఞానము 4. విద్యనుగూర్చి జనుల యభిప్రాయము—వీనినిబట్టి యొకదానితో నొకదానిని పోల్చుము.

(9) 1923 వ సంవత్సరమున మొదటి తరగతిలో ప్రవేశించినవారిలో నెంతమంది 1989 వ సంవత్సరమున నైదవతరగతిలో నుండిరి? పట్టీచూడుము. బాలుర సంఖ్య నూటి కెంత క్షీణించెనో చూపుటకుఁ బటమును సిద్ధము చేయుము.

---

# 2. ప్రాథమిక పాఠశాల

పాఠశాలాధికారులు పాఠశాలా నిర్మాణమునుగూర్చి యుపాధ్యాయులతో సామాన్యముగ నాలోచనచేయరు. అయినను పాఠశాలా భవనము, దాని పరిసరములు నెట్లుండ వలసినదియు నుపాధ్యాయులు తెలిసికొనియుండుట మిక్కిలి యవసరము. అట్లు తెలిసికొని యున్నచో పాఠశాలలోని తరగతులకుఁ దగిన స్థలము లేర్పఱచుటకు, నల్లబల్ల మొదలగు సామానుల నుచిత స్థలములలో నుంచుటకును నెఱిగియుండి బడిలోని పని నిరాటంకముగ జరుగునట్లుపాధ్యాయులు చూడగలరు.

బడిస్థలము:—పాఠశాలను కట్టుటకుఁ దగిన స్థలము నేర్పఱచుట మొదటిపని. బడిని పల్లపుభూమిలోఁ గట్టరాదు. అట్లుకట్టినచో వర్షకాలమున చుట్టు నీరు నిలిచి యనారోగ్యమును కలిగించును. మిక్కిలి యెత్తుగా నుండు చెట్ల సమీపమున సైతము కట్టరాదు. ఏలయన ఆ చెట్ల మూలమున బడిలోనికి గావలసినంత వెలుతురు వచ్చుటకు వీలు లేకుండును. అట్లని చెట్లే యుండరాదనుట గాదు. ఆటస్థలమునకుఁ గొంతదూరములో చెట్లుండుట మంచిది. పాఠశాలను నిర్మించుచోటు పూడ్చి చదరముచేసిన ప్రదేశముగా కూడ నుండ రాదు. అట్టిస్థలములు వర్షకాలమున చెమ్మగిల్లి తేమగానుండి యనా-

రోగ్యమునకు కారణమగును. దుమ్ము, ధూళి యెక్కువగాఁ జిమ్ము రాజమార్గములకు సమీపములోఁగాని, జనసమ్మర్దముగల ప్రదేశములకు దాపునఁగాని, రైల్వేస్టేషనులు, యంత్రశాలలు మున్నగువాని పరిసరములలోని పాఠశాలలను నిర్మింపరాదు. మఱియు మురుగు నీటి కాలువలుగాని, నీటి గుంటలుగాని, దట్టముగఁ బెరిగియున్న చెట్ల పొదలుగాని పాఠశాలకు సమీపమున నుండరాదు. పాఠశాలా నిర్వహణమున కివియన్నియు భంగకరములే యగును. కనుక బడి ప్రదేశము చుట్టుపక్కలనుండు ప్రదేశములకంటె గొంచె మెత్తుగ నుండవలయును. మంచి వెలుతురును, పరిశుభ్రమైన గాలియు ధారాళముగా బ్రసరించుట కనువుగానుండవలయును, అక్కడ వాననీరు నిలుచునట్లుండరాదు. ఇట్టి ప్రదేశము పాఠశాలా నిర్మాణమునకు మిక్కిలి యనువుగా నుండును. ఇట్టి స్థలములు సామాన్యముగ గ్రామము వెలుపలనేదొరకఁగలవు. పాఠశాలకట్టడములకు మాత్రమే యీ వసతులను జూచుటకాదు పాఠశాలకు సంబంధించిన యాట మైదానముగూడఁ గావలసినంత పాఠశాల ప్రక్కనుండునట్లు స్థల నిర్దేశము చేయవలయును.

పారిశుద్ధ్యము:—పాఠశాలయు, దాని పరిసరములును మిక్కిలి శుభ్రముగ నుండవలయును. పాఠశాల సమీపమున మఱుఁగు దొడ్లుగాని, కసవుకుప్పలుగాని, దిబ్బలుగాని యుండరాదు. అట్టివి యున్నయెడల నందుండి వచ్చు విషవాయువులు బాలుర యారోగ్యమును భంగపరచును. వాననీరు నిలువరమగు గుంటలుగాని, దట్టముగ బెరిగిన కసవుచెట్లుగాని యా పరిసరముల నుండరాదు. అవి యున్నచో దోమలు బయలుదేఱి చలిజ్వరముల దెచ్చిపెట్టును. పాఠశాలలోని గదులలోసైతము కాగితపుముక్కలు, పండ్లతొక్కలు మొదలగునవి పడియుండనియ్యరాదు. అట్టివానిని వేయుటకు ప్రతి గదిలోను ఒక బుట్టనుంచవలయును. బడిగదులు శుభ్రముగానుండి యన్నివిధముల నాకర్షణీయములై యుండవలయును.

బడి కట్టడము:—మంచిస్థలము దొరికినపుడు దానిమీద నెట్టి బడికట్టడమును కట్టవలయునో యాలోచింపవలయును. కట్టడము చిన్నదైనను, పెద్దదైనను బడిపని నిరభ్యంతరముగ సాగుట కనుకూలముగా నుండవలయును. పెద్ద పెద్ద ప్రాథమిక పాఠశాలలలో నొక పెద్దగది యుండవలయును. అదిగాక ప్రతి తరగతికిని ప్రత్యేకముగ నొకగది యుండవలయును. ప్రతి తరగతికిని వేర్వేరుగా నొక్కొక్కగది యేర్పాటు జేయలేనప్పుడు రెండు తరగతులకు నడుమ కఱ్ఱతోగాని, బట్టతోగాని చేసినతెర నడ్డము పెట్టవచ్చును. అట్లు చేయనియెడల బడిపని కాటంక మేర్పడును. పాఠశాల గదులలో నొక్కొక్కగది యిరువది యడుగుల వెడల్పును, నంతియే పొడవును గలిగియుండుటమంచిది. వెడల్పులో నిరువదినాలు గడుగులకు మించి యుండుట మంచిదికాదు. ఉపాధ్యాయుఁడు కూర్చుండువైపున గోడకు నల్లబల్ల నమర్పవలయును. బాలురు చేతిపని తరగతులలో నుపయోగించు చిన్న కొలిముట్లును, వారుచేయు వస్తువులును మొదలైనవి భద్రపరచుటకు గోడలలోనే యర యుండునట్లేర్పాటు చేయవలయును. పాఠశాలాభవనము పూరికొట్టమైనచో గోడలు 10 అడుగులయెత్తులోనుండవలయును. మిద్దెయిల్లయినచోఁ బండ్రెండడుగుల యెత్తుండవలయును. ప్రభుత్వశాసనము ననుసరించి యొక్కొక్క తరగతిలోఁ జదువుచుండు ప్రతి బాలునికి 9 చదరపుటడుగుల ప్రదేశము కావలసియుండును.

ఒకవేళ నాయా తరగతులలోని బాలురసంఖ్య హెచ్చిన నప్పటికిని సరిపోవునట్లుగా గదులను గొంచెము పెద్దవిగనే కట్టుట మంచిది. గదులలో నడుగుభాగమును నీటితో కడుగుటకు వీలగునట్లుగా నిటుకలతోనో, రాళ్ళతోనో పఱచవలయును. పైభాగమున వేసవికాలములో నెండవేడిమి లోనికి రాకుండునట్లును, వర్షాకాలములో వర్షము లోపలఁ గురియకుండునట్లును దట్టమైన కప్పు ఉండవలయును. వీలయినచో బడిచుట్టు వసారా యుండుట మంచిది.

ప్రస్తుతము గ్రామములలోని ౨ బడికట్టడములలో దగిన వసతి లేక కొన్ని మిక్కిలి యిరుకుగను, అనారోగ్యకరముగను నున్నవి. (అనుబంధము 1 చూడుము.)

గాలి, వెలుతురు:—తరగతి గదిలోనికిగాలియు, వెలుతురును ధారాళముగ వచ్చుటకు కావలసినన్ని తలుపులును, కిటికీలును ఉండవలయును. ప్రతిగదికి రెండుతలుపు లుండుట మంచిది. గదియొక్క కిటికీలు నేలనుండి రెండున్నర, మూడడుగుల యెత్తున నుండవలయును. వీని వైశాల్యము 'కూర్చుండుస్థలము' యొక్క వైశాల్యములో నయిదవ వంతై యుండవలయును. వెలుతురు ఉత్తరమునుండియు, నది సాధ్యముకానిచో దక్షిణమునుండియు నైన, వచ్చునట్లేర్పాటు చేయవలయును. బాలురు కూర్చున్నపుడు వెలుతురు వారి యెడమ వైపునుండి వచ్చునట్లు చేయుటవలన బాలురు వ్రాయునపుడు కలము పెన్సిలుయొక్క నీడలు వారి వ్రాతమీద బడకుండును.

గదిలోనికి వచ్చు వెలుతురు గది యంతటను బాగుగ వ్యాపించునట్లు చూడవలయును. నల్లబల్లపై వెలుతురు తగినట్లు పడనిచో బాలురకన్నులకు శ్రమకలిగి వారి గమనము పాఠముల మీద నుండకుండ బోవును. మంచిగాలి ధారాళముగ లోనికివచ్చుటకును, చెడుగాలి బయటికి బోవుటకును వీలగునట్లు కిటికీ లెదురెదురుగ నుండవలయును. పరిశుద్ధమైన గాలి గదిలోనికి రాకున్నచో, బాలురు చెడుగాలిని పీల్చి తల నొప్పిచే విసుగును, అశ్రద్ధను గనబరతురు. చెడుగాలి బయటికి బోవుటకు కప్పునకు సమీపమున గవాక్షము లుండవలయును. ఇంటిగోడ లెత్తు తక్కువగా నుండినను, కొట్టములయినను గవాక్షము లవసరము లేదు.

బడి హైజీను-తరగతి గదుల శుభ్రత:—శుభ్రత యొక్క యావశ్యకతను బాలురు పాఠశాలలో నేర్చుకొనవలసి యున్నారు. దానిని నేర్చుకొనుటకు దరగతియొక్క శుభ్రత యొకసాధనమై యుండవలయును. గ్రామములోని బాలురలో గొందరు శుభ్రతలేని యిండ్లనుండి వచ్చుచుందురు. అట్టివారు బడిలోని శుభ్రతను జూచి

తమ యిండ్లనుసయితము శుభ్రముగ నుంచుకొనగోరునట్లు చేయు నంతటి శుభ్రత తరగతి గదిలో నుండవలయును. బాలురు కాగితపు ముక్కలు, దారపుతునకలు, పీచులు, చేతిపనులు నేర్చుకొనునపుడు వాడుకొను నానావిధవస్తువుల ముక్కలు సాధారణముగ నేలపైబడ వేయుచుందురు. అట్టివి జరుగకుండున ట్లుపాధ్యాయుడు చూడ వలసియున్నది. అట్టి చిరుగులను బడవేయుటకు ప్రతి తరగతిలోను నొకబుట్ట యుండవలయును. పనికిరాని కాగితములు చిరుగులు మొదలైన వానిని పిల్లలు దానిలో వేయునట్లుపాధ్యాయుడు బాలురకు హెచ్చరిక చేయవలయును.

తరగతి గోడలమీద సిరాచుక్కలను వేసియు, పెన్సిలు గీతలు గీచియు, తలుపులు కిటికీలుమీద సుద్దముక్కలతో వ్రాసియు వాని నశుభ్రము చేయకుండునట్లు బాలురనుపాధ్యాయులు హెచ్చరింప వలయును. పలకలు, పుస్తకములు, బడిసామానులు శుభ్రముగ నుంచునట్లుపాధ్యాయులు శ్రద్ధ చేసినయెడల బాలురు తమ చిన్నతనము నుండియే శుభ్రతను నేర్చుకొందురు.

పాఠశాలకు వచ్చిన బాలురు విరామ సమయముల లోను, కొన్ని వేళల నాటలు నేర్చుకొనునపుడును దప్పిగొనుటయేగాక యాటల మూలమున వారి కాలుచేతులకు మైలపట్టును. అప్పుడు వారు దమ దప్పిని తీర్చుకొనుటకును, కాలుచేతులు శుభ్రము చేసికొనుటకును గావలసినంత శుద్ధజలము బడి యావరణలో నుండవలయును. బడి సమీపమున నొక చేదుడుబావి యున్నచో దానినీరు త్రాగుటయే కాక బడితోటకు సయితము బాగుగ బనికివచ్చును.

బాలుర శుభ్రత :— దేహారోగ్యము బడి హైజీనులో చేరి యున్నదని యుపాధ్యాయుడు దెలుసుకొనవలయును. దేహము యొక్కయు, వస్త్రులయొక్కయు శుభ్రత నుపాధ్యాయుడు బాలురకు జక్కగ బోధింపవలయును. అనుదినస్నానమునకును, దేహారోగ్యమునకును గలసంబంధమును బాలురకు బోధింపవలయును. ఈ సందర్భమున నుపాధ్యాయుడు చేయవలసిన పనులు కొన్ని కలవు అవియేవన;

ప్రతిదినము బాలురు బడికిరాఁగానే యుపాధ్యాయుఁడు వారి నంద ఱను నిలుఁవబెట్టి వారి తలలు, దుస్తులు శుభ్రముగ నున్నదియు లేనిదియు బరీక్షించి యశుభ్రముగ నున్న బిడ్డలు తమతలలు దువ్వు కొని, శుభ్రమగు దుస్తులను ధరించుకొని వచ్చులాగున వారి నింటికి బంపివేయవలయును. మఱియు పండ్లుశుభ్రముగఁ దోమకొనకయు, చేతిగోళ్ళు కత్తిరించుకొనకయు వచ్చినవారిని ఒకటి రెండుమాఱులు హెచ్చరించిన పిదప వారు శుభ్రతయందింకను వెనుక బడియున్నచో వారిని సయితమింటికి బంపవలయును. ఇట్లు గొంతకాల ముపాధ్యాయుఁడు చేసినచో బాలురు శుభ్రతను నేర్చుకొందురు. బాలుర నీవిషయమున జక్కబెట్టుట కుపాధ్యాయుఁడు కొన్నివేళల బాలుర తలిదండ్రులతో ముచ్చటింప వలసియుండును.

పాఠశాలలోని బాలురకు రాఁగలకొన్ని సామాన్యరోగ ములు, వానిగుర్తింపు, ప్రథమచికిత్సయుఁ గూడ నుపాధ్యాయునకు తెలిసియుండవలయును. తలనొప్పి, జ్వరము, కండ్లకుట్లు, తీట, గజ్జి, స్ఫోటకము,దృష్టిమాంద్యము,గొంతువ్యాధి,గవదబిళ్ళలు.ఇవి విద్యార్థు లకు రాఁగల సామాన్యవ్యాధులు. వీనినిగూర్చి విపులముగ వ్రాయు టకు స్థలముచాలదు. తలనొప్పి వచ్చినప్పుడు కణతలు వేడిమెక్కి బాధకలుగును. జ్వరము తగిలినపుడు బాలుని దేహములోని వేఁడిమి హెచ్చి చదువ లేకపోవును. కండ్లు కుట్టినపుడు కన్ను లెఱ్ఱబారి నీరు కారుచుండును. పుస్తకము చదువుట సాధ్యముకాదు. స్ఫోటకము జ్వరముతోఁ బ్రారంభమగును. గొంతు వ్యాధులలో 'అడినాయిడ్సు' 'టాన్సిల్సు' ముఖ్యమైనవి. ఇవియున్న బాలురు నోరు తెరచుకొని యూపిరి పీల్చుచుందురు. గవదబిళ్ళలు వచ్చిన బాలురకు చెవులక్రింద వాపుచూపి బాధగానుండును. ఈ వ్యాధులుగల బాలుర నుపా ధ్యాయుఁడు గమనించినతోడనే వారి నింటికి పంపివేయవలయును. గజ్జి యొక చర్మవ్యాధి. ఇది అంటురోగము వ్యాధి నివారణయగు వరకు రోగిని బడికి రానియ్యరాదు.దృష్టిమాంద్యము,దూరపుచూపు,

దగ్గరచూపు అని రెండువిధములు. ఈ వ్యాధిగల బాలురు వైద్యునిచే నిర్ణీతమైన సులోచనముల నుపయోగింప వలయును.

మఱుగు దొడ్డు:—మన దేశమున గ్రామములలో సాధారణముగ మఱుగుదొడ్లు లేనందున జనులు బయలు ప్రదేశమున మలవిసర్జనముచేయు సంగతి మనమెరిగి యున్నాము. విద్యార్థులు మలమూత్ర విసర్జనము బడియావరణములోఁ దమకిష్టమువచ్చినచోటఁ జేయక మరుగుదొడ్లను వాడుకొను నభ్యాసము వారిలోఁ గలిగింపవలయును. ఇందులకై ప్రతి పాఠశాలకును మఱుగుదొడ్లుండుట యవసరము. పాఠశాలలో బాలురు, బాలికలు చదువుచున్నచో బాలురకును, బాలికలకును వేర్వేరుగ నీ దొడ్లుండవలయును. మఱుగుదొడ్లనూద్చుట కేర్పాటులున్న గ్రామమున ఱాతితో గట్టిన దొడ్లు బడి సమీపమున అనఁగా బదునైదు, ఇరువదిగజముల దూరములో నుండవలయును. అందుండి చెడుగాలులు పాఠశాలమీదికి రాకుండునట్లు దానికి స్థలము నేర్పరుపవలయును. ఱాతిదొడ్లను గట్టించుటకు ధనము లేనపుడును బ్రతిదినము వానిని శుభ్రముచేయు నేర్పాటులు లేనపుడును తడకలతోఁ గాని, చెట్లయాకులతోఁగాని దొడ్లను నిర్మింపవచ్చును.

వీని నిర్మాణమునకు విశేషధనము వ్యయముచేయ నక్కఱ లేదు. మిక్కిలి చౌకరకము దొడ్ల నీక్రిందవిధమున నిర్మింపవచ్చును. ఈతాకు మఱుగుదొడ్డి 5 అ × 15 అ:—తాటాకులతోఁ గాని యీతాకులతోఁగాని మైదడుగుల వెడల్పును, పదునైదడుగుల పొడవును గల తడకగా నమర్చి చీల్చిన వెదుళ్ళతో దానినిబిగింపవలయును. ఇదే వెడల్పును పంద్రెండడుగుల పొడవును గల మరియొక తడకను, ఆఱడుగుల పొడవుగల రెండుతడకలను సిద్ధముచేసి వానిని వెదుఱుకట్ల సహాయమున నిలువబెట్టవలయును. 3 అ × 5 అ. విస్తీర్ణముగల తలుపును సిద్ధముచేసి దొడ్డి కమర్చవలయును. లోపల నేలమీఁద పొడవు తడక కొక యడుగుదూరమున నొకదాని కొకటి యొక్కొక్కగజము దూరములో నుండునట్లు మూడడుగుల లోతును

తొమ్మిదంగుళముల వ్యాసమును గల గుంతలు త్రవ్వవలయును. ఒక్కొక్క గుంతమీఁదను గట్టిచట్టము నొకదాని నుంచవలయును. మలవిసర్జనము చేసిన తోడనే దానిని గప్పివేయవలయును. అందులకుఁ గావలసిన యిసుకనో లేక పొడిమట్టినో యొకమూల కుండలో నుంచవలయును. గుంతలు దాదాపుగా నిండినపిదప దొడ్డినికొంచము ముందునకు జరుపవలయును.

బడితోఁట:—విద్యాశాఖవారి ప్రస్తుత చట్టముల ననుసరించి, ప్రతి ప్రాథమిక పాఠశాలకును నొక తోఁట యుండవలయును. అట్లు లేకున్న గ్రాంటు తగ్గింపఁబడును. ఒకవేళ తోఁట వేయుటకు స్థలము లేనిచోఁ గావలసినంత స్థలమును రైతుల యొద్దనుండి కొనుటకు వలయు చట్టములను గూడ పాఠశాలాధికారులు (సర్కారువారు) చేసియున్నారు. ఈ విషయమును గుఱించిన విశేషములు ఆటస్థలము అను నంశముక్రింద వివరింపఁబడినవి.

బడితోఁటయొక్క ప్రాముఖ్యతనుగూర్చి యొకమాట చెప్ప వలసియున్నది. అందమగు పూలతోఁట బడిసమీపమున నున్నచో నది బడికిని, దానిపరిసరములకును శోభనుగలిగించును. పాఠశాలలో ప్రకృతి పాఠములు నేర్పునపుడు విత్తనములు మొలకలెత్తుట, నానా విధములగు వేళ్ళు, ఆకుల యమరికలు, పువ్వులు మున్నగు విషయములను బాలురు గమనించునట్లు చేయుటకు బడితోఁట మిగుల ప్రయోజనకరముగ నుండును.

హిందూదేశము వ్యవసాయికముగుటచే గ్రామపాఠశాలలోఁ జదువు ప్రతిబాలుడును మొక్కలను గుఱించియు, వాని యభివృద్ధికిఁ గావలసిన వసతులను గురించియుఁ దెలిసికొన వలసిన ప్రధానవిషయములు నేర్చుకొనుట మిగుల నుచితము. పాఠశాలలో వ్యవసాయ పద్ధతులు శాకపోయినను మొక్కలను గూర్చినకొన్ని సామాన్యవిషయములు ప్రతిబాలుడు నేర్చుకొనియే తీరవలయును. అందులకుఁ దోట చక్కఁగఁ బనికివచ్చును. చేతులతోఁ గష్టపడి పనిచేయుట విద్యా వంతులకుఁ దగదను దురభిప్రాయము సామాన్యముగా నున్న మన

దేశమున బడితోటలో బనిచేయుటవలన చేతులకష్టమున కంటె యున్న యగౌరవమును దొలగించుటకు వీలగుచున్నది అంతియగాక తోటలో జేసెడిపని బాలురకుల్లాసమును గలిగింపగలదు తోటలోని పుష్పాలు పాఠములను బోధించుటకుమాత్రమే కాక పాఠశాలలోని తరగతిగదుల నలంకరించుటకును పనికివచ్చును. తోటలో గూరగాయలు సమృద్ధిగ బండినయెడల వానిసమ్మి కొలదిగనైనను సొమ్ము సంపాదించవచ్చును.

తోట వేయుటకు స్థల మొకటి దొరకినంత మాత్రమున ప్రయోజనము లేదు. నీటివసతికూడ నుండవలయును. సమృద్ధిగ నీటి వసతి లేనప్పుడు తోటను బెంచుట సులభముగాదు. బడిసమీపమున బావియుండుట శ్రేష్ఠము. ఒకవేళ బావిదగ్గర లేకున్నను బాలుర చేత గడవలతో నీరు తెప్పించి తోటను బెంచవలయును. నీరు దూరమున నున్నప్పుడు తోట చిన్నదిగా నుండవచ్చును. తోటలో బనిచేయుటకు గావలసిన సామానులు బహుస్వల్పము. కొన్ని చిన్న పాఱ లుండిన చాలును. అవియు లేకున్న వానికి బదులు తెచ్చుకొనవచ్చును. తోటకుగావలసిన యెరువులను బాలురును, ఉపాధ్యాయులును గలిసి సేకరింపవచ్చును. చెట్లయాకులు, వర్షాకాలములో దెప్పలుగా వచ్చిన వృక్షపదార్థము, బంకమట్టి, పేడ—వీని నన్నిటిని దోటలో నొకమూల గోతిని త్రవ్వి భద్రము చేసినయెడల కావలసిన యెరువు లభింపగలదు.

తోటలో నేమి పెంచవలయును?:-బడితోటయొక్క ప్రధానోద్దేశము పాఠశాల కందముగూర్చి, ప్రకృతిపాఠముల బోధనకు దోడ్పడుటయే కావున నీ యుద్దేశములను నెరవేర్చగల మొక్కలను దోటలో బెంచవలయును. నానావిధములైన పూలమొక్కలు బడితోటలో నుండవలయును. బంతి, మల్లె, గులాబి, సూర్యకాంత, చంద్రకాంత, లిల్లి, కనకాంబరము, నీలాంబరము, బొల్సము, జినియా, కాస్మాసు మొదలగునవి పుష్పములలో ముఖ్యములయినవి. వంగ, బెండ, గోరుచిక్కుడు, బీర, సొర, చిక్కుడు, తంబ, పొట్ల, మొద

లగు కూరగాయలను, గోగు, మెంతి, గంబాళి, చుక్క, తోటకూర మొదలగు ఆకుకూరలను బడితోటలో పెంచవచ్చును. ఇవిగాక జొన్న కొఱ్ఱ, ప్రత్తి, వరి మొదలగు ధాన్యములను, కంద, ముల్లంగి, ఉల్లిపాయ మొదలగు గడ్డపైరులను కొంచెముగ పాఠముల బోధనకై పెంచనగును.

తోటను కొన్ని భాగములుగ చేసి, బాలురు నడచుటకు దారు లేర్పరచి, యొక్కొక్క భాగము నొకతరగతి బాలురకుగాని, లేదా బడిలోని బాలురందఱను కొన్ని గుంపులుగ భాగించి యొక్కొక్క గుంపున కొక్కొక్క భాగమును గాని యిచ్చిన నా తరగతులును, గుంపులును నొకరితో నొకరు పోటీచేసి మొక్కలను పెంచగలరు. (క్రింది పటమును చూడుము)



బడితోటను గ్రామములోని పశువులు, గొఱ్ఱెలు, మేకలు మొదలైనవానినుండి రక్షించుట మిగుల నవసరము. లేనిచో దోటలో నే మొక్కయు బ్రతుకదు. తోటచుట్టు తీగె కంచెయైనను ముండ్ల కంచెయైనను వేసి భద్రము చేయవలెను. తీగకంచె వేయుటకు వ్యయము మెక్కువ కాగలదు. ముండ్లకంచె వేయుటకు విశేషద్రవ్య మక్కఱ లేదు. పాఠశాలాభిమానులగు రైతుల పొలములనుండి కొన్ని ముండ్ల చెట్ల కొమ్మలను తెప్పించుకొని యీ కంచెను సిద్ధము చేయవచ్చును. దానికిఁ దగిన తలుపును బిగింపవలయును.

తోఁటపని ముఖ్యమైనదైనను మిక్కిలి యవసరమైననే తప్ప బడిసమయమునఁ జేయరాదు. కాని ప్రతిదినము వారమునకు మూఁడు పర్యాయములైన సాయంత్రము బడి విడిచినతోడనే తోఁటపని చేయుట యుక్తము. ఉపాధ్యాయులు బాలురతోఁ గలిసి యీ పనిని జేసినయెడల బాలురకుఁ బ్రోత్సాహముగ నుండును. బడికి తోఁట స్థలము కొంచెమైనను లేనప్పుడుపాధ్యాయుఁ డంతటితో నిరాశఁ జెంది యూరకుండరాదు. పాత గంపలలోనో, చెక్కపెట్టెలలోనో లేదా మట్టి తొట్లలోనో కొన్ని మొక్కలను బెంచవచ్చును. ఈ పనియుఁ జేయని యుపాధ్యాయుల బడులకు గ్రాంటులో కోఁత యుండగలదు.

బడి నలంకరించుట:—పాఠశాలయు దాని పరిసరములును పరిశుద్ధముగ నుంచఁబడినచో నవి యందముగ నుండును. వానికితర అలంకరణములతోఁ బనియుండదు. తరగతి గదిలోనికిఁ గావలసిన గాలియు, వెలుతురును వచ్చుచుండ గోడలు శుభ్రముగా నుండి గది లోని సామానులు వాని వాని స్థలములలో నమర్పఁబడియున్నపుడా గదికి తదితరాలంకరణములతోఁ బనియేమి? కాని యలంకరణములు చేయవలసి వచ్చుచో నొక చిన్న గ్లాసులో నీళ్ళు పోసి బడితోఁటలోని పువ్వులను దానిలోఁ బెట్టి యుపాధ్యాయుని బల్లమీఁదఁ బెట్టినచోఁ నది యా గదికి నందమును గలిగించును. ఇంకను నలంకారము కావలసిన యెడల వార్తాపత్రికలలో నుండియు నితరపత్రికలలో నుండియు

చక్కని బొమ్మలను సేకరించి వాని నట్టకాగితపు చట్రములతో బిగించి వానిని గోడలకు వ్రేలాడఁ గట్టవచ్చును; లేదా ఉపాధ్యాయుఁడు చిత్రలేఖనమునందు తనకుఁగల కౌశలమును ప్రకటించి గణితము, వాచకము మొదలగు పాఠములను నేర్పుటకుఁ దాను సిద్ధముచేసిన చిత్రములను దగినరీతిని గోడలమీఁద వ్రేలాడ వేయవచ్చును.

మఱియు నట్టలపై సుందరముగ నీతివాక్యములు వ్రాసి వాని గోడను బడి నలంకరింపవచ్చును. ఏయంగడిలోనో కొని తెచ్చిన యచ్చుపటములకంటె నివి యెన్నియో రెట్లు శ్రేష్ఠములయిన యలంకారములుగ నుండఁగలవు. ఈ యలంకారములను రెండు మూఁడు నెలలకొకతూరి మార్చుచుండవలయును. పాఠశాలలో నొక్కటికంటె నెక్కువ గదులున్నయెడల పటములను నొక గదినుండి మఱియొక గదికి మార్చుచుండవలయును.

కాని, కొన్ని పాఠశాలలలో రంగు కాగితములతో సిద్ధపఱుపఁబడిన చెట్లు, పుష్పాలు, గోళములు, గొలుసులు చేసి బడి నలంకరింతురు. ఇవి సామాన్యముగా నే విద్యార్థి గారి రాక కొఱకో చేసి నెలల పర్యంతము వానిని గట్టియుంచుదురు. ఇట్టి యలంకారములు త్వరలో నందవిహీనమయి దుమ్ముపట్టి చూచుట కసహ్యముగనుండును. ఈ యలంకారములు చేయుటకెక్కువ సొమ్ముగూడ వ్యయము చేయవలసియుండును. బాలురకు బాఠశాలలో రాజభక్తి నేర్పుట విధియై యున్నది. కనుక మన దేశ ప్రభువులుగ నున్న చక్రవర్తి, రాజప్రతినిధి, గవర్నరు—వీరియొక్కయు, వీరి సతీమణులయొక్కయు ఛాయాపటములను బాఠశాలలలో నుంచుట యెంతయు దగియున్నది. కాని పటములను గోడలకుఁ దగిలించు సందర్భమున గోడల కనేక స్థలములలో మేకులతో రంధ్రములుచేసి గోడల యందమును చెడగొట్టకుండ జూడవలయును.

ఆటస్థలములు:—శరీర వ్యాయామము బాలురవిద్యలోనొక ముఖ్యభాగము. శరీర వ్యాయామముచే దేహములోని ముఱికిపదార్థము బయల్వెడలి దేహమున కారోగ్యము కలుగును. ఆరోగ్యవంతుఁ

డగు బాలునిమనస్సు తేజోవంతమై చురుకుఁగ బనిచేయును. పెక్కుమంది బాలురొక్కచోట జట్టుగ నొక ప్రకార మాటలాడునపుడు వారు నైతికముగ సైతము లాభమును పొందఁగలరు. విధేయత, సహకారము, త్యాగము, అన్యోన్యసహాయము పాఠశాల యెడఁ ప్రేమ మొదలగు దొడ్డగుణముల నలవరచుకొనఁగలరు. ఈ సత్యమును గ్రహించియే నేఁటి విద్యావిధానములో శరీర వ్యాయామమునకు అతి ప్రధానవిషయముగ భావించుచున్నారు. ఈ వ్యాయామము సాగించుటకు ప్రతి బడికిని చాలినంత యాటస్థల ముండవలయును. అదియును సమభూమియై దుమ్ము ధూళి రేగు స్థలములకించుక దూరములో నుండవలయును ముండ్లచెట్ల సమీపమున నుండరాదు. కావలసినంత పరిశుద్ధమైనగాలి లభింపఁగల ప్రదేశమైయుండవలయును.

ఏ పాఠశాలకుగాని యట్టి స్థలము గావలసినంత లేనిచో నా పాఠశాలాధికారులు సర్కారునకు దరఖాస్తుచేసి తమ యక్కఱలకు సరిపోవునంత భూమిని సంపాదింపవలయును. పాఠశాల నిర్మాణమునకును, బడితోటలకును, ఆటస్థలములకును భూమి కావలసినపుడు సర్కారునకు దరఖాస్తు చేయునపుడు గమనించవలసిన విధులు క్రింద చూపబడినవి.

సర్కారు ద్రవ్యసహాయము పొందుచున్న పాఠశాలలకు గావలసిన భూమికొఱకు దరఖాస్తు పంపునపుడు ప్రతి దరఖాస్తు వెంట నీ క్రింద వివరములు పంపవలసినట్లు చట్టము వలన తెలియుచున్నది.

1 పాఠశాలాధికారులపేరు (మేనేజిమెంటు ఏదైనా మిషనుదా? లేక యొక సంఘముదా?) అని తెలుపవలయును
2. పాఠశాలకు శాశ్వతమైన 'రికగ్నిషన్' ఉన్నదా, లేదా? ఉన్నచో ఏ యే తరగతులకు రికగ్నిషను ఉన్నది?
3. దరఖాస్తుచేయుటకుఁ బూర్వ మాఱుమాసముల కాలము వఱకు బడిలోని విద్యార్థులసంఖ్యయు, వారి హాజరును, ఒక్కొక్క తరగతిలో నిమ్నజాతి విద్యార్థు లెందరున్నదియున్ను యీ వివరములు.

4. ఉపాధ్యాయుల సంఖ్య, వారి యోగ్యతలు.
5. పాఠశాలలోఁ బ్రస్తుతమున్న బడిస్థలములు, బడిస్థలములు విశాలము చేయుటకున్న వసతులు.
6. పాఠశాలయొక్క సామాన్యస్థితి. వీలగుచో గడచిన ఇనస్పెక్షను రిపోర్టు పంపవలయును.
7. ఇప్పుడు దరఖాస్తుచేసి యడుగుచున్న భూమి అన్నివర్ణముల బాలుర కందుబాటులో నున్నదా?
8. గ్రామములోనింకను ఇతర పాఠశాల, లేదా పాఠశాలలపేర్లు.
9. స్థలము కావలసిన బడికిని ఆ యితర బడులకును మధ్యగల దూరము.
10. పైనిచూపిన (2) (6) అంశముల క్రింద నితర పాఠశాలలను గూర్చి సైతము వివరములంపవలయును.
11. దరఖాస్తులో నడుగుచున్నంత భూమి కావలయునా? డి. ఇ. ఓ. గారు లేదా ఇన్‌స్పెక్ట్రెసుగారు దానిని సిఫారసుచేయుచున్నారా?
12. పాఠశాలయొక్కయు, దరఖాస్తుచేయుచున్న స్థలముయొక్కయు ప్లానువేసి, వాని మధ్యగల దూరమును గుర్తించి దరఖాస్తు నాంగ్లభాషలో వ్రాసి విద్యాశాఖ డైరక్టరుగారిద్వారా జిల్లా కలెక్టరుగారికి పంపుకొనవలయును.

ఆటస్థలములోని శరీర వ్యాయామపు బనులన్నియు నుపాధ్యాయుని సమక్షముననే జరుగుట మంచిది. బాలు రాటలాడునప్పు డుపాధ్యాయుఁ డుండుటవలన బాలురలో నెవ్వనికిఁగాని యన్యాయము జరుగకుండ నతఁడు చూడగలఁడు. పెద్దబాలురు చిన్నవారిని హింసించుట కవకాశము లుండవు. ఆటలలో బాలురు దుర్భాషలాడక యుందురు. ఒకవేళ నేదైన యాకస్మిక విపత్తు సంభవించిన యెడల నుపాధ్యాయుఁడు తగిన ప్రథమచికిత్స చేసియో, లేదా వైద్యునికడ కంపియో తగిన యేర్పాటులను చేయఁగలఁడు. అటులనే బాలురందరు చట్టములకు లోబడునట్లుపాధ్యాయుఁడు చేయఁగలఁడు. ఒకవేళ

బడిలోని యాటవస్తువుల నుపయోగించుచుండిన యెడల, బాలు రాటలను వేళకు నిలుపునట్లును, ఆటవస్తువులను వాని వాని స్థలములలో బాలురు భద్రము చేయునట్లును జూడఁగలరు. అంతియగాక యుపాధ్యాయుఁడాట సమయములలో బాలురతోఁగూడ నున్న యెడల బాలురలో నొక్కొక్కని శీలమును గమనించుట కతని కమూల్యమైన యవకాశములు లభించును. ఉపాధ్యాయుఁడచ్చట బాలుర మనోవృత్తులను గమనింపఁ గలిగిన యెడలఁ దరగతిలోఁ బాఠములను నేర్పునపుడు బాలుర యెడల సానుభూతి గలిగి, యొక్కొక్క బాలుని స్వభావమున కనుకూల మగురీతిని బ్రవర్తింప గలుగును.

## ప్రశ్నలు

(1) బడి యెట్టి స్థలములోఁ గట్టవలయును?

(2) ఒక గ్రామములో 150 మంది బాలురకొరకు నొక బడిని నిర్మింపవలయును. ఆ బడిలో నొక్కొక్క తరగతి యందు 30 మంది బాలురుందురు. బడియొక్క ప్లానును గీయుము.

(3) తరగతి గదిలో వెలుతురు, గాలి ప్రసరణను గూర్చి, వీని ప్రాముఖ్యము, పరిమితిని వ్రాయుము.

(4) సాధారణముగ బడిబాలురకు రాఁగల వ్యాధులను పేర్కొనుము. గజ్జి, దగ్గరచూపు, టాన్సిల్సు గల బాలురను గూర్చి నీ వేమి చేయుదువు?

(5) ఒక పల్లెటూరి బడికి దగిన మరుగుదొడ్డిని నిర్మించుటకు గావలసిన ధనము నంచనా వేయుము. (1) తడికల దొడ్డి (2) తాటాకు లేక ఈతాకు దొడ్డి.

(6) బడితోటవలన ప్రయోజనములను వివరింపుడు.

(7) బడిలోని తరగతి గదులను ధనవ్యయము లేకయే యలంకరింపఁగల పద్ధతులను వ్రాయుము.

(8) నీవు పనిచేయుచున్న బడికి ఆటస్థలము కావలసియున్నది. దానికొఱకు నొక దరఖాస్తును సిద్ధము చేయుము.

## ౫. బడిసామానులు-ఉపకరణములు

ప్రాథమిక పాఠశాలలయందు కొలఁది సామానులతో బని జరుపుకొనవచ్చును. పాఠశాలలకుఁ గావలసిన సామానులలో విద్యార్థులు కూర్చుండుటకై యుపయోగించు పీఠములనుగూర్చి ప్రథమమున జెప్పవలసియున్నది. మన దేశమున పూర్వము పాఠశాలలలో విద్యార్థులు విలువగల పీఠములపైఁ గూర్చుండెడివారు కారు. పేద దేశమగు భారతదేశమున నార్థిక పరిస్థితులను బట్టియు, దేశాచారము ననుసరించియు మిక్కిలి చౌకగాలభించు పీఠములనే బడులలో వాడుకొనుచుండిరి. కాని పాశ్చాత్యవిద్యావిధాన మీ దేశమునఁ బ్రారంభమైనప్పటి నుండియు నా దేశములలో వలెనే యీ దేశమందును బెంచీలు, డెస్కులు మొదలగు విలువగల పీఠముల నుపయోగించుచున్నారు.

ఇట్టి పీఠము లెందులకు వాడవలయును? విద్యార్థులు ప్రతిదినము పెక్కు గంటలకాలము బడిలోఁ గడపవలసి యున్నారు. అట్టితఱి వారు సుఖముగ కూర్చుండుటకు వసతులను గల్పింపకపోయినచో వారి దేహములకు శ్రమగలిగి పాఠములను శ్రద్ధతో గమనింపజాలక పోవుదురు. అప్పుడు బడిలో జరగవలసిన పని కాటంకము కలుగును. కావున బాలురు సుఖముగఁ గూర్చుండుటకు వసతులను కల్పింపవలసియున్నది. బడిలో బాలురు కూర్చుండెడి యాసనములు వారి యారోగ్యమును గాపాడునవిగా నుండవలయును. శాస్త్రాలమున వారారోగ్య పద్ధతుల ననుసరించి కూర్చుండు నభ్యాసము గలవఱచుకొనుటకు వీలుగా నుండవలయును.

బెంచీలు:— ఇవి సామాన్యముగ నాలునుండి యెనిమిదడుగుల వఱకుఁ బొడవుగలిగి యొకటినుండి యొకటిన్నర యడుగు యెత్తుగలిగి యుండును. వీనియందు పీఠము తొమ్మిది లేదా పదియంగుళముల వెడల్పుండును. బాలురు దీనిపైఁ గూర్చున్నపుడు తమ దేహములను వెనుక ఆనుకొనుటకు వీలగు చట్రము వీనిలోఁ గొన్నిటి కమర్చఁబడి యుండును. అట్టి చట్రము కొన్నిటి కుండదు.

ఆనుకొనుటకు చట్రము లేని బెంచీలపైఁ గూర్చుండు బాలురు చాల కాలము తమ దేహమును నిటారుగా నుంచుకొనఁజాలక వానిని వంచి ముందునకు వాలుదురు. అట్లు చేయుటవలన నూపిరితిత్తులను ముడుతిపడుటయేగాక బాలురకు గూనికూడఁ దటస్థించును. కావున వెనుక కానుకొనుటకు చట్రము లేని బెంచీల నెప్పుడును వాడరాదు.

కొన్ని పాఠశాలలలో నిట్టివి పొడవు బెంచీలకే కీలు గలిగిన వానిని వాడుచున్నారు. కీలుమూలమున బీఠము వెనుక నుండు కఱ్ఱపలక నానుకొనుటకును, వలయునపుడు ముందునకు వాల్చి వ్రాతబల్లగ నుపయోగించుటకును వీలున్నది. వీనిలో నొక్కొక్కదాని మీఁదను ఆఱునుండి యెనిమిదిమందివఱకు బాలు రొకరినొకరు రాసికొనుచు గూర్చుండవలసియుండును. ఇట్లు గూర్చుండుటవలన గజ్జి మొదలగు చర్మవ్యాధు లొకరినుండి మరియొకరికి వ్యాపించుటకును, వ్రాత వ్రాయునపు డొకరి పుస్తకముల నొకరు చూచుకొనుటకును నవకాశము లుండును. కాన నిట్టి పొడవుబెంచీ లుపయోగించుట యనుచితము.

డెస్కులు:— ఇవి రెండువిధములు. ఒక బాలునకుమాత్రము కూర్చుండుట కనువైనవి కొన్ని ఇవి మొదటిరకము. ఇద్దఱు బాలురు మాత్రము కూర్చుండుట కనువైనవి కొన్ని, ఇవి రెండవ రకము. డెస్కులు బాలురు సుఖముగఁ గూర్చుండుటకు గావలసిన వసతులు గలిగి పాఠశాలలోని పని నిరాటంకముగ జరుగుటకుఁ దోడ్పడును. డెస్కులయందు బాలురు కూర్చుండుటకుఁ బీఠములు మాత్రమేగాక ఆనుకొనుటకు వెనుకవైపున బలకలను వ్రాత వ్రాయుటకు ముందువైపున నేటవాలు పలకలును, వానిక్రింద పుస్తకములను దాచుకొనుటకుఁ బెట్టెవంటి సాధనమును గలిగి పాదము లుంచుకొనుటకు సైతము వసతు లమర్చబడియుండును. డెస్కులు చాల వెలగలవి యగుటచేఁ బ్రాథమిక పాఠశాలలలో వీని నంతగా నుపయోగింపరు.

కఱ్ఱపలకలు, చాపలు:— చౌకగా లభించునవియు, ప్రాథమిక పాఠశాలలకు మిక్కిలి తగినవియు నగు పీఠములు, కఱ్ఱపలకలు, లేదా చాపలు అని చెప్పవచ్చును. ఇవి చౌక యగుటయేగాక సుల

భముగ నటునిటుఁ ద్రిప్పుటకును వీలుకలిగి యుండును. కాబట్టి యవసరము వచ్చినప్పుడు తరగతియొక్క ముఖము నొక దిక్కునుండి మఱొక దిక్కునకుఁ ద్రిప్పుటకు సులువుగానుండును. బాలురు కూర్చుండుటకుఁ జాపలు, లేదా పలకలు వాడునప్పుడు కాళ్ళువేసిన వ్రాతపలకలు సైతము వాడవలయును. బాలురు వానిపైఁ దమ పుస్తకముల నుంచుకొని చదువగలరు. వ్రాతకును వినియోగింపగలరు. కొన్నిబడులలో చాపలుసయితము వాడక బాలురను నేలపైఁ గూర్చుండబెట్టుచుందురు. నేలకు బండపఱుపు లేనప్పుడు బాలుర దుస్తులు మైలపట్టును. బండపఱుపు లున్నప్పుడు బండలు శీతలము చెందుటచేఁ జాలకాలము వానిపై గూర్చుండు బాలుర కవి యనారోగ్యమును కలిగించును. కొన్నిబడులలో మట్టితోనో, రాళ్ళతోనో విద్యార్థులకుఁ బీఠములనుగట్టించి యుంచుదురు వీనిని కదుపుటకు వీలుండదు. ప్రాథమిక పాఠశాలలోని బాలుర కూర్చుండుటకుఁ జాపలు, వ్రాత వ్రాయుటకుఁ గాళ్ళువేసిన వ్రాతపలకలును శ్రేష్ఠములని చెప్పవచ్చును.

కుర్చీలు, బల్లలు:—ప్రతి తరగతి గదిలోను నుపాధ్యాయుడు కూర్చుండుట కొక కుర్చీ యుండవలయును. పుస్తకములు మొదలైనవి యుంచుకొనుటకును, వ్రాతపనులు చేయుటకును నొక బల్ల యుండవలయును. కుర్చీలు కొనలేని పాఠశాలలో కుర్చీ బదు లొక చిన్న పీఠమును (స్టూలును), బల్లకు బదులొక కొయ్యపెట్టెను వాడుకొన నగును. ఇవికాక రిజిష్టర్లు, రికార్డులు మొదలైనవి యుంచుకొనుట కొక పెట్టెగాని, అల్మైరాగాని యుండవలయును. బాలురు చేతిపని తరగతులలో సిద్ధము చేసిన వస్తువుల నుంచుకొనుటకు గోడలో విశాలమగు నర లమర్చి వానికి దలుపులను బిగించి తాళము వేసి యుంచవలయును.

బడిపని క్రమముగ వేళకుఁ బ్రారంభించి వేళకుఁ జాలించుటకు గంటలు తెలియుట కొక గడియార ముండవలయును. బడివేళ యయినపుడును, క్రొత్తపాఠములు ప్రారంభింపవలసినప్పుడును గంట కొట్టి తెల్పుట కొక గంట యుండవలయును.

ఉపకరణములు:— ప్రాథమిక పాఠశాలలో నుపయోగింప దగిన యుపకరణములలోని కెల్ల నల్లబల్ల ప్రధానమైనది. సామాన్యముగ నన్ని పాఠములకు నుపాధ్యాయుఁడు నల్లబల్లను వాడుచునే యుండును. ఏలయన బాలు రొక నూతన విషయమును నేర్చుకొనవలసినపుడు కొందఱు చెవితో విన్నంతమాత్రముననే విషయము బోధపడును. కొందఱు కన్నులతో జూచినఁగాని యా విషయము తేటగా నర్థముకాదు. ఒక్కొక్కప్పు డుపాధ్యాయుఁడు బాలురకు వింత వస్తువులనుజూపి వానినిగురించిన పాఠములను బోధించును. విన్నమాత్రముననగాని చూచుమాత్రముననగాని తృప్తిజెందక బాలురా వస్తువులను తమ చేతులతో దాకి వాని యాకారము, బరువు మున్నగు విషయములను దెలిసికొనఁగోరుదురు.

నూతన విషయములనుగూర్చి బాలు రెన్ని యింద్రియముల మూలమున నేర్చుకొనఁగల్గిన నంత స్థిరముగ నా సంగతులు మనస్సులో నాటుకొనును. కనుకనే యుపాధ్యాయుఁడు ప్రతిపాఠములోను నూతన విషయములను నోటఁ జెప్పుటయేగాక వీలగునపుడెల్లను నల్లబల్లమీఁద వ్రాసియో పటములను గీసియో చూపవలయును. ఈ కారణములచేత నల్లబల్ల ప్రయోగము తరగతిలో నుపాధ్యాయున కత్యంతావశ్యకము. బడిలోని ప్రతి తరగతికొక నల్లబల్ల యుండవలయును. ఇది సాధారణముగా నుపాధ్యాయుని పీఠమున కెడమవైపున బాలుర కందఱకు బాగుగ గనబడుచోట నుండవలయును. మిక్కిలి యెత్తుగాఁగాని తగ్గుగాగాని యుండక బాలుర కన్నులకు సరిగానుండు నంత యెత్తున నుంచవలయును. దానిమీఁదపడు వెలుతురు మిక్కిలి యెక్కువగా నుండక చూచునంతమాత్ర ముండవలయును; లేనిచో బాలుర కన్నులకుఁ జెఱుపు కలుగును. కనీసము సంవత్సరమున కొకసారియైన నల్లబల్లకు రంగు వేయవలయును. కొన్ని బడులలో గోడలో గొంతభాగమును నల్లబల్లగా సిద్ధము చేయుదురు. ఆ విధాన మీ క్రింద నుదహరింపఁబడియున్నది.

### పండ్రెండు చదరపు టడుగుల నల్లబల్లను గోడమీద సిద్ధము చేయు పద్ధతి:—

కావలసిన వస్తువులు:—15 గంపల గార (సున్నము ఇసుక కలిపి గానుగాడినది), 12 పళ్ళు (పసులు) సిమెంటు, 4 వీసెలు టెంకాయచిప్పలు.

పదునొకండు పసుల సిమెంటును 15 గంపల గారతో బాగుగ కలుపుము. గోడమీద నల్లబల్ల చేయవలసిన స్థలములో ఒక్క అంగుళము మందమున వేయుము. పిమ్మట దానిని ఒక కర్రతో చదును చేయుము. తేమ కొంచెము ఆరిపోయినపిదప ఒక భాగము సిమ్మెంటును రెండు భాగములు టెంకాయచిప్పల బొగ్గును కలిపి నీటితో బాగుగ నూరుము. ఈ మార్గము చాల మెత్తగా నుండవలయును. ఇట్లు సిద్ధము చేసిన ముద్దను ఒక దమ్మిడీయంత మందముగా గారతో గోడమీద సిద్ధము చేసిన బల్లమీద అంటించి తాపీవారి గుండుతో మంచి నునుపు వచ్చుదనుక రుద్దుము. ఇట్లు చేసినపిదప రెండు వారములమట్టుకు ఉదయమునను, సాయంత్రమునను నీళ్ళు నల్లబల్లమీద చల్లవలయును.

టెంకాయచిప్పలను బొగ్గుచేయుటకు వానిని బాగుగ కాల్చవలయును. అవి బూడిదగా నేర్పడరాదు. బొగ్గులు కాంగల స్థితిలో నున్నపుడే నిప్పులనార్పి బొగ్గులు చేయవలయును.

గారచేయుటకు ఇసుకను బాగుగ కడిగి 3 భాగములు ఇసుకకు ఒక భాగము సున్నముచొప్పున వేసి గారచేయవలయును.

కర్రతోఁ జేసిన నల్లబల్లలను మనకిష్టమువచ్చిన చోట నిలుపవచ్చును గాని, గోడబల్ల నట్లు జేయఁ జాలము. నల్లబల్ల నెక్కువగ వాడవలయుననినఁ గావలసినన్ని సుద్దకణికలుండవలయును. ఈకణికలు తెల్లరంగులో మాత్రమున్న జాలదు. ఎరుపు, పసుపు, నీలము మొదలగు రంగులలో సైత ముండవలయును. వీని నుపాధ్యాయుఁడు చిత్రలేఖనము నేర్పునపుడు మాత్రమేగాక భూగోళము, చరిత్ర మున్నగు పాఠములను నేర్పునపుడుకూడ వాడవలసియుండును. చిన్న పిల్లలకు రంగులన్న మిగుల ప్రీతి. అంతియగాక పెద్దపెద్ద పాఠశాల

లలో నుండు వెలగల రంగులపటములు, దేశపటములు ప్రాథమిక పాఠశాలలలో నుండవు గనుక నుపాధ్యాయుడు పాఠములను బోధించుటకు బ్లాకు బల్లమీద వేసిన చిత్రముల మీదనే యాధారపడవలసి యుండును. కాబట్టి యీ చిత్రముల నెంత విరివిగ నుపయోగించిన నంత మంచిది.

ఛాయాపటములు, చిత్తరువులు, దేశపటములు, చిత్తుపటములు:-ప్రాథమిక పాఠశాలలో వాడదగు దేశపటములు, చిత్తుపటములు ననేకముల నుపాధ్యాయుడు తానే స్వంతముగ సిద్ధము జేసికొనవచ్చును. దీని కతనికి గావలసిన పరికరములు గోధుమరంగు ముతక కాగితము, నుద్దకణికెలు మాత్రమే వీనితో నానావిధములగు కథలను బోధించుపటములు, గణితము బోధించు పటములు, ప్రకృతిని గూర్చిన పటములు, మొక్కలు, పక్షులు, జంతువులు-వీని యవయవ నిర్మాణములను జూపు పటములు, ఋతువులను గూర్చిన పటములు, దేశపటములు, జలగోళపటములు, ప్రత్యేక పాఠములు బోధించుటకును గావలసిన పటములు — వీని నన్నింటిని నుపాధ్యాయుడు సిద్ధము చేసికొనవచ్చును. పటములు సుబోధకములుగను, స్వల్పకాలములో దయారగునవిగను చౌకగను నుండునట్లు మాత్ర ముపాధ్యాయుడు చూచుకొనవలయును.

పైని జెప్పినవిగాక పాఠశాలలో శాశ్వతముగ నుండదగు కొన్ని దేశపటములను సైత ముపాధ్యాయుడు రాళ్ళు, మన్ను, కఱ్ఱ మొదలగువాని సాహాయ్యమున జేయునగును. గ్రామపటము, తాలూకాపటము, జిల్లాపటము, రాజధానిపటము ఇవి యిట్టి వానిలో జేరినవి. ఇవిగాక రైలుమార్గములు, విమాన మార్గములు, ఓడమార్గములు వీనిని జూపు పటములుకూడ సిద్ధముచేసి యుంచుకొనవలయును. భూగోళ విషయములను నేర్పుటకు వలయు గోళములను నుపాధ్యాయుడే చేసికొనగలిగి యుండవలయును.

ప్రతి యుపాధ్యాయుడను పటముల పుస్తకములను సిద్ధము చేసికొనవలయును. వీనిని ముతుక కాగితములతో గట్టి యుంచుకొని వార్తాపత్రికలు, మాసపత్రికలు, ప్రకటన కాగితములు

మొదలగు వానిని సంపాదించి వానినుండి చక్కని పటములను కత్తిరించి యాపటములు పుస్తకములో నంటించి యుంచుకొనవలయును. పక్షులు, జంతువులు, మొక్కలు, వాహనములు, వృత్తులు, పరిశ్రమలు, జనులు — వీనిలో నొక్కొక్క విషయమునకు జెందిన పటముల కొక పుస్తకము చొప్పున జేసి యుంచుకొనవచ్చును. ఇవి పాఠముల బోధనమున నుపయోగపడుటయే గాక యుపాధ్యాయులకొక విరామకాలక్షేప సాధనముగా గూడ నుండగలవు.

చేతిపనుల కుపయోగించు కొలిముట్లుగూడ ప్రాథమిక పాఠశాలలలో నుండవలయును. వానిలో త్రాసు, తూనికరాళ్ళు, కొలతపళ్ళు, గజముబద్ద, సిర్జీలుపయోగించు కొలతదారము — ఇవి ముఖ్యమైనవి. తూనికరాళ్ళు మట్టితో జేసి యుంచుకొనవచ్చును. కొలతపళ్ళు కాగితపు అట్టలతో దయారు చేయవచ్చును. వీలయినచో నొక్కొక్క రేంజిలోని యిరువది ముప్పది పాఠశాలలు కలిసి యొక తూనికయంత్రమును సమష్టిగా దెప్పించి యుంచుకొనవచ్చును. దీని నుపాధ్యాయ సంఘ కేంద్రములో సంఘ కార్యదర్శి వశమున నుంచి దానిని దీసుకొనిపోయి ప్రతి పాఠశాలయు నొకటి రెండు వారముల కాల ముపయోగించుకొని దానిని మరల కేంద్రమునకు జేర్చుచుండ వచ్చును.

పాఠముల బోధన కవసరములగు మఱికొన్ని యుపకరణములనుగూడ చేర్కొనవలసి యున్నది. మాతృభాషను బోధించుటకు విశేషముగ నుపకరణము లవసరము లేదు. కాని యియ్యది బోధనా పద్ధతి ననుసరించి యుండును. ఏ పద్ధతి ననుసరించినను వర్ణమాల యట్టలు, సమాసపదములను జదువుటలో వేగమును నేర్పుట కుపయోగించు త్వరితపు అట్టలు (ఫ్లాష్ కార్డులు) నుండి తీఱవలయును. కథాపద్ధతి నవలంభించిన యెడల వాక్యములు, మాటలు, అక్షరములు వేర్వేరుగా గల యట్టలు సందేడు కావలయును. ఇవిగాక వ్యాసరచన పాఠములకుఁ దగిన పటములుకూడ నుండవలయును.

గణితములు బోధించుటకు కఱ్ఱముక్కలు, పుల్లలు, విత్తనములు, గింజలు, అట్టనాణెములు, పూసలచట్టము, సంఖ్యల

కూడికలు, తీసివేతలు, హెచ్చింపులు, భాగహారములు వీనిని జూపు పటములు నుండవలయును. ప్రకృతి విషయములను గూర్చి నేర్పుటకు జంతువుల బొమ్మలును, పక్షుల యొక్కయు, మొక్కల యొక్కయు పటములు నుండవలయును.

<u>పుస్తక భాండాగారము</u>:— పుస్తక భాండాగార మను పేరు విన్నతోడనే కొంద ఱుపాధ్యాయులు ప్రాథమిక పాఠశాలలో నట్టిది యుండుట సాధ్యమని తలంచుచుందురు. గొప్ప యల్మారాలు కట్టలకొలఁది పుస్తకము లున్న నే పుస్తకభాండాగార ముండగల దని యట్టివారి యభిప్రాయము. కాని ప్రాథమిక పాఠశాలలోని గ్రంథాలయమున కొక పెట్టెయు కొన్ని పుస్తకములుమాత్ర ముండిన జాలును. ఈ పుస్తకములలో నుపాధ్యాయునకును, బాలురకును గూడఁ బఠింపవచ్చు గ్రంథము లుండవలయును. ఈ గ్రంథములు నానావిషయములను గూర్చినవై యుండవలయును. మనోహరము లగు కథల పుస్తకములు, ప్రకృతినిగూర్చిన గ్రంథములు, నవలలు, జీవిత చరిత్రములు, శాస్త్రగ్రంథములు, నాటకములు, నిట్టివి భాండాగారమున నుండవలయును. కాని ప్రధానోపాధ్యాయులకు మాదిరి చూపుటకై పుస్తకములనమ్ము వర్తకులు పంపు గ్రంథముల నిందులో నుంచరాదు. ఏలయన, నవి పాఠ్యగ్రంథములను బోలియుండి బాలుర కుత్సాహమును గలిగింపవు. ప్రాథమిక పాఠశాలలో నుంచదగిన గ్రంథముల తెలుఁగు, సారస్వతమున విరివిగ లేవు. కాని సుప్రసిద్ధులగు పుస్తకవర్తకులయొద్ద దొరకు గ్రంథములనుండి పైఁజెప్పిన గ్రంథముల నేర్పరచుకొనవలయును. ధార్మిక గుణములు గల గ్రామస్థులయొద్దనుండి సైతము తగిన గ్రంథములను సంపాదించి బడిలోని పుస్తక భాండాగారమును వృద్ధిపొందింపవలయును.

పుస్తక భాండాగారము నుపయోగించు పద్ధతులనుగూర్చి కొన్ని నిబంధన లుండవలయును. ఈ నిబంధనలు:— గ్రంథాలయము నుపయోగించు వార లొక్కపర్యాయ మెన్ని గ్రంథములు తీసికొనవలయును? ఎప్పుడు తీసికొనవలయును? ఎన్ని దినములలో వానిని

మట్టల విచ్చివేయువలయును? పుస్తకములకు నష్టము కలిగించినచో నెట్టి నష్టపరిహార మిచ్చువలయును? అను నియమములను కూర్చి యుండవలయును. పాఠశాలలోని యుపాధ్యాయులలో నొకరు పుస్తక భాండాగారమున కధిపతిగ నుండవలయును.

పాఠశాలలో జదువువారికేగాక పాఠశాలలు విడిచిన ప్రాత విద్యార్థులకు సైతము కొన్ని నియమముల ననుసరించి పుస్తకముల నియ్యవచ్చును. ఇట్లు చేయుటవలన ప్రాతవిద్యార్థులు జ్ఞానాభివృద్ధి కలిగించుకొనుటకు సౌకర్యము లేర్పడుటయేగాక వారికి పాఠశాలయందు నభిమానము హెచ్చి, ప్రాతవిద్యార్థులకును పాఠశాలలోని యుపాధ్యాయ విద్యార్థిబృందములకును స్నేహ మేర్పడును.

వస్తుప్రదర్శనశాల:— గ్రామములోను, దాని పరిసరముల యందును దొరకు చిత్రవస్తువుల నుంచుటకొక వస్తుప్రదర్శనశాల ప్రతి బడిలోను నుండవలయును. తలుపుల కద్దము లమర్పబడిన యల్మైరాలలో వస్తువుల నుంచుటకు మిక్కిలి యనువుగ నుండును. ఒకవేళ నట్టిది సాధ్యముకానియెడల, గోడలకు ఇటుకల నమర్చి వానిపైని వింతవస్తువుల నుంచదగును. వస్తుప్రదర్శనశాలలో నానా విధములగు వస్తువుల నుంపవచ్చును. ప్రకృతిలో దొరకు పలువిధములగు చెట్ల యాకులు, పువ్వులు, విత్తనములు, ధాన్యములు, చెట్టు బెరడులు, కలప, పక్షుల యీకలు, గవ్వలు, ఇసుక, మన్ను, రాళ్ళు సేకరించి యుంచవచ్చును. అవియేగాక నానావిధములైన నాణెములు, తపాలాబిళ్ళలు, వర్తకచిహ్నపు కాగితములు, పూసలు, గాజుపెంకులు, వివిధములగు తోళ్ళు, బట్టలు, ఇవన్నియు ప్రదర్శన శాలలో వరుసలుదీర్చి యుంచిన కన్నులపండువుగ నుండుటయేగాక బడిలో పాఠములు బోధించుటకు సైతమవి ప్రయోజనకరములుగ నుండును. బాలురు చేతిపనుల పాఠము లప్పుడు సిద్ధముచేయు వస్తువులనీ ప్రదర్శనశాలలో నుంపక వానిని ప్రత్యేకముగ ప్రదర్శనము చేయుటుచితముగ నుండును. పై నుదహరించిన వస్తువులలో ననేకములను బాలురు విద్యావిహారముల నిమిత్తము వెళ్ళినపుడు ప్రోగుచేసి తీసికొనివచ్చునట్లు వారిని ప్రోత్సహింపవలయును. వింత

వస్తువులను దెచ్చిన బాలుర పేరులు కాగితములపై వ్రాసి ఆయా వస్తువుల క్రింద బెట్టుట బాలురకు ప్రోత్సాహకరముగ నుండును.

ప్రశ్నలు

(1) పల్లెటూరి బడులలో నుపయోగింపదగు పీఠము, వ్రాతబల్ల—వీనిపటములను చిత్రించుము.

(2) మొదటి అయిదు తరగతులు గల బడిలో తెనుగు, లెక్కలు, భూగోళము— ఈ పాఠములు నేర్పుటకు గావలసిన యుపకరణముల పట్టిని వ్రాయుము.

(3) పాఠముల బోధనలో నుపకరణము లెందుల కుపయోగింపవలయును?

(4) నీవు చదువుచున్న పాఠశాలలో మూడడుగుల వెడల్పును, నాలుగడుగుల పొడవును గల యొక్క నల్లబల్లను గోడపై సిద్ధము చేయుము.

(5) నీవుండు జిల్లాపటము, తాలూకాపటము సుద్దతోను, రాళ్ళతోను బండపలుపు మీద సిద్ధము చేయుము.

(6) ప్రాథమిక పాఠశాలా పుస్తకభాండాగారములో నుంచదగిన ఏబది గ్రంథముల పేర్లను నొక పట్టీగా వ్రాయుము.

(7) పుస్తకభాండాగారము యొక్క యుపయోగమున కవసర మగు నిబంధనలను సిద్ధము చేయుము.

(8) వస్తుప్రదర్శనశాలకు వస్తువుల నెట్లు సేకరింతువో తెలుపుచు వ్రాయుము.

# 4. బడిలో నేర్పవలసిన పాఠములు

ప్రాథమిక పాఠశాలలో నేర్పవలసిన పాఠములు ప్రాథమిక విద్యయొక్క యుద్దేశముల ననుసరించి యుండును. బాలురయొక్క శరీర మానసిక నైతిక శక్తులను వికసింపజేసి వృద్ధి పొందించుటయే ప్రాథమిక విద్యయొక్క ప్రధానోద్దేశ మని నేర్చుకొని యున్నాము. బాలురు పెరిగిన తరువాత స్వతంత్రజీవనము చేయుచు సత్పౌరులుగ నుండునట్లు వారిని పాఠశాలలు సిద్ధము చేయవలె ననియు నేర్చుకొంటిమి. హిందూదేశమున పట్టణముల కంటె పల్లె లధికము. కోట్లకొలది జనులు గ్రామములలోనే జీవించుచున్నారు. కావున ప్రాథమిక విద్య గ్రామ పరిస్థితులకును నవసరములకును దగినదై యుండవల

యును. పాఠశాలలోని పాఠములు బాలురనుబట్టియు నుపాధ్యాయులను బట్టియు శీతోష్ణములను బట్టియు పాఠశాల కట్టడములను బట్టియు పాఠశాలలో బడి జరుగు గంటలను బట్టియుం గూడ నుండును. పైనవివరించిన యుద్దేశములనుబట్టి ప్రాథమిక పాఠశాలలో నేర్పదగిన పాఠము లెవ్వియో తెలిసికొందము ఈ పాఠములను ప్రభుత్వపు విద్యాశాఖవారు 1939 లో నీ విధముగ నిర్ణయించి యున్నారు. మొదటి యయిదు తరగతులకు నేర్పవలసిన పాఠములు క్రింద వివరింపబడి యున్నవి. అవి విధిగాం జదువవలసిన పాఠములు, ఐచ్ఛిక పాఠములు అని రెండుభాగములుగా నున్నవి.

విధిగా జదువవలసిన పాఠములు

1. మాతృభాష
2. గణితము
3. ప్రకృతిపఠనము : తోటపని
4. శరీరవ్యాయామము
5. భూగోళము : చరిత్ర
6. హైజీను : సివిక్సు (బాలికలకు గృహశాస్త్రము కుట్టుపని)
7. సంగీతము
8. చేతిపనులు

ఐచ్ఛికపాఠములు

1. చిత్రలేఖనము
2. ఇంగ్లీషు
3. ప్రథమచికిత్స
4. మహామ్మదీయ పాఠశాలలలోను, రెండుభాషలుగల పాఠశాలలలోను రెండవభాష
5. మతము : నైతికబోధన

హాయ్యరు ఎలిమెంటరీ పాఠశాలలలో ఆఱునుండి యెనిమిది తరగతులకు నేర్పవలసిన పాఠములు

విధిగా నేర్పవలసిన పాఠములు

1. మాతృభాష
2. గణితము
3. ప్రారంభశాస్త్రము (బాలికలకు గృహశాస్త్రముతో సహా).

4. దేశ చరిత్ర
5. భూగోళము
6. సివిక్సు
7. శరీర వ్యాయామము
8. ప్రారంభ వృత్తి విద్య (గ్రామములలో తోటపనితో సహా)
9. నైతికబోధన

## ఇష్టమునకు విడిచిన పాఠములు

1. ఇంగ్లీషు
2. సంగీతము
3. రెండవభాష (పాశ్చాత్యదేశీయ పాఠశాలలలోను, రెండు భాషలు గల పాఠశాలలలోను)
4. చిత్రలేఖనము

ఈ పాఠములలో నొక్కొక్కదాని నే యుద్దేశముతో నేర్పవలయును? ఆ నేర్పునపు డవలంబింపవలసిన పద్ధతు లెట్టివి యను నంశముపై కొన్ని మాటలు చెప్పవలసియున్నది.

విధిగా నేర్పవలసిన పాఠములు:—**మాతృభాష:** ప్రాథమిక పాఠశాలలోని పాఠము లన్నిటిలో నిదియే ప్రధానమైనది. బాలురు మాతృభాషను వేగముగను, అర్థసహితముగను జదువుటకు శక్తి కలుగవలయును. ఉత్తర ప్రత్యుత్తరములను జదువుటకును, మనస్సులోని యభిప్రాయములను సునాయాసముగ నితరులకు దెలుపుటకును, తప్పులు లేకుండ భాషను సులభశైలిలో వ్రాయుటకును ఐదవ తరగతి విడుచునప్పటికి బాలురకు శక్తి రావలయును. అంతియు కాక చదువుటకు నాశగలిగి మనోవికాసమునకును, వేడుక కొరకును, జదువువాసనిగ ప్రతి బాలుని జేయవలయును.

పూర్వమునుండియు వచ్చుచున్న యక్షరపద్ధతిని విడిచి మాటల పద్ధతి లేదా కథాపద్ధతి ననుసరించి వాచకమును బోధింపవలయును. బాలురు వేగముగను మౌనముగను జదువుట కభ్యాస పడునట్లు చేయు పద్ధతుల నుపయోగింపవలయును.

గణితము నేర్పుటలో బాలుర యూహాపోహాశక్తిని హేతువాదశక్తిని వృద్ధిపొందించుట యుపాధ్యాయుని యుద్దేశమై యుండవలయును. లెక్కలకొఱకు గణితమును నేర్చుకొనుట స్వల్పవిషయములలో సయితము తు. చ. తప్పకుండ నుండుటయు, గృహసంబంధమైన, వృత్తిసంబంధమయిన లెక్కలను వ్రాసి యుంచుకొనుటయు గణితమువలని లాభములను బాలురు తెలిసికొనునట్లు చేయవలయును. సృష్టి చిత్రములను గమనించి, గ్రహించి, యానందించుటయే ప్రకృతి పరిశీలనా పాఠములవలన బొందదగు లాభమని బాలురు గ్రహించునట్లు చేయవలయును. మన మెప్పుడు చూచు సామాన్య జంతువులు, పక్షులు, కీటకములు, వాని యాహారమును, స్వభావము అలవాటులు మున్నగు విషయముల నేర్చుకొని వాని యెడ సానుభూతి గలిగియుండుటకు బాలురకీ పాఠములను నేర్పవలయును. అట్లే మొక్కలను గూర్చి యవి పెరుగుటకు కావలసిన వసతులు, వానివలన మనకు గల ప్రయోజనములు నేర్పవలసి యున్నది. చేతులతో కష్టపడి పనిచేయుటవలన దేహారోగ్యము వృద్ధిపొందుననియు, నిట్టి కష్టమునం దగౌరవ మెంతమాత్రము లేదనియు బాలురకు బోధించుట యుపాధ్యాయుల విధి.

చరిత్రపాఠముల మూలమున బాలుర భావనాశక్తి యూహాశక్తి వృద్ధిపొంది బలపడునట్లు చేయవలయును. చరిత్ర సంభవములను గూర్చి వారు చదువునపుడు వారి హేతువాదశక్తి వృద్ధిపొంది గతకాలములోని స్త్రీపురుషుల నొకరితో నొకరిని బోల్చుటకు నాకాలమున వారు సద్వర్తనలను ప్రేమించి యనుకరించుట కభిలాష పుట్టింపవలయును. నీతి న్యాయములయెడ గౌరవము, దేశభక్తి, దుష్ప్రవర్తనమునెడల ద్వేషము బాలురలో బుట్టించుట ప్రధానముగా నెంచుకొని చరిత్రపాఠములను బోధింపవలయును. చరిత్రాంశముల నూరక కంఠపాఠము జేసి వల్లించుటవలన ప్రయోజన మంతయు నుండదు.

పరిసరముల ననుసరించి మానవుల జీవిత విధానము మారునని చూపుటయే భూగోళశాస్త్ర పఠనము యొక్క ముఖ్యోద్దేశము. ఒక్కొక్క దేశములోనున్న మనుష్యు లచ్చటి శీతోష్ణస్థితి, వర్షము

పైనపట్టణమునకుగాని బట్టి తమతోను యున్నవస్త్రాదులను, చరిత్రములను, వర్తకములను నిర్ణయించుకొందురని బాలురకు జూపుటలో బాలుర గమనశక్తి, హేతువాదక శక్తియు వృద్ధి పొందింపవలసి యున్నది. ఒక దేశములోని భూగోళాంశములను గంతపాఠముగ నేర్చుకొన్నంత మాత్రమున ఫలముండదు. కాని యా భూగోళాంశములకును మానవుని జీవితమునకును నున్న సంబంధమును గ్రహింపవలయును. అప్పుడే భూగోళ పఠనము వలన బాలుర జ్ఞానము వికాసము చెందును. భూగోళము, చరిత్రపాఠముల యందలి విషయములను విశదముగ గ్రహించుటకు విద్యావిహారములు, చిత్రపటములు, ఛాయాపటములు, దేశపటములు మొదలగున వవసరము.

బాలురు సాధారణముగ దినమంతయు బడిలో గూర్చుండియే తమ పాఠములను జదువుకొందురు. కనుక వారికి దేహపరిశ్రమ మంతగా నుండదు. పరిశుభ్రమైన గాలియు నంతగా లభింపదు. దేహపరిశ్రమ లేనిచో బాలుర దేహము లారోగ్యవంతములు కాజాలవు. వారి దేహములోని నానావిధావయవములు తగినట్లుగా వృద్ధి కూడ బొందలేవు. బాలు రారోగ్యముగ నుండుటకును, దేహములు వృద్ధి పొందుటకును వారు పరిశుద్ధమైన గాలిలో ప్రతిదినము కనీస మొక గంట కాలమైన దేహపరిశ్రమ చేయవలయును. ఈ పరిశ్రమ నిమిత్తమే విద్యార్థులు బంతియాట లాడవలసి యున్నారు. పరుగెత్తుట, దుముకుట, దండెములు బస్కీలుతీయుట మున్నగు పరిశ్రమలను జేయవలసి యున్నారు.

దేహపరిశ్రమతోఁగూడ బాలు రారోగ్యశాస్త్రమును నేర్చుకొనవలసియున్నది. తన్మూలమున వా రారోగ్య సూత్రముల ప్రాధాన్యమును వాని యాచరణమువలన గలుగు లాభములను నేర్చుకొందురు. ఇట్లు చేసినపుడే బాలుర విద్యమూలమున వారి శరీరములు సయితము ఫలముపొందును.

సివిక్సు పౌరధర్మములను బోధించును గనుకను, బాలురు పెరిగి పెద్దవారైనపుడు మానవసంఘములో నెట్లు మెలఁగవలసినదియు నేర్చుకొనవలసియున్నారు గనుకను బడిలో సివిక్సు నేర్పుట

అవసరము. సంగీతము మనస్సును రంజింపజేయు విద్య. ఏదో యొక విధమైన సంగీతము, నృత్యము లేని జాతి ప్రపంచమున లేదని చెప్పుట సాహసము కాజాలదు. అనాగరికులగు కొండజాతులు సైతము పాటలతో గూడిన నాట్యము మూలమున తమ యానందమును వెల్లడి చేయుచుందురు. అంతియకాక కథలు, పాటలు విద్యాసాధనములలో నొక ప్రధానసాధన మనవచ్చును. కావుననే బడిలో సంగీతము నేర్పుకొన వలసియున్నది. జనసామాన్యము చెప్పుకొను కథలు, పాడుకొను పాటలు, చేయునాట్యము జన నవజీవితములోని నీరసమును దొలగించి యుత్సాహమును, ఆనందమును గలుగజేయుటయేగాక యాత్మప్రబోధనమునకును సాధనములగుచున్నవి. కనుకనే సంగీతము ప్రాథమిక పాఠశాలలలో నిర్బంధపాఠముగ జెప్పవలసియున్నది.

బడిలో నేర్పు చేతిపనుల మూలమున బాలురను నేత, వడ్రము, కమ్మరము మొదలగు పనివారిగ జేయుట యుద్దేశము గాదు. అట్టి పనులకు ప్రారంభ శిక్షణము నిచ్చుటగూడ మొదటి యయిదు తరగతులలో నేర్పు చేతిపనుల యుద్దేశము కాదు. బాలుర వట్టి మానసికవిద్యనే యభ్యసించినచో వారేదైన నొక పనిని చేయవలసి వచ్చినపుడు చేతులకుగావలసిన నేర్పు లేకపోవుటచే చేతగానివారుగ నుందురు. అట్టివారి విద్య సంపూర్ణవిద్య యనిపించుకొనదు. విద్య కిట్టినింద రాకుండుటకును, వస్తునిర్మాణమును బరీక్షించుటయందు బాలురకున్న లకను, జేయుటయందు వారి చేతులకును నభ్యాసము గలిగించుటయే ప్రాథమిక పాఠశాలలలో చేతిపనులను నేర్పుటయొక్క యుద్దేశము. చేతిపనులను విద్యకొక సాధనముగ నుపయోగించవలయునేగాని బాలుర కాయా వృత్తులను నేర్పు నుద్దేశముతో చేతిపనులను నేర్పరాదు. మనదేశమున మానసికవిద్య కత్యంత గౌరవము కలదు. చేతిపనుల నగౌరవముగ జూతురు. పరిశ్రమలయందు మనదేశ మధమస్థానమున నుండుటకు చేతిపనులయెడల జనులకుగల యగౌరవభావమే ప్రధానకారణము. వృత్తివిద్యలయెడల జనులలో వ్యాపించియున్న యగౌరవభావము తీసివేయుటకును, ప్రాథమికవిద్యను సాధ్యమైనంతవఱకు బరిపూర్ణ విద్యగ జేయుటకును

చేతిపనులను నేర్పుట యావశ్యకముగ నున్నది. వార్ధా విద్యాపద్ధతి నభిమానించు కొందఱు ప్రాథమిక పాఠశాలలలో బాలురు చేయు పనుల మూలమున ధనార్జనము సయితము చేయవలయు నందురు. ఇట్టిపద్ధతి మనరాజధానిలో నింకను నాచరణయందున్నట్లగపడదు.

## ఇష్టమునకు విడిచిన పాఠములు

ఇష్టమున్నచోఁ బ్రాథమిక పాఠశాలలయందు నేర్పవచ్చునని నిర్ణయించిన పాఠములలో నాంగ్లభాష యొకటి. ప్రస్తుత మాంగ్లేయులు మన దేశమును బాలించుచున్నందునను, నాంగ్లము రాజకీయ భాషగా నేర్పడియున్నందునను, బాలురలో గొందఱు ప్రాథమిక పాఠశాల విడువగనే యున్నతవిద్యకై పోవుదురుగనుకను, నాంగ్ల భాషలో నపారమగు సారస్వత ముండుటచేతను, నది యంతర్జాతీయ భాషగ నేర్పడు సూచన లుండుటచేతను, సాధ్యమగుచోఁ బ్రాథమిక పాఠశాలలలో నాంగ్లమును నేర్పుటమంచిది. కాని యాంగ్లభాషా బోధనమువలన మాతృభాషా బోధనమున కిసుమంతయు హానికలుగ కుండ చూడవలయును. బాలురు తమ అభిప్రాయములను చిత్రించు టకు చిత్రలేఖన పాఠ మవకాశముల నొసగును. కాగితములపై పెన్సిలుతోను రంగులతోను చిత్రించుట బాలుర కానందదాయకము. అంతియకాదు. బాలురు తమ విరామకాలమును సద్వినియోగము చేసికొనుటకుఁ జిత్రలేఖనము తోడ్పడగలదు. కనుక నిదియు బాలురకు నేర్పవలసిన పాఠమే.

నీతిమత బోధనలు:— ఇష్టమునకు విడిచిన పాఠములలో జేర్చియున్నను, నిది మిగులఁ బ్రధానమైన పాఠముగ నెంచవలయును. ప్రతిపాఠశాలయు నందలి బాలురకుఁ దగినట్టి నీతిమతబోధన పాఠముల ప్రణాళికను సిద్ధముచేసికొని, దాని ననుసరించి బాలుర కుత్సాహము పుట్టునట్లు నీతిబోధ చేయవలయును. ఈబోధన చరిత్ర నుండియుఁ బురాణములనుండియుఁ గైకొనబడిన కథలతో గూడినదై బాలురకున్నతాదర్శములను బోధించునదియు, సత్ప్రవర్తనమునకు బ్రోత్సహించునదియునై యుండవలెను, గాని కొందఱుచేయు ప్రసంగములవలె చప్పగను విసుగు పుట్టించునదిగను నుండరాదు. దైనిక

జీవితమునం ప్రథమ చికిత్సాజ్ఞాన మావశ్యకమగు పరిస్థితులెన్నియో తటస్థించుచుండును. కనుక ప్రథమ చికిత్స చేయు పద్ధతులను బాలురకు బోధించుట యావశ్యకము.

రెండవ భాషను నేర్పవలసిన యవసర మేకొన్ని పాఠశాలలలోనో గలుగుచుండును. అట్టి యావసరము కలిగిన చోటులలో రెండవ భాషను నేర్పవలయును. కాని మాతృభాషా బోధనమునకు భంగము కలుగకుండ జూచుకొనవలయును

హాయ్యరు ఎలిమెంటరీ పాఠశాలలలోని ఆరు, ఏడు, ఎనిమిది తరగతులలో నేర్పవలసిన పాఠములు క్రింది తరగతులలో నేర్పువానికంటె మిగుల విపులముగను, బాలురను గ్రామజీవితమునకు సిద్ధపఱచు నుద్దేశము గలవిగ నుండవలయును. ఈ తరగతులలో నేర్పు చేతిపనులు వృత్తివిద్యకు సోపానములై యుండవలయును. ఈ తరగతులలో జదువు బాలుర నున్నత పాఠశాలలకు పంపు నుద్దేశముతో పాఠములను జెప్పరాదు.

ప్రాథమిక పాఠశాలలలో నేయే తరగతుల కేయే పాఠములను జెప్పవలసినదియు నిర్ణయించుచు మద్రాసు విద్యాశాఖవారు విపులమగు సిలబసులను 1939 సం॥ జూన్ నెలలో ప్రకటించి యున్నారు. ఉపాధ్యాయులు వానిని శ్రద్ధతో జదువ వలయును.

**ఉపాధ్యాయుని కార్యక్రమపట్టిక:**—విద్యాశాఖవారు ప్రచురించిన ప్రణాళికలు మిగుల విపులముగ నున్నను నుపాధ్యాయుడు వానిని ఫలవంతముగ నుపయోగించుటకు జేయవలసిన పని కొంత కలదు. కార్యక్రమ పట్టికలను సిద్ధము చేసికొనుటయే యాపని. కార్యక్రమ పట్టికలను సిద్ధము చేయుట కుపాధ్యాయుడు సంవత్సరము పొడుగున నేర్పవలసిన ప్రతిపాఠమునందలి సిలబసును మూడుభాగములుగ జేయవలయును. ఆ మూడు భాగములలో జూన్ మొదలు దసరా సెలవుల వఱకును నేర్పు పాఠములు మొదటి భాగముగను, దసరా మొదలు క్రిస్మసుపండుగ వఱకును నేర్పు పాఠములు రెండవభాగముగను, క్రిస్మసు మొదలు వేసవి సెలవులవఱకును నేర్పు పాఠములు మూడవ భాగముగను నుండవలయును. ఈవిధముగ జేసిన మూడు

...గము లలో నొక్కొక్కదానిని మరల చిన్న భాగము లుగ విభజించి పతినెలలో నేయే పాఠములు నేర్పునదియు, బిదప ప్రతివారమేయే ...ఠములు నేర్పునదియుజూపు పట్టికలను సిద్ధము చేసికొనవలయును. ...నాటికి బాలురేయే పాఠములలో నెంత ముందునకు పోవుచున్నారో యీ పట్టికలు విశదముగ జూపవలయును. ఒక్కొక్కమాసముచివర ...పాధ్యాయుడు బాలుకు పోవలసినంత ముందుకు బోయిరదియు ...నిదియు బట్టికను జూచి తెలిసికొను చుండవలయును.

బోధనాక్రమ పట్టికలు:—ఉపాధ్యాయునకు ...ర్యక్రమ పట్టిక లవసరము ... ని బోధనాక్రమపట్టిక లంతకంటెను అవసరము. ఉపాధ్యాయుడు తాను పాఠశాలలో నేర్పు ప్రతిపాఠమునకును బోధనాక్రమ పట్టికను సిద్ధముచేసికొన వలయును. వీనిని సిద్ధముచేసికొనకయే యుపాధ్యాయుడు పాఠములను జెప్పబూనుకొన్న యెడల నాతని బోధనము లోపభూయిష్టముగ నుండగలదు. సిద్ధపడకయే పాఠములను నేర్పబూనుట యెవ్వరికిగాని సాహసమే యగును. సంవత్సరారంభమునందే యుపాధ్యాయు డొక్కొక్క పాఠమును సాంతముగ జదివి బోధనాక్రమ పట్టికను సిద్ధము చేసికొనవలయును. ఇట్లుచేయుటవలన నుపాధ్యాయుడు తొందరలేక సావకాశముగ పాఠముల నాలోచించుకొన గలడు. ఏపాఠముల నెప్పుడు నేర్పవలసినదియు, నొక్కొక్క పాఠమున కెంతకాలము వినియోగింపవలసినదియు దెలిసికొని వానిని స్వీకరించుటకు వలయు నేర్పాటులను జేసికొనగలడు. మఱియు నొక్కొక్క పాఠమునకు బాలురచే నేయే పనులను జేయింపవలసినదియు నిశ్చయించుకొన గలడు. ఇట్లు చేయుటవలన నుపాధ్యాయునికి ... కార్యనిర్వహణమునందు ధైర్యము కలుగును. బాలుర కాలమును వ్యర్థపుచ్చవలసిన యవసర మేర్పడదు. బోధనాక్రమ పట్టిక లున్నందున బోధనాభ్యసన పాఠశాలలలో శిక్షణము పొందుచున్న విద్యార్థులు వ్రాసినట్లు నేక శీర్షికల క్రింద ... నెక విషయములను వ్రాసి యుంచుకొనుట కాదు. నేర్పవలసిన పాఠములోని ప్రతి స్వల్పవిషయము పట్టికలో నుండరాదు. కాని పట్టికలో ముఖ్య శీర్షికల నుంచుకొని వానిక్రింది పాఠమునకు

చెందిన విషయములను వ్రాసి యుంచుకొనవలెను. ఆ శీర్షికలేవనిన. మొదటిది బోధనాంశము. దీనిక్రింద పాఠము పేరు, పాఠ్యగ్రంథములో లేక యుపాధ్యాయుడు క్రొత్తగా చెప్పు విషయములు, కఠినాంశముల విశదీకరణము, నల్లబల్లపై వ్రాయవలసిన సంగతులు, బాలురు జ్ఞాపకముంచుకొనదగిన పట్టీలు మున్నగు విషయములను వ్రాసి యుంచుకొనవలయును. బోధనాపద్ధతి రెండవ శీర్షిక. దీనిక్రింద నుపాధ్యాయుడుపయోగించు నుపకరణములు, పరిశోధనలు, దృష్టాంతములు, ముఖ్య ప్రశ్నలు మున్నగువానిని వ్రాసికొనవలయును. బాలురు చేయవలసిన పని మూడవ శీర్షిక. దీనిక్రింద నోటితో జవాబు చెప్పుట, వ్రాతపని, చిత్రపటములను, దేశపటములను వేయుట, విద్యావిహారములు నిర్దేశింపబడిన పనిని గమనించుట, సిద్ధము చేయుట మొదలగు పనులను వ్రాసికొనవలయును.

ఇంతకు బోధనాక్రమ పట్టికల ప్రయోజన మేమనగా: నవి తరగతిలో నుపాధ్యాయుని కుపయోగకరముగ నుండుటయే. కనుక నవి క్లుప్తముగను, సిద్ధము చేసికొన్న పాఠమును జ్ఞాపకమునకు దెచ్చునవిగను నుండవలయును. కాని కొందరు పాఠ్యగ్రంథములోని విషయముల సారాంశమునే బోధనాక్రమ పట్టికలో వ్రాయుదురు. మరి కొందరు తాము తీసిన యుపకరణములతోను, యుక్తములగు ప్రశ్నలతోను పాఠమును నేర్పుదుమని వ్రాసికొందురు. ఇట్టి పట్టికలంత ప్రయోజనకరముగ నుండవు. ఉపాధ్యాయుడు నేర్పు పాఠములకన్నిటికిని నా యా పాఠముల యవసరమునుబట్టి యెక్కువగనో తక్కువగనో బోధనాక్రమ పట్టికలను వ్రాసియుంచుకొనుటయే యుత్తమము.

ప్రధానోపాధ్యాయునికి పాఠక్రమ పట్టికలను జూపి, వానిని గురించి యాతని సలహా నొందుట మంచిది.

## ప్రశ్నలు

(1) ప్రాథమిక పాఠశాలలలో మొదటి [illegible] బాలురకును [illegible] చెప్పవలసిన పాఠము లెవ్వి? సంగీతము, చేతిపనులు, [illegible] పాఠములలో చేర్చుటకు గారణములను వ్రాయుము.

(2) గణితము, ప్రకృతి పరిశీలనము, చరిత్ర — ఈ పాఠములను చెప్పుటలో నుండవలసిన యుద్దేశము లెవ్వియై యుండవలయును?

ప్రాథమిక పాఠశాలలో బాలురకు నేర్పఁదగు చేతిపనులను బంగ్రెండింటిని వ్రాసి వానిలో నేవి యే సంగతులను నేర్పవచ్చునో సూచింపుము.

నీతి, మతబోధల వలని ప్రయోజన మేమి ? హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు చదువుచున్న పాఠశాలలో నీ పాఠముల ప్రణాళికను సిద్ధము చేయుము.

(5) కాలక్రమ పట్టికలు, బోధనాక్రమపట్టీలు — వీనికిగల భేదములను వ్రాయుము. వాని ప్రయోజన మేమి ? (1) 3వ తరగతికి తెలుగు పద్యము (2) రెండవ తరగతికి పనుల తీసివేత (3) నాలుగవ తరగతికి బుద్ధుడు — ఈ పాఠములకు బోధనాక్రమపట్టికలను సిద్ధము చేయుము.

# 5. పాఠ్యగ్రంథములు : కాలనిర్ణయ పట్టీలు

పాఠ్యగ్రంథములు:— పాఠముల బోధనకుఁ బునాదిగఁ బ్రాథమిక పాఠశాలలలో సాధారణముగ నన్ని పాఠములకును బాఠ్యగ్రంథ ములుండుటయే యుక్తపద్ధతి. వీనివలన ననేక ప్రయోజనములు కలవు. ఒక్కొక్క పాఠములో నేవిషయములను నేర్పవలసినదియు, నాయా విషయములక్రింద నేయే సంగతులు బోధించునదియు బాఠ్యగ్రంథములు సూచించును. ఆయా తరగతుల బాలురకు తగిన భాష తగినదిగ నుండునదియు, పాఠము లేవరుస క్రమమున నుండవలసినదియు పాఠ్యగ్రంథములు నిర్ణయించును. కనుక నుపాధ్యాయునికి శ్రమ చాలమట్టునకు దొలగును. కాని యుపాధ్యాయులు పాఠ్యగ్రంథములకు దాసులు కాఁగూడదు. అనగా పాఠ్యగ్రంథములో వ్రాయబడినదానికన్న నొక్క యక్షరము నధిక మెక్కువ చెప్పఁగూడదనిగాని, యందలి వరుస క్రమమునకు తప్ప వేఱొకరీతిని పాఠమును బోధింపరాదనిగాని, యవసరమగుచో పాఠ్యగ్రంథ మందలి భాషకంటె నుత్తమమగు భాషను బాలురకు నేర్పకూడదని కాని యుపాధ్యాయులు తలంపరాదు. కావున నుపాధ్యాయులు తమ బోధనాక్రమ పట్టికలలో పాఠ్యగ్రంథములలోని విషయముల మార్పులు, వానికిఁ గూర్పులు, తీసివేతలు మున్నగు వానిని వ్రాసికొనవలసియుండును.

§

కొందఱుపాధ్యాయులు పాఠ్యగ్రంథమును బూర్తిగ విడచి తమ స్వంతత్రోవనే త్రొక్కుదురు. అట్టివారు పాఠ్యగ్రంథమును జదువ నొల్లని బద్ధకముచేతనైనను, పాఠ్యగ్రంథములోని విషయములకంటె నెక్కుడుగఁ దమకు దెలియుననుభావముతోనైనను నట్లు చేయుదురు. పాఠ్యగ్రంథమును విడుచు నుపాధ్యాయుడు స్వంతముగ సిద్ధపడకయే పాఠములను జెప్పును. కనుక బాలుర కాలము వ్యర్థమగును. మఱియు బాలురు పాఠ్యగ్రంథములను గొనకయుందురు. అట్టి యుపాధ్యాయునివలన బాలురు పాఠములను సక్రమముగ నేర్చుకొనజాలరు. అట్లని పాఠ్యగ్రంథమునే నమ్ముకొని యితరగ్రంథములను జూచి మఱికొన్ని నూతన విషయములను బాలురకుఁ జెప్ప గూడదనియు గాదు. కనుకఁ బాఠ్యగ్రంథములు నిర్ణయింపఁబడి నపుడు బాలురందరును, వానిని గొని చదువునట్లు పాఠశాలాధికారులు శ్రద్ధగఁ జూడవలయును.

పాఠ్యగ్రంథ లక్షణములు:— బాలుర యుపయోగార్థమై నిర్ణయింపబడిన పాఠ్యము లీ క్రిందఁ జేర్కొనిన లక్షణములు కలవిగ నుండవలయును.

1. ముద్రణము:—ముద్రణము చక్కఁగా నుండవలయును. అక్షరములు మిక్కిలి చిన్నవిగ నుండరాదు. తగిన పరిమాణముగల యక్షరములుగ నుండవలయును. కాగితములు మందముగ నుండవలయును. అన్నివిధముల శుభ్రముగ నుండవలయును. లేకున్న బాలుర కన్నులకు హాని కలుగును.

2. పటములు:— పటములన్నఁ బిల్లలకుఁ బ్రీతి యెక్కువ. కనుక ప్రతి పాఠ్యగ్రంథమునను తగినన్ని చక్కని పటము లుండవలయును. భయమునుగాని యసహ్యతను గాని పుట్టించు పటము లుండరాదు.

3. కూర్పు:— బాలురు గ్రంథములను సాధారణముగ జాగ్రత్తగ వాడుకొనరు. కనుక కూర్పు గట్టిగ నుండవలయును. లేనిచో గ్రంథము త్వరగాఁ జెడిపోవును.

4. ఆకర్షణీయత:—గ్రంథ మాకర్షణీయముగ నుండి జీవకళ లుట్టిపడు చుండవలయును. అట్టి గ్రంథములను జదువ బాలుర కుత్సాహము కలుగును.

5. వెల:—గ్రంథముల వెల చౌకగా నుండవలయును. బాలురు గ్రంథములను బోగొట్టుకొనుటయు త్వరితముగ జినుగ గొట్టుకొనుటయు సామాన్యము. కనుక పాఠ్యగ్రంథముల ధరలు చౌకగ నుండవలయును.

ప్రాథమిక పాఠశాలలోని మొదటి మూడు తరగతులకు పాఠ్యగ్రంథము లెక్కువగ నుండరాదు. ఈ తరగతులకు మాతృభాషలోని వాచక మొకటి యుండినజాలును. తక్కిన పాఠము లన్నియు పాఠ్యగ్రంథసాహాయ్యము లేకయే బాలురు నేర్చుకొనగలరు. వ్రాతపనికి బలకలు, బలపములు నుపయోగింప వచ్చును. తక్కిన తరగతులలో తెనుగు, లెక్కలు, చరిత్ర, భూగోళము, సామాన్యశాస్త్రము. ఈపాఠములకు పాఠ్యగ్రంథము లుండనగునని కొందఱందురు కాని, నాలుగవ తరగతిలో లెక్కలు, చరిత్ర పాఠములకు బాలురు పాఠ్యగ్రంథములను గొనవలసిన యవసర మగపడదు. అనవసరముగ పాఠ్యగ్రంథముల సంఖ్యను హెచ్చించినయెడల బాలుర తల్లిదండ్రులు వానిని గొని యిచ్చుటకు డబ్బు సంపాదింప లేక కష్టపడుదురు.

పాఠ్యగ్రంథముల నిర్ణయము:—ప్రభుత్వము వారి చట్టము ననుసరించి మతగ్రంథములు తప్ప పాఠశాలలో నుపయోగించు గ్రంథము లన్నియు పాఠ్యగ్రంథనిర్ణాయక సంఘము వారి యామోదమును బొందినవిగానే యుండవలయును.

పాఠ్యగ్రంథనిర్ణాయక సంఘమువారు సంవత్సరమున కొక పర్యాయము పాఠశాలలోని బాలు రుపయోగింపదగు గ్రంథముల పట్టికను సిద్ధముచేయుదురు. ఆపట్టికలోని గ్రంథములనే పాఠశాలలు పాఠ్యగ్రంథములుగ నుపయోగింపవలయును. ప్రభుత్వపు పాఠశాలలలోని బాలురే గ్రంథములనుచదువవలసినదియు జిల్లావిద్యాశాఖాధికారి

నిర్ణయము చేయుదురు. డిస్ట్రిక్టుబోర్డు పాఠశాల లుపయోగింప వలసిన గ్రంథములను జిల్లాబోర్డు విద్యాసంఘము వారును పురపాలకసంఘ పాఠశాల లుపయోగింప వలసిన పుస్తకములను పురపాలకాధ్యక్షుడును, ప్రయివేటు పాఠశాల లుపయోగింపవలసిన గ్రంథములనాయా పాఠశాలానిర్వహణాధికారులును, పంచాయితీ పాఠశాలలు వాడుకొనవలసిన గ్రంధముల నా పంచాయితీయధ్యక్షుండును నిర్ణయము చేయుదురు. ఒకసారి నిర్ణయింపడిన గ్రంధములు కనీసము రెండేండ్లవఱకైన నుపయోగింపఁబడ వలయును. అన్ని తరగతుల లోను నొకేసరళికిఁజెందిన గ్రంధము లుపయోగించుట యుక్తము.

కొన్నిబడులలో నుపాధ్యాయులు నోట్సు సిద్ధముచేసికొని వచ్చి వానిని బాలురు తమ నోటు పుస్తకములలో వ్రాసికొనునట్లు చేయుదురు. ప్రతి పాఠమునకును నోట్సు చెప్పుటవలన బాలురుంచు కొనవలసిన నోటుపుస్తకముల సంఖ్య యధికమై తలితండ్రులకు భారమగుటయేగాక వానివలనఁ బ్రయోజన మంతగా నగపడదు. కొన్ని వేళల నుపాధ్యాయులు పాఠములను శ్రద్ధగ సిద్ధము చేసుకొనక నోట్సు చెప్పుటయుఁ గలదు. పాఠశాలలోని బాలుఁడేసేం పాఠములకు నోటుపుస్తకము లుంచుకొన వలసినదియు ప్రధానోపాధ్యాయుడు జాగ్రత్తగ నాలోచించి నిర్ణయింపవలయును. నోటుపుస్తకములు కొలదిఁగ నుండుటయే యుత్తమము.

కాలనిర్ణయ పట్టికలు:—విద్యా సూత్రముల ననుసరించి జాగ్రత్తగ సిద్ధముచేయఁబడిన కాలనిర్ణయ పట్టికలు పాఠశాలల కత్యంత ప్రయోజనకరము లనుట సత్యము. పాఠశాలలో సంవత్సరము పొడుగునను నేర్పవలసిన పాఠములను ప్రణాళిక నిర్ణయముచేయును. ప్రతితరగతిలోఁ బ్రతిదినము ప్రతిగంటలోఁ జేయవలసిన పనిని కాల నిర్ణయ పట్టిక తెలుపును. కాలనిర్ణయపట్టిక తగిన విధమున సిద్ధము చేయఁబడి యున్నచోఁ బాఠశాలలోని పనియంతయు సనాయా సముగను, జులుకుగను జరుగఁగలదు. కాలనిర్ణయ పట్టికలో లోపము

లున్నయెడల నొకతరగతి మఱొక తరగతియొక్క పని కాటంకము కలిగించుటవలన పాఠశాలలో జరుపవలసిన పనికి భంగముకలుగును.

కాలనిర్ణయ పట్టీలు సిద్ధము చేయుటలో గమనింపవలసిన విషయములు:— పాఠశాలలో నేర్పవలసిన పాఠము లన్నింటికిని వానిని వాని ప్రాధాన్యము ననుసరించి పాఠశాలధ్యాపన కాలమును భాగింపవలయును. ప్రధానములగు పాఠములకు దక్కువ కాలమును మాత్రమే ఏర్పఱుపవలయును. కఠినములగు పాఠములను, బడి పని ప్రారంభింపగనే బాలురు అలసట జెందకయున్నప్పుడు నేర్పుట కేర్పాటు చేయవలయును. బాలురలసటగనున్నప్పుడు సులభము లగు పాఠములను నేర్పవలయును. ఒకపాఠము నేర్పినప్పు డింకొక పాఠమున కభ్యంతరము గలుగకుండఁ జూడవలయును. పాఠములను వారము పొడుగునను సమానముగ భాగింపవలయును. అనఁగా లెక్కలపాఠము నయిదుపర్యాయములు చెప్పవలసియున్నచో నొక్క దినమే యైదు పర్యాయములు చెప్పుటకంటె దినమున కొక పర్యాయము చెప్పుట మేలు. అట్లే యుపాధ్యాయుల విరామకాలముకూడ భాగింపఁబడవలయును. ప్రతి యుపాధ్యాయునకు దినమున కొక గంటయైనను విరామముండవలయును. ఒకే యుపాధ్యాయుఁడు రెండు తరగతులకు బోధనలు చెప్పవలసియున్నపుడు కాలనిర్ణయపట్టికలో నొకతరగతికి మౌనపఠనము, వ్రాత, పటములను వేయించుట మున్నగు పనుల నేర్పఱచి, రెండవదానికి నేర్పవలసిన పాఠముం నేర్పఱచు కొనవలయును. మౌనపఠనము, వ్రాత మున్నగు పనులను జేయు విద్యార్థులు కాలమునకుఁ దగినంత పనిని జేయవలసియుండునట్టి యేర్పాటులను జేయవలయును. కాలనిర్ణయ పట్టికను సిద్ధముచేయించిన పిదప దానిని కచ్ఛితముగ ననుసరింపవలయును. దానిలో నేదైన మార్పు చేయవలసియున్నచో సహోపాధ్యాయులు ప్రధానోపాధ్యాయుని కావిషయ మెఱుకపఱచి యట్టిమార్పును తమ తరగతి పట్టికలోను ప్రధానోపాధ్యాయుని పట్టికలోను జేయింపవలయును.

## విద్యాశాఖ వారు సూచించిన కాలవిభజన పద్ధతి

### మొదటి అయిదు తరగతులకు

| | నిర్బంధపాఠములు పీరియడులు | అభిమానపాఠములు పీరియడులు |
|---|---|---|
| తెనుఁగు | 3 | |
| రెండవ భాష | - | 5 |
| లెక్కలు | 5 | |
| ప్రకృతి పఠనము, తోటపని | 2 | |
| శరీర వ్యాయామము | 2 | |
| చరిత్ర, భూగోళము | 2 | |
| హైజీను (ఆరోగ్యశాస్త్రము) | 2 | |
| సంగీతము | 2 | |
| చేతిపనులు | 5 | |
| సివిక్సు, నీతిబోధ | 2 | |
| మొత్తము | 25 | 5 |

### 6, 7, 8 తరగతులకు

| | నిర్బంధపాఠములు పీరియడులు | అభిమానపాఠములు పీరియడులు |
|---|---|---|
| భాష | 7 | 6 |
| లెక్కలు | 5 | |
| సామాన్య శాస్త్రము / బాలికలకు గృహతంత్రము | 3 | |
| చరిత్ర | 2 | |
| భూగోళము | 2 | |
| సివిక్సు, నీతిబోధ | 2 | |
| శరీర వ్యాయామము | 2 | |
| వృత్తివిద్య పాఠములు | 6 | |
| మొత్తము | 29 | 6 |

పీరియడు అనగా సామాన్యముగ 30 నిముషములు మొదలు 50 నిమిషములకాలము. వారములో దినమున కేడు పీరియడుల చొప్పున పనిచేయవలయును. దినమున కయిదు గంటల కాలము బడిపని జరుగవలయు ననియు సంవత్సరమునకు 220 దినములు ప్రాథమిక పాఠశాలలు పనిచేయ వలయుననియు విద్యాశాఖ వారి నియమములు గలవు.

తరగతికొక యుపాధ్యాయుఁడుండుట:—ప్రాథమిక పాఠశాలలలో నుపాధ్యాయుడు బాలురను జక్కగ గమనించి వారేయే పాఠములలో వెనుకఁబడియున్నారో తెలిసికొని, వారి కాయా పాఠములలో నవసరమైనయెడల ప్రత్యేకముగ బోధన చేయవలసియుండును గనుకను, పాఠములకంటె బాలుర సర్వతోముఖాభివృద్ధి కోరదగియున్నది గనుకను తరగతికొక యుపాధ్యాయుఁడుండి, పాఠములన్నియు నతడే నేర్పుట యుక్తమగు పద్ధతి. చిన్న తరగతులలో నేర్పవలసిన విషయమును మిగులఁ గొలదిగనే యుండును. కనుక పెద్ద తరగతుల కేర్పాటు చేసినట్లు పాఠమునకొక యుపాధ్యాయు నేర్పాటు చేయుట యుక్తముగ నుండదు. ఒక యుపాధ్యాయుఁడే పాఠములన్నియుఁ జెప్పుచున్నయెడల నొక పాఠముక్రిందఁ జెప్పిన విషయములను వేఱొక పాఠముక్రిందఁ జెప్పక యుండును. ఈ పద్ధతిలోఁగల యొక లోపమేమనిన ఒకవేళ నుపాధ్యాయుఁ డొక బాలునిమీద నేదోయొక కారణముచేఁ గోపము, నప్రియము చూపినయెడల నట్టి బాలునికి దినమంతయు బడిలో సంకటముగ నుండును

## ప్రశ్నలు

(1) ఉత్తమ పాఠ్యగ్రంథములను పేర్కొనుము.

(2) ప్రాథమిక పాఠశాలలోఁ బాఠ్యగ్రంథములు తెలుగునకేఁ దప్ప తక్కిన పాఠములకు లేవనుకొనుము. అట్టి పరిస్థితి వలనఁ గలుగు మేలు కీడులను జెప్పుము.

(3) ప్రస్తుతము వాడుకలోనున్న ఆఱు తెలుఁగువాచకములను దీసికొని పరీక్షించి వానిలో నేది యుత్తమముగ దోఁచునో కారణములతోఁ దెలుపుము.

(4) కాలనిర్ణయపట్టీ లేకున్నఁ గలుగు నష్టమేమి?

(5) ప్రాథమిక పాఠశాలలలోని మొదటి రెండుతరగతుల కొకే యుపాధ్యాయు డున్న మొదల నా రెండుతరగతులకును కాలనిర్ణయ పట్టికను సిద్ధము చేయుము.

(6) గణితము, చిత్రలేఖనము, సాహిత్యము, తెలుగు ఈ పాఠములు కాలనిర్ణయ పట్టికలో నెచ్చట నుండవలయునో కారణములతో వ్రాయుము.

## 6. విద్యార్థులను తరగతులుగా విభజించుట

బాలుర ప్రవేశము:—బాలురను సాధారణముగ సంవత్సరమునకు రెండుపర్యాయములు మాత్రమే బడిలో జేర్చుకొనవలయు ననియు, మధ్యకాలమున డిప్యూటీ ఇన్స్పెక్టరుగారి యనుమతి లేక యెవ్వరిని జేర్చుకొనరాదనియు విద్యాశాఖవారి చట్టము. ఆ రెండు పర్యాయము లేవన వేసవిసెలవు లయినతోడనే జూన్ మాసములో బడిపని ప్రారంభించునప్పు డొకపర్యాయము; క్రిస్ మస్ పండుగ సెలవు లైన పిమ్మట బడిపని మొదలుపెట్టునప్పుడు రెండవపర్యాయము. కాని మొదటితరగతిలోనికి బాలుర నెప్పుడైనను చేర్చుకొనవచ్చును.

ఈ యేర్పాటునకు కారణము:—బడిలో నుపాధ్యాయుడు నేర్పు పాఠములను మొదటినుండియు క్రమముగ బాలురందరు నేర్చుకొనవలసి యున్నారు. అట్లు నేర్చుకొనుటకు దరగతి ప్రారంభించిన నాడే ఉపాధ్యాయుని తరగతిలో నెంతమంది బాలు రుండవలయునో యంత మందియు నుండుట మంచిది. మధ్యలో బాలురను నూతనముగ జేర్చినయెడల వారు మొదట జేరినవారిలో సమానముగ పాఠములను నేర్చుకొనలేక వెనుకబడుదురు. వెనుకబడినవారికి పాఠములను జెప్పుచు వారు నేర్చుకొనువఱకు కాచియుండినయెడల నితర బాలురు నేర్చుకొనవలసిన పాఠముల కాటంక మేర్పడి, యుపాధ్యాయుడు నియమిత కాలములోపల పాఠ్యప్రణాళిక ప్రకారము నేర్పవలసిన పాఠముల నన్నింటిని నేర్పలేకపోవును. నేర్పినను తృప్తికరముగ నేర్ప జాలక పోవును. కాబట్టి సంవత్సరారంభమునందే బడిలో జేరవలసిన బాలురందఱు చేరుట కోరదగియున్నది. ఇట్లు జరుగుటకును వేసవి

కాలపు సెలవులలో నుపాధ్యాయుఁడు బడికి రాఁదగిన వయస్సులో నున్న బిడ్డల తల్లిదండ్రులను దర్శించి వారిబిడ్డలను సకాలమున బడిలో జేర్చుటను గూర్చి వారికిఁ జెప్పవలయును. ఇట్లు చేసినచో బాలురందఱును బడి ప్రారంభించిన కొలది దినములలోనే బడిలో చేరుదురు.

బడిబాలుర వయస్సు:—విద్యాశాఖవారి చట్టముప్రకారము ౫½ యేండ్లకుఁ దక్కువ వయస్సుగల బాలురను గాని, ౫ ఏండ్లకుఁ దక్కువ వయస్సుగల బాలికలను గాని బడిలోఁ జేర్చుకొనరాదు. ఈ వయస్సు లేని బాలబాలికలు బడిలో నుపాధ్యాయుఁడు చెప్పు పాఠములపై మనస్సును నిలుపనేరక యుందురు. అట్టివారు ప్రత్యేకముగ నేర్పరుపబడిన శిశుతరగతికిఁ బోవలయును. వయస్సు చాలని బిడ్డల నుపాధ్యాయుఁడు బడిలోఁ జేర్చుకొన్నచో వారతఁడు చెప్పు పాఠములను గ్రహింపలేక యతనికి శ్రమ కలిగింతురు. అంతియగాక తగిన వయస్సుగల బాలురకుఁ జెప్పు పాఠముల కాటంకము కలిగించువారగుదురు. ఇందువలన నిరుత్సాహము కలిగి, పాఠశాలయభివృద్ధ్యుపాదులకే భంగము వాటిల్లును. కాఁబట్టి యుపాధ్యాయుఁడు వయస్సు చాలని బాలబాలికలను బడిలో నెప్పుడును జేర్చుకొనరాదు.

వయస్సు మించిన బాలురను సైతము బడిలోఁ జేర్చుకొనరాదను నియమము గూడ గలదు. దీనికి గారణమేమనఁ: పెద్దవయస్సుగల బాలురు చిన్నతరగతులలోఁ బ్రవేశించినపుడు వారు తమ చదువు ముగించువఱకు బడిలో నుండక మధ్యగా బడివిడిచి తాము నేర్చుకొన్నది మఱచిపోయి, నిరక్షరాస్యులలోఁ జేరుదురు. అంతియగాక, వయస్సు మించిన బాలురు బడిలో నున్నచో నట్టి బడికి నితరుల తల్లిదండ్రులు తమ కుమార్తెలను బంపుట కుత్సాహము జూపరు. కాబట్టి వయస్సుమించిన బాలురనుగూడ బడిలోఁ జేర్చుకొనకుండుటయే యుత్తమము.

బాలికలను జేర్చుకొనుట:— బాలికావిద్యకొఱకు గ్రామములో నొక సంపూర్ణ పాఠశాల యున్నప్పుడు బాలికలను బాలుర పాఠశాలలలోఁ జేర్చుకొనరాదు. అట్లు చేయుటవలన బాలికాపాఠశాలతో స్పర్ధచేసినట్లగును. కాని బాలికలకుఁ బ్రత్యేక పాఠశాల

యుండక గ్రామ సంఘటితికిని బాలుర పాఠశాలయే యైనయెడల నుపాధ్యాయుఁడు బహువయస్సులోనున్న బాలికలను బడిలోఁ జేరునట్లు ప్రోత్సహింపవలయును. అట్టి పాఠశాలలోని బాలుర సంఖ్యకు దాదాపు సమానసంఖ్యగల బాలిక లుండనియెడల నా పాఠశాల గ్రాంటులో కోఁత యుండును.

బాలబాలికలను బడిలోఁ జేర్చుకొనకముం దుపాధ్యాయుఁడు విద్యార్థిపుట్టిన దినమును దప్పక దెలిసికొనవలయును. మఱియు టీకాలు వేయించుకొన్నట్లు నిశ్చయముగఁ దెలిసిననే యేవిద్యార్థిని బడిలోఁ జేర్చుకొనరాదు. విద్యార్థి నేతరగతిలో జేర్చుకొనవలయుననువిషయములకు దెల్పుటకు విద్యార్థిని బరీక్షనైన చేయవలయును; లేదా విద్యార్థి వేఱొక పాఠశాలలో జదివియున్న యెడల నచ్చటినుండి 'రికార్డుషీటు'ను తెప్పించవలయును. రికార్డుషీటునుబట్టి యావిద్యార్థి యే తరగతిలోఁ జేరుట కర్హుఁడో దానిలో నతనిని జేర్పవలయును. అంతకుమునుపు యే పాఠశాలలోను జదువక వచ్చినవానిని తెనుగు, లెక్కలు, సామాన్యజ్ఞానము—ఈ పాఠములలోఁ బరీక్షించి యే తరగతికి సరిపడునో యా తరగతిలో, జేర్చుకొనవలయును. ప్రాథమిక పాఠశాలలలో నీపనిని ప్రధానోపాధ్యాయుఁడే చేయుట మంచిది.

బాలుర విభజన:—ప్రాచీనకాలమున మనదేశములో నిప్పటి పద్ధతుల ననుసరించిన పెద్ద పెద్ద పాఠశాలలుగాని, ముప్పది నలుబది మంది బాలురు గల తరగతులు గాని యుండినవనుట కాధారము లంతగా లేవు. ఈ పెద్దతరగతుల పద్ధతి పాశ్చాత్యుల విద్యావిధానములలో నొక ముఖ్యలక్షణము. బాలుర ననేకుల నొక తరగతిగాఁ జేర్చి పాఠములను బోధించుటవలన బాలుర కుత్సాహము కలుగును. ఒకనిచూచి యొకరు చదువ వలెనను నాశపుట్టును. ఉపాధ్యాయుని కడ నేర్చుకొనిన విషయముల నితరబాలురనడిగి నేర్చుకొనవలయును. అనేక బాలుర విద్య స్వల్పవ్యయముతో సాగును.

కాని బాలుర విభజనలో ననేకకష్టములు లేకపోలేదు. ప్రపంచములో నే యిద్దరు బాలురును సమానమగు శారీర, మానసిక, నైతిక శక్తులను గలిగియుండరు. ప్రతి యిద్దరు బాలురకును నెంతో

భేద ముండును. అట్లుండ తరగతిలోని ముప్పది నలుబదిమంది బాలురకు సమానమైన మానసిక శక్తులు కలవనియు, వారందఱు నొక తరగతిలో జదువుటవలన వారిమనస్సులు వికసించుననియు ననలేము. కాని ప్రస్తుత విద్యావిధానములో నింతకన్న మంచి పద్ధతిగాని, వేఱొకపద్ధతిగాని యగపడదు. కనుకనే చేతనైన విధమున బాలురను తరగతులుగా విభజించి విద్య నేర్పవలసివచ్చినది.

బాలుర విభజనలో నీక్రింది విషయములను జ్ఞాపకముంచుకొనవలయును. అవి యేవన:—

1. సమానములైన తెలివితేటలుగల బాలురందర నొక తరగతిలోఁ జేర్చుట, తెలివితేటలలో గొప్ప భేదములున్న బాలుర నొక తరగతిలో నుంచినయెడలఁ దెలివిగల బాలురకుఁ జెప్పు పాఠములు మందమతులకు బోధపడక యుండును. బుద్ధిమాంద్యము గల విద్యార్థులకుఁ బాఠములు చెప్పునపుడు తెలివిగలవారికి విసుగు పుట్టును. బాలురందరి తెలివియు నించుమించు సమానముగా నున్నపు డిట్టి కష్టములు గలవు.

2. ఒక్కొక్క తరగతిలోను ఇరువది, ముప్పదిమంది బాలురకంటె నెక్కువమంది యుండకుండుట: అట్లున్నయెడల నుపాధ్యాయుఁడొక్కొక్క బాలుని గమనించి శ్రద్ధ చేయజాలడు.

3. చిన్న తరగతులలో బాలబాలికలు కలిసియే చదువుట.

4. బాలుర యోగ్యతలనుబట్టి యొక తరగతిలోఁ జేర్చిన పిదపఁ దల్లిదండ్రుల మొగమోటమికొఱకు పైనున్నతరగతిలోని కా బాలురఁ జేర్చకుండుట.

నిర్దుష్టవిభజనవలని లాభములు:—బాలు రందరును సమానజ్ఞానము గలవారగుటచేత నుపాధ్యాయుఁడు బోధించు పాఠములను గ్రహింపఁగలిగి యుందురు. అప్పుడు తరగతిలోని బాలు రందఱును సమానముగ ముందునకు సాగుదురు. బాలుర కెట్టి యాటంకములును లేకుండ విద్య నెమ్మదిగా నడచును. తరగతిలోఁ గ్రమశిక్షకెట్టిలోపమును లేకుండును. బాలురు తమతమ పనులలో నిమగ్నులై యున్నందున తుంటరిపనులకు బోవుట కెవ్వరికి నవకాశ ముండదు.

ఇట్టి పరిస్థితులలో నుపాధ్యాయునికి బాలురకును దను పనినిగూర్చి యానందము కలుగును.

ముష్టివిభజనవలన నష్టములు:— బాలుర తెలివితేటలయందు భేదము లుండుటవలనఁ దరగతిలోని బాలురందఱు నేకముగ ముందునకు సాగిపోవుట కవాంతర మేర్పడును. తెలివితేటలుగల బాలురుపాధ్యాయుఁడు చెప్పు విషయముల నతిశీఘ్రకాలముననే గ్రహించి యాతడు మందబుద్ధులకు పాఠములను చెప్పునప్పుడు చేయునది లేక ప్రక్కనున్న బాలురతోఁ గలహించి క్రమశిక్షకు భంగము కలిగించుదురు. తెలివిగల బాలురుపాధ్యాయుఁడు చెప్పిన పాఠములను త్వరితముగ గ్రహించి ముందునకు బోవుటవలన వెనుకఁబడిన బాలురకు నిరుత్సాహము కలుగును. వెనుకఁబడిన బాలుర కుపాధ్యాయుఁడు పాఠములను జెప్పుచుండఁ దెలివిగల బాలుర కాలము వ్యర్థమగుచుండును. అసమాన యోగ్యతలుగల బాలు రొక్కతరగతిలో నుండుటవలన గొందరు బాలురు నిరుత్సాహముఁజెంది పాఠములను జదువక యొక్కొక్క తరగతిలో రెండేండ్లుండుటయు తటస్థించును.

కచ్చితమగు ప్రమాణముల ననుసరించి బాలురను విభజించి తరగతు లేర్పఱచినను, తరగతిలో నతి చురుకుదనమును, సూక్ష్మాగ్రబుద్ధియు నగపఱచు బాలురను సంవత్సరమధ్యముననే పై తరగతి కెక్కించు నేర్పాటుకూడఁ బాఠశాలలలో నుండుట మంచిది. సామాన్యముగ బాలురను సంవత్సరమున కొక పర్యాయము పరీక్ష చేసి పైతరగతుల కెక్కించుచుందురు. గ్రామపాఠశాలలలో నీపని డిప్యూటి ఇన్‌స్పెక్టరు చేయుచుండును. పరీక్షలను జరిపి వానిలో గృతార్థులైన బాలురనే పైతరగతుల కెక్కించవలయును. ఈ పరీక్షలలో ప్రశ్నలకు నుచితముగురీతిని నుత్తరములను వ్రాయువారికి నియమము చొప్పున మార్కుల నిచ్చి, వారి తెలివితేటలను, కృషిని విలువకట్టవలయును. పరీక్షలోఁ గృతార్థులగుటకు నియమములను ముందే యేర్పఱచుకొనవలయును. నియమములకుఁ జాలని వారిని పైతరగతుల కెక్కించరాదు.

ఉపాధ్యాయులు; తరగతులు:— సామాన్యముగ నొక్కొక్క తరగతి కొక్కొక్క యుపాధ్యాయుఁ డుండవలయును. ఒకటికంటె

నెక్కువ తరగతుల కొక్క యుపాధ్యాయుఁడే యొకకాలమున బాఠము లను జెప్పలేఁడు. కనుక నట్టి యేర్పాటు చేయరాదు. చేసినయెడల బాలురకు జక్కని విద్యలభింపదు. తరగతులకు ఉపాధ్యాయుల నేర్ప ఱచునపు డుపాధ్యాయుని యోగ్యతలను గుణమునుబట్టి నియమింప వలయును. ఓపికయు, ననుకంపయు గలవారిని జిన్నతరగతులకు నియమింపవలయును. తరగతికి నేర్పవలసిన పాఠముల నెవరుచక్కగ బోధింపఁగలరో యనియు విచారించి యేర్పఱుపవలయును.

బాలుర యభివృద్ధి:— పాఠశాలలోని బాలురెట్లభివృద్ధి చెందు చున్నదియుఁ దెలియుటకుఁ బ్రతి యుపాధ్యాయుఁడును దన తరగతి బాలురు తరగతి పరీక్షలలోఁ దెచ్చుకొను మార్కుల నొక పట్టీలో వ్రాసి యుంచవలయును. వానినే గాక దసరా క్రిస్మసు పండుగ లప్పుడు చేయు పరీక్షలలో సంపాదించిన మార్కులను గూడ వ్రాసి యుంచవలయును. దురదృష్టవశమున సాంవత్సరిక పరీక్షలో నేవిద్యార్థి యైనను రోగపీడితుఁడై బడికి రాఁజాలని యెడలఁ బైతరగతికిఁ బోవు టకు వారికిఁగల యర్హతను నిశ్చయించుటకీ మార్కుల పట్టీలు మిగుల తోడ్పడఁ గలవు.

బడిలోని ప్రతి విద్యార్థియొక్క పాఠశాలా జీవితమునుజూపు 'రికార్డుషీటు' ప్రతిబాలుని పేరిట నొకటి యుండవలయును. బాలుఁ డొక పాఠశాల విడిచి మఱొక పాఠశాలలోఁ జేరునపు డీ రికార్డు షీటును తీసికొనిపోయి యచ్చట పాఠశాలాధికారులకుఁ జూపి యా బడిలోఁ బ్రవేశింప వలయును. రికార్డుషీటునుగూర్చిన వివరములు యీ గ్రంథము చివరనున్న అనుబంధములలోఁ గాననగును.

## ప్రశ్నలు

(1) విద్యార్థులను సంవత్సరమునకు రెండుపర్యాయములు మాత్రమే బడిలోచేర్చు కొనవలసినట్లును, నితర సమయములలోఁ జేర్చుకొనరాదనియు నియమ ముం డుటకు గారణము లను వ్రాయుము.

(2) అక్టోబరు మాసములో నిద్దఱు బాలురు నీవు పనిచేయుచున్న బడిలోఁ బ్రవే శింపఁగోరుదురు. ఒకడు మొదటి తరగతి, ఇంకొకఁడు మూఁడవ తరగతి, వారిని చేర్చుకొనుట కేమి చేయుదువు?

(3) విద్యార్థులను తరగతులుగా విభజించుటలో గమనింపవలసిన యంశము లెవ్వి?

(4) దుష్టాభ్యాసముల వలనఁ గలుగు కీడులను వివరింపుము.

(5) విద్యార్థుల జీవనమును గూర్చిన నియమములను విశదముగ వ్రాయుము.

(6) తరగతికొక్క యుపాధ్యాయుఁడు చొప్పున నుండకున్న గలుగు నష్టము లెవ్వి?

# 7. పరీక్షలు

మనదేశమున నేఁటి విద్యావిధానములో పరీక్షలత్యంత ప్రాముఖ్యమును జెందియున్నవి. కేవలము బాలురు పరీక్షలలోఁ గృతార్థులగునట్లు చేయు నుద్దేశముతోనే విద్య గరపఁబడుచున్నది. ఇతరోద్దేశము లేమైన నున్నయెడల నవి యంత ముఖ్యములుగ నెంచఁబడుటలేదు. ఒక పాఠశాల తృప్తికరముగఁ బనిచేయుచున్నదా లేదా యను ప్రశ్న వచ్చినప్పుడా పాఠశాలలో నూటికెంతమంది చొప్పున పరీక్షలోఁ గృతార్థులగుచున్నారను ప్రమాణముమీఁదనే యా పాఠశాలలోని పనికి విలువకట్టుచున్నారు. కనుక నుపాధ్యాయులు ఎట్లులైనను బాలురను పరీక్షలలో నెగ్గఁజేయవలయు ననుతలంపుతోనే పాఠములను నేర్పుచున్నారు. ఇది మిగుల విచారకరము. ఏలయనఁ బరీక్షలలోఁ గృతార్థులగుటయే నిజమైన విద్య కాదు. ఒకఁడు పరీక్షలో ప్రథముఁడుగఁ గృతార్థుఁడు కావచ్చును. కాని వాఁడు నిజముగ విద్యావంతుఁడు కాకపోవచ్చును. విద్యార్థిలోని మానసిక, నైతిక శక్తులను వెలికిఁదీసి వానిని వికాసము చెందించుటయే విద్యయని వెనుక చెప్పితిమి. పరీక్షలలో జయము పొందవలయునను నుద్దేశములతోఁ జదువును సాగించిన యెడల నిజమైనవిద్య కవకాశము లభింపకపోవును.

కాని, యుపాధ్యాయులమీఁద నీ తప్పు మోపరాదు. కళాశాల విద్యయందేమి, ఉన్నత పాఠశాలలలోనేమి, పరీక్షల కగ్రస్థానమున్నందున నా సంస్థల ననుసరించి ప్రాథమిక విద్యావిధానములో సయితము పరీక్షల కధిక ప్రాముఖ్య మేర్పడినది.

<u>పరీక్షల యుద్దేశము:</u>— బాలుఁడు పాఠశాలలో నేర్చుకొన్న విషయముల నెంతవఱకు నవగాహనము చేసికొన్నాఁడో యవసర మేర్పడినప్పుడా సంపాదించిన జ్ఞానము నెంతవఱకు నుపయోగింపఁ గలుగుచున్నాఁడో యని తెలిసికొనుటయే పరీక్ష యుద్దేశము. పరీక్షలు కేవలము విద్యార్థియొక్క జ్ఞాపకశక్తిని బరీక్షించునవిగ నుండరాదు. కాబట్టి పాఠ్యగ్రంథములు దగ్గఱ నున్నను బరీక్షలో నడిగిన ప్రశ్నలకుఁ బూర్ణమగు నుత్తరములు వ్రాయుటకు విద్యార్థి తాను స్వతంత్రముగ నాలోచన చేయవలసిన యవసర ముండవలయును. విద్యావిధానమునఁ బరీక్షలే లేకుండిన బాగుండెడిది. కాని ప్రస్తుత పరిస్థితులలో నది సాధ్యమగున ట్లగపడదు. బాలుర విద్యాభివృద్ధిని విలువ కట్టుటకై పరీక్ష లంత మంచి సాధనములు కాకపోయినను మనము వానిని వాడుకొనవలసి యున్నది.

<u>వివిధ పరీక్షలు:</u>— పరీక్షలు మౌఖికపరీక్ష, వ్రాతపరీక్ష యని రెండు భాగములు చేయవచ్చును. మౌఖికపరీక్షలలోఁ బరీక్షకుడు విద్యార్థిని కొన్ని ప్రశ్నలడుగఁగా నతఁడు వానికి దగిన సమాధానములను నోటఁ జెప్పవలసి యుండును. మౌఖిక పరీక్షల యందు విద్యార్థి తనకు తెలియని ప్రశ్నలను గూర్చి బరీక్షకునితో మాటలాడి చెప్పించుకొనుట కవకాశమున్నది. వ్రాత దోషములు కలుగునను భయములేక విద్యార్థి ప్రశ్నల కుత్తరములను నిబ్బరముగఁ జెప్పవచ్చును. కాని బాలురసంఖ్య ఎక్కువైనప్పుడీ పరీక్షలు జరుపుటకు జాల కాలము పట్టును. ఇవి బాలుర వాక్శక్తిని మాత్రమే బరీక్షించును. వారి వ్రాతశక్తిని బరీక్షించుట కవకాశ మిందులో లేదు. ఇదిగాక ప్రశ్నలకుఁ దగిన సమాధానముల నాలోచించుకొనుటకుఁ గూడ విద్యార్థికిఁ గావలసినంత కాల ముండదు. పరీక్షకునివలన బాలునికి భీతియేర్పడి తారుమారుగ నుత్తరము లిచ్చుట గూడఁ తటస్థింప వచ్చును.

వ్రాతపరీక్షలు మూఁడు విధములు. అవి యేవన: తరగతి పరీక్షలు, బడిపరీక్షలు, ప్రభుత్వపు పరీక్షలు అనునవి. తరగతి పరీక్షల నుపాధ్యాయుఁడు తరగతిగదిలో జరుపును. ఈ పరీక్షలలో దొందర

యుండదు. ఉపాధ్యాయు డడుగు ప్రశ్నలు సరియైనవైనయెడల నీ పరీక్షలవలన బాలునిశక్తి సామర్థ్యములను బాగుగఁ గనిపెట్టవచ్చును. బడిపరీక్షలు ప్రధానోపాధ్యాయులు తమతమ తరగతుల బాలురను గాక యితర తరగతుల బాలురను బరీక్షింతురు. ఈ పరీక్షలలో బాలురు సంపాదించు మార్కులనుబట్టి వారిని పైతరగతులకుఁ బంపుదురు. కనుక బాలురు వీనిలో నెగ్గుటకు మిగుల ప్రయాసపడుచుందురు.

ప్రభుత్వపు పరీక్షలు:—వీని ప్రాధాన్యమునకు మేర లేకున్నది. వీనిలోఁ గృతార్థులయిననే గాని మంచి ఉద్యోగములు లభింపవు. అందుచేత విద్యార్థు లెట్లయిన వీనియందు నెగ్గవలయునని నిద్రాహారముల నాశింపక రాత్రింబగళ్ళు చదువుచు, గ్రంథములను కంఠస్థముచేయుచుఁ దమ యారోగ్యమును నయితము పాడుచేసికొనుచు నుందురు. ఈ పరీక్షలు పాఠశాలలోని యితరపరీక్షలకాదర్శమగుటచే విద్యోద్దేశములకే భంగము కలుగుచున్నది. ప్రాథమిక పాఠశాలలలోని పరీక్షలను డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారు జరిపి వానియం దుత్తీర్ణులైనవారికి సర్టిఫికేటుల నిచ్చెదరు.

పరీక్షా ప్రశ్నములు:—పరీక్షలవలన గలుగుహానిని దొలగించి బాలురకు వానివలన లాభము కలిగింపవలయునన్న, నా పరీక్షలలో నడుగు ప్రశ్నలు సరియైనవై యుండవలయును. ప్రశ్నలు కేవలము బాలురజ్ఞాపకశక్తిని బరీక్షించునవై యుండరాదు. బాలురు తమ యాలోచనాశక్తిని వినియోగించునట్లు చేయునవిగ నుండవలయును. పాఠములోని యప్రధానవిషయముపైని ప్రశ్నల నడుగరాదు. ప్రశ్నలు బాలుర తెలివితేటలను బరీక్షించునవిగ నుండవలయును. సంవత్సరము పొడుగునను జదివిన పాఠములన్నిటిలోను ప్రశ్నలుండవలయునేగాని యేదోయొక భాగముమీఁద నేమాత్ర ముండరాదు. ప్రశ్నలు కచ్చితమైన సమాధానములను గోరునవిగ నుండవలయును. సులువుగ బాలుర కర్థమగు మాటలలో నుండవలయును.

ప్రశ్నలు జాగ్రత్తగ సిద్ధము చేయఁబడినవై యుపాధ్యాయులచేతనే, అనగా, నా పాఠములను బాలురకు నేర్పుటయం దనుభవము గలవారిచేతనే యడుగఁ బడవలయును. పాఠములను నేర్పినవారు

సామాన్యముగ నాయా పాఠములలో బాలురకుఁగల చిక్కులను గూర్చిన యనుభవము గలవారై తగిన ప్రశ్నల నడుగఁగలరు పరీక్ష లనేకము లుండరాదు. కనుక ప్రాథమిక పాఠశాలలలో సాధారణముగ సంవత్సరమునకు ఒక్క పర్యాయము డిప్యూటి ఇన్‌స్పెక్టరు వచ్చి నపుడు పరీక్షలు జరుగుచున్నవి.

ఇందుకు ప్రతి సంవత్సరము కనీసము రెండు పరీక్షలైన నుండుట యుచితముగ నుండునని చెప్పఁగలము. వానిలో నొకటి దసరా సెలవులకు ముందుగను రెండవది క్రిస్మస్ సెలవులకు ముందు గను నుండవచ్చును. ఈ పరీక్షలు బాలుర తెలివితేటల యభివృద్ధిని బరీక్షించుటకేగాక సాంవత్సరిక పరీక్ష కుపస్థితులు కాఁజాలని బాలు రను పైతరగతులకు బంపు విషయమునకును పనికివచ్చును.

పరీక్షలలో బాలురుచేసిన తప్పులు దిద్దుట:—బాలురు నేర్చికొన్న విషయములను జ్ఞాపకముంచుకొని యున్నారా, విషయములను వారెంతవరకు గ్రహించినారో యని తెలిసికొనుటకును పరీక్షలు వారికిఁ జక్కని యవకాశములు నొసంగును. కాని బాలురు పరీక్షలు వ్రాసి ముగించిన పిదప నుపాధ్యాయులు వారు వ్రాసిన సమాధానములను జాగ్రత్తగఁ జదివి, తప్పులను దిద్ది సమాధానములకు మార్కుల నియ్యవలయును. ఆ దిద్దినపుడు బాలురు చేసిన తప్పులను ప్రత్యేకముగ వ్రాసి యుంచుకొని వానిని కొన్ని భాగములుగ విభజించి ఆయా బాలు రాయా తప్పుల నెందులకు జేసిరో యని కారణములను వెదకవలయును. పిదప నా తప్పులను సూచించి తరగతిలో బాలురకుఁ జెప్పి తప్పులను బాలురు గ్రహించునట్లు చేయవలయును. పరీక్షలోని ప్రశ్నములలో నొక్కొక్కదాని కెట్టి యుత్తరమును వ్రాయవలయునో యుపాధ్యాయుఁడు బాలురకు విశదముగఁ జెప్పవలయును. ఇట్లు చెప్పినతరువాత బాలురు తమతమ వ్రాయు ప్రత్యుత్తరములలోని తప్పులను సవరణచేసికొని వానిని శుద్ధముగ వ్రాసి యుపాధ్యాయునకుఁ జూపవలయును. ఈవిధముగఁ జేసినచో బాలురకుఁ బరీక్షల మూలమున నెక్కువలాభము కలుగఁగలదు. అంతియుగాక యుపాధ్యాయుఁడు పైతము బాలురు చేసిన తప్పుల నెఱిఁగి

యుండుటచేత నప్పటినుండి తరగతియందు నేర్పు పాఠముల మూలమున బాలురంతకు మునుపు అలవాటుపడిన తప్పులను నుడులఁ జేయకుండఁ జూచుటకుఁ బ్రయాస పడవలయును.

### ప్రశ్నలు

(1) పాఠశాలలోఁ బరీక్షల యవసరములు తెలుపుము.

(2) పరీక్షలలోనగు ప్రశ్నముల కుండవలసిన లక్షణములలో మూఁడింటిని పేర్కొనుము.

(3) "మొక్కలు పెరుగుటకుఁ గావలసినవస్తువులు" అను పాఠముమీఁద మొదటి మూఁడు తరగతులలో నొక్కొక్కదానికి నీవు వేయఁగల యాఱేసి ప్రశ్నలను వ్రాయుము.

(4) మౌఖిక, వ్రాఁత పరీక్షలలో నొక్కొక్కదానియొక్క విలువనుగూర్చి వ్రాయుము.

(5) పరీక్షలను జరుపఁగూడదనిచో విద్యార్థుల తెలివిని యెట్లు తెలిసికొనఁగలవు?

## 8. ఇంటియొద్దఁ జదువవలసిన బడిపాఠములు:

## విద్యావిహారములు

బాలురు సామాన్యముగ దినమున కైదారు గంటలు పాఠశాలలోఁ జదువుకొనుచుందురు. విద్యాశాఖవారి చట్టము ననుసరించి ప్రతిదినము కనీసమయిదుగంటలయినను పాఠశాలలోఁ జదువు చెప్పఁబడవలయును. అట్లు కాని దినము సంపూర్ణ పాఠశాలాదినముగాఁ బరిగణింపఁబడదు. బాలురు దినమున కయిదుగంటల కాలము బడిలోఁ జదువుచు, వ్రాయుచు, నాలోచించుచుండినయెడల బడి ముగియునప్పటికి వారలసటఁ జెందియుందురు. కనుక వారు దినమంతయు బడిలోఁ జేయుచుండిన యట్టిపనినే మరల నింటియొద్ద జేయు మనిన వారికిష్ట ముండదు. అట్టి పనిని వారు నిర్బంధముగ జేయవలసినపుడు వారికి బడిపనిలోఁగల యుల్లాస మంతరించి విసుగు పుట్టగలదు. బడిపని బండచాకిరిగా నేర్పడుటకు బాలుర కాలము వ్యర్థమగును. దినమంతయు బడిలోఁ జదివి, బడి విడిచినతోడనే పరు

గ త్రిపోయి నేమి యాటలోనో యుల్లాసముగ నాడుకొనవలసిన బాలుని కింటికిఁ బోవుటతోడనే మరలఁ జదువుటయే పనియైనచో నాడుకొనుట కవకాశము కలుగకుండును. కాఁబట్టి బడిలో, జేసినట్టి పనినే యింటియొద్దఁగూడ బాలురచేఁ జేయించుట యంత మంచి పద్ధతి కాదు.

ఇంటిపనియొక్క యుద్దేశము:—బడిలో నేర్పిన క్రొత్త పాఠము బాలుర మనస్సులో స్థిరముగ నాటుకొనఁ జేయవలయు ననియు ఇంటిలో నున్నపుడు విద్యావ్యాసంగ మేమియు లేక పోయినచో బాలుఁడాటలు మఱిగి కాలము వ్యర్థపుచ్చుననియు నట్టి యలవాటు పట్టుబడకుండఁ జేయుటకై యుపాధ్యాయుఁడు బాలుర కింటియొద్దఁ జదువుకొని వచ్చుటకు పాఠముల నిచ్చును. బడిలో నుపాధ్యాయుడు చేయు బోధనవలనఁ జెప్పిన పాఠములు బాలుని మనసు పట్టవలయునే గాని యింటియొద్దఁగూడ బండపట్టుగఁ జదువుట వలనఁ గాదనియు, అట్టి కృషివలన బాలుర యారోగ్యము చెడిపోవు ననియు, బాలురు కాలమును వ్యర్థపుచ్చకుండఁ జేయుట కితర మార్గములను జూడవలయు ననియుఁ గొందఱు బాలుర కింటి పాఠముల నియ్యఁగూడ దనువారు వాదింతురు.

బాలుర కియ్యఁదగు నింటిపని:—ఇంటియొద్దఁ జేసికొనివచ్చుటకు బాలుర కేపనియు నియ్యకుండిన వారు కాలమును వ్యర్థపుచ్చుదురనుట కేలాటి సందియమును లేదు. కనుక వారింటియొద్ద కాలమును సద్వినియోగము చేయునట్లు వారి కుపాధ్యాయులు తగిన పనులను సూచింపవలయును. కాని యా సూచించుపని బాలుర బడిలోఁ జేసినట్టి పనిగాక దానికి భిన్నమై యుండవలయును. బడిలో బాలురు నేర్చుకొన్న విషయములకు సంబంధించినదిగను సందలి కొఱఁతలను బూరించునదిగను నుండవలయును. బడిలో బాలురు చంద్రగుప్త మౌర్యుని గూర్చి చరిత్ర పాఠములోఁ జదువుచున్నారను కొందము. అప్పు డింటియొద్దఁ జాణక్యుని గూర్చిన కథలు చదువునట్లు చేయవలయును. అట్లు చేయుటవలన బడిలో చదివిన చంద్రగుప్తుని చరిత్రము సుబోధము కాఁగలదు. అప్పుడు

వాగు తెలిసికొనవలసిన చంద్రగుప్తుని రాజ్యపద్ధతులు బోధపడుటయే గాక వారి మనసుల కుల్లాసము గలుగును. రైలును గూర్చిగాని, రైలు ప్రయాణమును గూర్చిగాని చదువుచున్న యెడల రైలు స్టేషనునకు బోయి యచ్చట రైలుబండిని, ఇంజనులను జూచుట చక్కని ఇంటిపని యగును. ముద్రాణాయంత్రములను గూర్చి చదువు నపుడు గ్రామములోని ముద్రాణాలయమునకుఁ బోయి యచ్చటఁ బని చేయు ముద్రణాయంత్రమును దర్శించుట యా పాఠమునకు దోహదము. విత్తనములు మొలకలెత్తుటను గూర్చిన పాఠమునకు బాలురు సొంతముగ విత్తనములను మొలిపించుటయు, బజారు వెచ్చమును గూర్చిన లెక్కలు బడిలో నేర్పునపుడొక యంగడికిఁ బోయి యచ్చట జరుగు వ్యాపారము శ్రద్ధగ గమనించుటయుఁ జక్కని యింటిపను లగును. ఇట్లు యుపాధ్యాయుఁడు ప్రతి పాఠమునందును బాలుర కియ్యదగు నింటిపని నేర్పరచుకొనవలయును.

బాలుఁ డింటియొద్దఁ జేయవలసినపని, వాఁడు సొంతముగఁ గష్టపడి చేయవలసిన పనిగా నుండవలయును. పక్షులనుగూర్చి బడిలో నేర్చుకొనుచున్నయెడల నింటియొద్ద బాలురు పక్షుల యీకలు, గుడ్లు, పాతఁగూళ్ళు మున్నగునవి సేకరించుటయు, పక్షులను గమనించి వాని యభ్యాసములను దెలిసికొనుటయు మంచి యింటిపని కాఁగలదు. మఱియు నింటిపని బాలుఁడు తన విరామకాలమున సయితము చేయుట కిష్టపడు పనిగ నుండుట మంచిది. ప్రాత తపాలా బిళ్ళలను ప్రోఁగుచేయుట, చిత్తరువులను వ్రాయుట, కీటకములు, మొక్కలు మున్నగువాని పరిశీలనము, పాఠములతో సంబంధపఱచి యింటిపనిగా నేర్పరుపవచ్చును. పాఠశాలలో మంచి పుస్తకభాండాగార మున్నయెడల నందలి గ్రంథములను జదివి నిర్ణీతాంశములపై వ్యాసములు వ్రాయునట్లేర్పఱచి యా వ్యాసములను దిద్ది జ్ఞానోపార్జనమునకును, చక్కని రచనకును బాలురను బ్రోత్సహింపవచ్చును. సాధ్యమైనంత మట్టునకు నింటియొద్దఁ జదువు పాఠములు, చేయుపని—వీనిమూలమున బాలురలో సొంతముగఁ గృషి చేయు గుణము వారి కలవడ వలయును.

పైని వివరించిన పనులలోఁ గొన్ని గ్రామపాఠశాలలోఁ జదువు బాలుడు చేయుట కనువైనవిగ నుండకపోవచ్చును. కావున ప్రాథమిక పాఠశాలలోఁ బనిచేయు ప్రతి యుపాధ్యాయుఁడును దాను నేర్పుపాఠము గ్రామపరిస్థితులు ననుసరించి బాలు రింటి యొద్దఁ జేయఁగల పనులెవ్వి యని యాలోచించి నిర్ణయించుకొన వలయును. సంవత్సరారంభమునఁ బాఠములకుఁ బోధనాక్రమ పట్టికలు సిద్ధపఱచుకొననప్పుడే యీ పనులను సైతము ఆలోచించుకొని ఏర్పఱచుకొన్నచో బాలురకు విసుగుపుట్టించు నింటిపనుల నిచ్చు నవసర మేర్పడదు. ప్రాథమిక పాఠశాలలోని ప్రధానోపాధ్యాయుఁ డీ విషయమున శ్రద్ధబూని ప్రతియుపాధ్యాయునితోడను నాతని తరగతి బాలుర కియ్యఁదగు నింటిపను నుగూర్చి చర్చించి వారికిఁ దగు సలహా లొసఁగవలయును.

విద్యా విహారములు:— పాఠశాలలో పుస్తకములను జదివియు, గురువులు బోధించు పాఠములు వినియు మాత్రమేగాక మఱికొన్ని విధముల సయితము విద్య నభ్యసింపవచ్చునని వెనుకఁ జెప్పితిమి. ప్రకృతిని పరిశీలించుట, దేశాటనము చేయుట మొదలగు నవి యట్టి విధములలో జేరియున్నవి. విద్యావిహారములు సైత మిట్టివె కాని, దేశయాత్రలకును, విద్యావిహారములకును గొన్ని భేదములు కలవు. విద్యావిహార మనఁగా బాఠశాలలో నేర్చుకొన్న పాఠము మఱింత విశదముగఁ దెలియునట్లొక సంస్థనుగాని, ప్రకృతిలో నొక భాగముగాని జూచుటకును, గమనించుటకును, బరిశీలించుటకును జేయు యాత్ర. దేశయాత్ర చేయునపు డుపాధ్యాయునివంటి గురువొకఁడు వెంటనుండడు. విద్యావిహారమునం దుపాధ్యాయుఁడు బాలుర నంటియుండి వారిని నడిపించును. బడిలో నుపాధ్యాయుడు పాఠములను బోధించునపుడు బాలురు తాము చూడని వస్తువుల నెన్నిటినో యూహించుకొనుచుండవలసి యుండును. కొన్నికొన్ని వస్తువుల పటములను జూపియు, బలువిధముల వర్ణించియు చెప్పినను నవి యంత విశదముగ బాలుర మనస్సునకుఁ బట్టకుండును. సముద్రముయొక్క పటములను జూపవచ్చును. దానిని జక్కఁగ వర్ణించి

చెప్పవచ్చును. కాని, సముద్రమును జూచువఱకు నెవ్వనికిఁగాని దాని గూర్చిన సరియైన యభిప్రాయము మనస్సులో గలుగదు. అట్లే మంచుగడ్డ, జలపాతము, అడవి మొదలగు ప్రకృతి విషయములుగాని, ఓడరేవు, ముద్రణాయంత్రము, చలనచిత్రము మున్నగు కృత్రిమ విషయములుగాని కన్నులారా జూచిననేగాని యెవరికిని విశదముగఁ దెలియఁబడవు. కాఁబట్టి విద్యావిహారములు పాఠశాలలోని విద్యాబోధన కత్యంత సహకారములుగా నుండుచున్నవి.

వివిధ విద్యావిహారములు:—బడిలో నుపాధ్యాయుఁడు ఆవు, బఱ్ఱె, గుఱ్ఱము మున్నగు జంతువులలో నొకదానినిగూర్చి నేర్పునపుడు తన తరగతి బాలుర నందఱిని బడినుండి యాజంతు వున్న చోటికిఁ దీసికొనిపోయి, దాని వివిధావయవములను గుఱించి బాలురకు బోధించును. ఇది మిక్కిలి యల్పమగు విద్యావిహారము. ఒక్కొక్కప్పుడు బాలురందఱు నుపాధ్యాయునితోఁ గలసి, యుదయమే బయలుదేఱి పోయి సాయంతనము వఱకు నానావిధ వినోదములను, నూతన వస్తువులను జూచుచుఁ గ్రొత్తసంగతులను నేర్చుకొనుచుఁ గాలము గడుపుదురు. ఇదియును విద్యావిహారమే. వేఱొకప్పుడు పాఠశాలకు దూరములోనున్న చరిత్రాత్మకమైన స్థలమునుగాని ప్రకృతి చిత్రములనుగాని జూచుటకుఁ గొన్ని దినముల ప్రయాణములతోఁ గూడిన విద్యావిహారములకుఁ బోవుటయు గలదు. ఇట్టి విహారములకు మిగుల జాగ్రత్తగ సిద్ధపడవలయును. ప్రయాణము చేయు గంటలు, నిలుచు స్థలములు, యాత్రాస్థలములోని వసతులు, భోజనము, స్నానము మున్నగు విషయముల నన్నిటినిగూర్చి తగిన కాలమున నేర్పాట్లు చేసికొని బాలుర తల్లిదండ్రుల యనుమతిపైననే బాలుర నట్టి విహారములకుఁ గొనిపోవలయును.

విద్యావిహారములకుఁ బోవుట; బడిలోఁ జేయవలసినపని:—ప్రతి విద్యావిహారమునకును కొన్ని యుద్దేశము లుండవలయును. ఆ యుద్దేశము లేవైనవియుఁ బడిలో నుపాధ్యాయుఁడు బాలురకు విశదముగఁ జెప్పవలయును. విహారస్థలము దేనిని గమనించవలయును? దేనిని బరిశీలింపవలయును? అనువిషయములు ప్రతిబాలునకుఁ

బడిలోఁ జక్కఁగఁ దెలిసికొనవలయును. అట్లు చేయనిచో బాలురు విహారస్థలమునకు బోయినప్పుడు దేనిని గమనించి పరిశీలించవలయునో యెఱుఁగక యా విహారము వలన బొందవలసిన మానసికానందమును పొందకయే మరలి రానగును. ఒక్కొక్కప్పుడు బడిలో నుపాధ్యాయుఁడు కొన్ని ప్రశ్నలిచ్చి వానికి ప్రత్యుత్తరములను విహారస్థలములో వ్రాసికొని రావలయునని యేర్పరుపవచ్చును. విహారమునకుఁ బోవునపుడు ప్రతి బాలుఁడును కాగితము, పెన్సిలును వెంటఁ దీసికొని పోవలయును.

విహారస్థలములోఁ జేయవలసిన పని:— విహారస్థలము జేరగనే బాలురు ఉపాధ్యాయుని యాజ్ఞల ననుసరించియే తమ తమ పనులు నిర్వర్తించుటకుఁ బోవలయును. చరిత్రాత్మకమైన స్థలమునకు బోయినపు డచ్చటి కట్టడములను, శిథిలములను, శిల్పచాతుర్యములను, పురాతన వస్తువులను గమనించి చరిత్రలోఁ జదివిన సంగతులకును, అచ్చటఁ బ్రత్యక్షముగ నగపడు వానికిని గల పోలికలను గమనింపవలయును. భూగోళపాఠమునకు సంబంధించిన విషయములను నేర్చుకొను నుద్దేశముతోఁ బోయియుండిన నా స్థలమందలి కొండలు, నదులు, ఊటలు, అడవిలోని పలువిధములైన చెట్లు, పొదలు వీనిలో నొక్కొక్కదానిని గమనించి యేయే సంగతులు నేర్చుకొనవలసియున్నదో వానిని వ్రాసి యుంచుకొనవలయును. ఒకవేళ ఆకులు, పువ్వులు, చెట్ల బెరడులు, రాళ్ళు, గవ్వలు, విత్తనములు మున్నగునవి ప్రోగుచేసుకొనవలసియున్నచో నాపని చేయవలయును. అవసరమని తోఁచిన చిత్తుపటములుగూడ నచ్చటనే వ్రాసికొనవలయును. పక్షులు వాని యీఁకలు, రంగులు, గూళ్ళు, గ్రుడ్లు మున్నగువానిని గమనించుట కవకాశ మున్నంతవరకు నట్టి పనులను జేయవలయును. వస్తుప్రదర్శనశాలలో నుంచదగు వింతవస్తువులు దొరకినయెడల వానిని భద్రముగఁ దీసికొని బడికి దేవలయును.

విహారమునకు బిమ్మటి కృత్యము:— విహారమునుండి వచ్చిన పిదప చేయుపని చాల ముఖ్యమైనది. విహారమున కేయుద్దేశములతో బోయిరో, యా యుద్దేశము లెంతవరకు సఫలములాయెనో బడిలో

బాలురను ప్రశ్నించి యుపాధ్యాయుఁడు తెలిసికొనవలయును ఈ పనికై బాలురు విహారస్థలమున నేయే విషయములను గమనించి యున్నారో వానిని తెలిసికొని చర్చించు, వానినుండి తేలినసామాన్య సూత్రములను తెలిసికొనవలయును.

విహారజ్ఞానమున వెనుకఁబడియున్న బాలురు కూడఁ గొంద ఉందురు. అట్టివా రేయే విషయములను జక్కఁగ గమనించి యుండ లేదో వారు చెప్పెడి సమాధానములను బట్టి తెలిసికొని యా లోపములను సరిచేయవలయును.

విద్యావిహారముల వలని ప్రయోజనములు:—బడిలో నుపాధ్యాయుఁ డెంత నేర్పుతో బోధించినను తెలియరాని విషయములను విహారస్థలమున బాలురతిసులభముగ గ్రహింతురు. ప్రకృతిలోని భాగములను, చిత్రములను గమనించుటకును, పరిశీలించుటకును బడిలోని యవకాశములు బాలురకు విహారములో లభించుటచే వారు వస్తువులను స్వంతముగఁ బరిశీలించి క్రొత్త సంగతులను నేర్చుకొనఁ గలరు. వారి పరిశీలనశక్తియు, హేతువాదశక్తియు బాగుగ వృద్ధి పొందును. బడిలో భయముచేత నేమి, మఱొక కారణముచేత నేమి, యుపాధ్యాయుని తమ సందేహములను గుఱించి యడుగఁ జాలని బాలురుకూడ విహారములయందు జనవుగా నుపాధ్యాయుని నడిగి తెలిసికొనుటకు ధైర్యము వహింతురు. బడిలోని వస్తుప్రదర్శన శాలకు వింతవస్తువులను కూర్చుటకు బాలురకు జక్కని తరుణము లభించును. బడిలో బాలురు గ్రహింపలేని విషయముల నిప్పుడు వారు సులువుగ గ్రహింపగలుగుట వలన నుపాధ్యాయునికి శ్రమ తగ్గును. ప్రకృతిలో నుండు చిత్రములను బాలురకుఁ జూపి, వారి యొక్క పరిశీలన గుణమును వృద్ధిచేయుట కుపాధ్యాయునికి మంచి తరుణము విహారముల మూలమున లభించును. పాఠశాలలోఁగాక వేఱొక స్థలమునం దుండినపుడు బాలురు తమ సహజ ప్రవర్తనమును ప్రకటింతురు. అట్టితరి వారి నైజగుణమును గమనించుటకు విహారము లుపాధ్యాయుని కమూల్యావకాశముల నిచ్చుచున్నవి. ఇంతియగాక యీ విద్యావిహారము లుపాధ్యాయునికిని, బాలురకును

మధ్య స్నేహభావమును కల్పించుటకు మంచి యవకాశము నిచ్చుచున్నవి.

విద్యావిహారము లింత ప్రయోజనకరము లగుటవలన ప్రాథమిక పాఠశాలలోని బాలురను దఱచుగా విద్యావిహారములకుఁ దీసికొని వెళ్ళుట కేర్పాట్లు చేయవలయును.

### ప్రశ్నలు

(1) బాలు రింటియొద్ద పాఠములను జదువవలసి నట్లుపాధ్యాయు లేల యేర్పఱతురు?

(2) ఇంటియొద్ద బాలురు చదువవలసిన పాఠముల యుద్దేశమేమై యుండవలయును? భూగోళము, ప్రకృతిశాస్త్రము, సివిక్సు—ఈ పాఠములను నాలుగవ తరగతికి నేర్పుటలో నీవు వారి కియ్యఁదగు నింటిపనులను దెలుపుము.

(3) విద్యాశాఖవారి పాఠముల నూతన ప్రణాళిక ననుసరించి మూడవ తరగతి బాలుర కొక్కొక్క పాఠమునందు సంవత్సరము పొడుగునను నీ వేర్పఱుపగల యింటి పనుల పట్టిక సిద్ధము చేయుము.

(4) విద్యావిహారములవలని ప్రయోజనములను వివరించుము.

(5) అడవి, నది, [illegible], రైల్వేస్టేషను—వీనిలో నొక్కొక్కదానికి బాలురను విహారమునకుఁ గొనిపోవునపుడు నీ వెట్లు సిద్ధపడుదువో వ్రాయుము.

(6) పాఠశాలలోని వస్తుప్రదర్శనశాలలో నుంచుటకు కేయే వస్తువులను విహారస్థలమున బాలురు ప్రోగుచేయునట్లు ప్రోత్సహింతువో వ్రాయుము. ఇరువది వస్తువులకుఁ దక్కువగాకుండ పట్టికను సిద్ధము చేయుము.

(7) ప్రాథమిక పాఠశాలలోని మొదటి మూఁడు తరగతుల విద్యార్థులతో సంవత్సరములోఁ బోఁదగిన విద్యావిహారముల పట్టికను సిద్ధము చేయుము.

## 9. పాఠముల ప్రణాళికలో లేని పనులు

పాఠక్రమపట్టికలో లేని పనుల ప్రాధాన్యము:— పాఠముల ప్రణాళికలోఁ జూపిన పాఠములనే బాలురకు నేర్పి దానితో దృప్తి పడుచుండు నుపాధ్యాయులును, ప్రణాళికలో లేని పనులను బాలు

రచే జేయించుట కాలమును వ్యర్థపుచ్చుట యనుకొను నుపాధ్యాయులును లేకపోలేరు. కాని యట్టి యభిప్రాయము సరికాదు ఏల యన: ప్రతి బాలునిలో నున్న శక్తుల నన్నింటిని వృద్ధిపొందించుటకు గావలసిన యవకాశములను బడిలో గలుగజేయుటకు సాధ్యముకాదు. ఒక్కొక్క బాలుని పాఠమునందుగాని, లేక పని యందుగాని యితరులకు లేని యభిరుచి యుండవచ్చును. అట్టి బాలు డా పాఠమునుగాని, యా పనినిగాని దరగతిలో నేర్పునంత కంటె నెక్కువ ముందుకు పోజూచును. కాని అట్లు చేయుటకు బడిలో నవకాశముండదు. కనుక నా బాలుడు తన కుతూహలమును బడి లేనికాలమున దాను విరామముగా నున్నపుడు తీర్చికొనవలసి యుండును. ఎట్లన, ఒక బాలునికి జిత్రలేఖనమునం దభిరుచి మెండుగ గలదు. అతడు తన తరగతిలోని తోడిబాలుకు వ్రాయు చిత్రముల నవలీలగ వ్రాసి యింకను నేర్చుకొనదగినవానికై ముందు నకు బోవ సిద్ధముగనుండును. అట్టితరుణమున బడిలోని వ్యాసంగము తోనే సరిపుచ్చుపక్షమున నాబాలునికి ... ... వృద్ధి గాన్పింపదు. కావున నట్టి బాలునికి రంగులతో జిత్రరువులను వ్రాయు శక్తి త్వరితముగ బట్టుపడునని గ్రహించి యుపాధ్యాయుడు చిత్రలేఖనములోని కఠినవిషయముల నతనికి బోధించి యింటియొద్ద నాపాఠము నతడు నేర్చుకొనునట్లు ప్రోత్సహించి సాహాయ్యము చేయవలసి యుండును; మఱియు బంకమట్టితో బొమ్మలను జేయుటయం దొక బాలుడు ప్రజ్ఞ నగుపఱచినయెడల నట్టి బాలుడు 'ప్లాస్టిసీను' (ఒక విధమగు బంకమన్ను) మొదలగు పదార్థములతో నింటియొద్ద విరామకాలమున బొమ్మలను చేయునట్లుగా బ్రోత్సహించి సాయము చేయుట యుచితము.

గతకాలములో బ్రాథమిక పాఠశాలలోని యుపాధ్యాయులు బాలురచే బ్రణాళికలో లేని కొన్ని పనుల చేయించుచుండిరి. ఆ పనులవలన బాలురలోని శక్తిసామర్థ్యములు వృద్ధిచేయవలయునను నుద్దేశముకంటె, దమ పాఠశాలను దర్శింపవచ్చెడి ప్రేక్షకుల మెప్పు వడయుటయే ప్రధానముగ వారెంచుకొనుచుండిరి.

కాని పాఠప్రణాళికలో లేని తక్కుంగల పనులను నేర్పవలసిన విధానము బాలురలో గుప్తముగనుండు వ్యక్తిత్వమును వెలువరించి యభివృద్ధి నొందించుటకేయని గుర్తింపవలయును. ఇట్టి పనులను నేర్చుకొన్న బాలురు తమ విరామకాలమును సద్వినియోగము చేసికొనుటయే గాక వారు పెరిగి పెద్దవారైనపుడుగూడ విరామకాలమును బాడుచేసికొనక జీవితాంతమువఱకుఁ బ్రయోజనకరములగు పనులనే చేసికొనుట కభ్యాసపడియుందురు. కావున బాలురను సుశిక్షితులను జేయు నుపాధ్యాయులుఁ బ్రతిబాలునిలోను గల నిర్మాణశక్తుల నా బాలుడు తగిన విధము వినియోగించుటకు గావలసిన శిక్షణమును పాఠశాలలోనే యియ్యవలయును.

హాబీలు:—ఒక మనుష్యుఁడు తన విరామకాలమునం దభిరుచితోఁ జేయు పని యతని 'హాబీ' (Hobby), హాబీ యొక వృత్తి కాదు. సాధారణముగ వృత్తికి సంబంధించని పనియై యుండును. కాని, యొక వ్యక్తికా పనియందుఁ గల యభిరుచిచేతనే కొంచెము విరామము దొరకినను దన కాలమును నాహాబీలో వినియోగించును. ధనార్జనము హాబీయొక్క యుద్దేశము కాదు. మనస్సులోని యభిరుచికిఁ దృప్తికలిగించి సంతసించుటయే హాబీయొక్క ప్రధానోద్దేశము హాబీలు, చిన్న పెద్ద యని భేదము లేక యందఱకు నుండవచ్చును. మన దేశమున జనులు పేదలగుటచే వేకువ లేచినది మొదలు రాత్రి పరుండువఱకును జీవనము సంపాదించుకొనుటకుఁ బ్రాకులాడుచుందురు. తన్మూలమున వారికి విరామ మనునది యుండదు. ఇందువలనను, విద్యాలోపము వలనను మనదేశమునఁ బ్రజలకు హాబీలు లేవు. కాని పాశ్చాత్యదేశములలో సామాన్యముగ ప్రతివారికిని నేదో యొకహాబీగాని యంతకంటె నెక్కువగానిహాబీ లుండును.

హాబీలవలన ప్రయోజనములు:— పాఠశాలలోని వేర్వేరు బాలురకు వేర్వేరు శక్తులుండుననియు, వానినెల్లను బడిలో నెక్కువగ వృద్ధిపొందించుటకు సాధ్యము కాదనియుఁ జెప్పితిమి. కావున నొక్కొక్క బాలునిలోని ప్రత్యేక వ్యక్తిత్వమును వృద్ధిజేయుటకును వాని యభిరుచులను దిన్నని మార్గములలో నడిపించుటకును,

బాలునివిద్యకు విశాలమగు పునాదులను కల్పించుటకును, హాబీలు మిగుల దోడ్పడును. హాబీల నలవరచుకొన్న బాలుఁడు తన విరామ కాలమును సద్వినియోగముచేయును. విరామముకలిగినప్పు డేమిచేయ వలయునో దెలియని బాలురు కలరు. అట్టిబాలురు 'సోమరి మనస్సున దుష్టతలంపుల పుట్టు' ననుసామెతచొప్పున నేదియో యొక తగని పనికిఁ బూని చిక్కుల పాలగుచుందురు. హాబీలుగల బాలురు తమ విరామకాలమున హాబీలలో నిమగ్నులై యుండుటచేతఁ గొంటెపనులు చేయుటకు వారికి సమయ ముండదు. హాబీల మూలమున వారి మనస్సుల కానందము కలుగును. బాలురయందు శక్తి కేవలము బడిపనికి కావలసినంతే యుండుననరాదు. అంతకంటె నెక్కువశక్తియే వారికి సామాన్యముగ నుండును. ఈశక్తిని వారు తప్పక వినియోగింపవలయును. దానిని సద్వినియోగము చేయుటకు హాబీలు వారి కవకాశములను గల్పించును. బాలురలో నుండు నిర్మాణశక్తిని సయితము వినియోగించి యేవో కొన్ని వస్తువులను నిర్మించుటకు హాబీలు బాలురకుఁ దోడ్పడును. పాఠశాలలో నేర్చుకొన్న పాఠములను గాని, వానికి సంబంధించిన యితర విషయములనుగాని గ్రంథపఠన మూలమున నేర్చుకొని, తమ జ్ఞానమును వృద్ధి చేసికొనుటకు హాబీలు మిక్కిలి తోడ్పడును. ధనార్జనము హాబీల యుద్దేశ్యము కాకపోయినను హాబీల మూలమున సిద్ధముచేసిన వస్తువుల నమ్మి ధనము సయితము సంపాదింప నవకాశము లున్నవి.

నానావిధములగు హాబీలు.—పాఠశాలలోని బాలురు హాబీలుగా నేర్పరచుకొనఁగల పను లనేకములు గలవు. ఉపాధ్యాయులు బాలుర యభిరుచులను గనిపెట్టి వారికి హాబీలను సూచింపవచ్చును.

కాని బాలున కొక పనిని జూపించి దానిని హాబీగాఁ జేసికొమ్మని యెవ్వరినిగాని నిర్బంధింపరాదు. హాబీలు నిర్బంధమువలన నేర్పడునవి గావు. అభిరుచులను బట్టి యవి బాలు రేర్పరచుకొనవలసినవి. బాలుర కందఱకును జిన్నవయస్సులో వస్తువులను బ్రోగుచేసి యుంచుకొనుటయం దాసక్తి మెండు. కనుక నానావిధ వస్తువులను బ్రోగుచేయుట కొందరకుఁ జక్కని హాబీగా నేర్పడగలదు.

పలురకములగు రంగుకాగితములు, అగ్గిపెట్టెలమీఁది పటములు, తపాలాబిళ్ళలు, నాణెములు, గుడ్డముక్కలు, గాజుముక్కలు, పీచులు దారములు, చర్మములు, ధాన్యములు, ఆకులు, పువ్వులు, విత్తనములు, చెట్ల బెరడులు, రాళ్ళు, గవ్వలు, ఇసుక, పక్షుల యీఁకెలు, గ్రుడ్లు, యివి యవి యననేల? — అన్నివిధములయిన వస్తువులను ప్రోగుచేసి యుంచుకొనవచ్చును.

పటముల పుస్తకములను సిద్ధము చేయుట మఱియొక మంచి హాబీ. గట్టిఅట్టలువేసి కుట్టిన మంచికాగితముల పుస్తకము నొక దానిని చేసి దానిలో నప్పుడప్పుడు సేకరించిన నానావిధ పటముల నంటించి యుంచుకొనవచ్చును. ఈపటములలోఁ గొన్నింటిని బాలురు తామే సొంతముగ వ్రాసినవై యుండవచ్చును; లేదా వార్తాపత్రికలు మున్నగు వానినుండి కత్తిరించినవైనను గావచ్చును. ఇట్టి పుస్తకములు కుటుంబమును గురించిన పటములు, బడిని గురించిన పటములు స్నేహితులను గుఱించినవి, నానావిధములుగ నుండవచ్చును.

చిత్తరువులను వ్రాయుటకూడ మంచి హాబీయే. స్వల్ప వ్యయముతోఁ జక్కని పటములను సిద్ధముచేసి యానందింపవచ్చును. స్నేహితుల కానందము గలిగింపవచ్చును. ప్రకృతిలోని జంతువులు, కీటకములు, మొక్కలు మున్నగు వాని పరిశీలనయుఁ జక్కని హాబీగా నుండగలదు. వ్యయమునకు ఓపుకొనగలిగినవారు ఛాయాపటములను సిద్ధముచేయుట యొక హాబీగా నేర్పరచుకొనవచ్చును.

చేతిపనులు నయితము బాలురకు హాబీలుగా నుండఁగలవు. ఉన్ని దారముతో బట్టలను నేయుట, త్రాళ్ళువేయుట, వలసంచులను సిద్ధముచేయుట, చాపలల్లుట, బుట్టలల్లుట, (ఫ్రెట్ వర్కు) ఒకవిధమగు వడ్రంగము, చినిగిన పుస్తకములను బైండుచేయుట మున్నగు పనులను హాబీలుగ నేర్పరచుకొన్న బాలురు తమ విరామకాలము నానందముగఁ గడుపగలుగుటయేగాక కొంత సొమ్మును నయితము సంపాదించుకొనవచ్చును.

పాఠశాలలలో హాబీలను ప్రోత్సహించు టెట్లు:—పాఠశాలలోని యేయే బాలు రేయే పనులయం దభిరుచి కలిగియున్నదియు

నుపాధ్యాయులు కనిపెట్టవలయును. బడిలోఁ బాఠములను జెప్పు నపుడు బాలు రేయే పనుల నింటికడ హాబీలుగాఁ జేయవచ్చునో యుపాధ్యాయుఁడు సూచింపుచుండవచ్చును. కాలనిర్ణయపట్టికలో వారమున కొక గంట హాబీలకని ప్రత్యేకపరచి యా గంటలో బాలురు తమ కిష్టమువచ్చిన పాఠములను చదువవచ్చును; లేదా పనులను చేయవచ్చునని యేర్పాటుచేసినయెడల శీఘ్రకాలముననే వారు తమ పనులమూలమున తమ యభిరుచులను దెలుపగలరు.

బాలభటోద్యమము:—బాలభటోద్యమము 1908 సంవత్సరములో శ్రీ బేడెన్‌పవెల్ ప్రభువుగారిచే స్థాపింపఁబడెను. దక్షిణాఫ్రికాలో జరిగిన బోయరుయుద్ధమున నీయన యొక సేనాధిపతిగా నుండి యాద్ధసమయమున బాలురు తుపాకులుపట్టి యుద్ధములు చేయజాలకపోయినను వారికిఁ దగిన శిక్షణమున్నచో వస్తువులకు గావలి యుండుట, ఉత్తరములను గొనిపోవుట మొదలగు పనులను నేర్పుతో నిర్వహించి పెద్దలకుఁ దోడ్పడఁగల రను సంగతి కనిపెట్టెను. కావున నాయుద్ధము ముగిసినపిమ్మట శ్రీ బేడెన్ పవెల్‌గా రింగ్లండున కేగి యచ్చటఁ బండ్రెండుమంది బాలురకుఁ బ్రథమమున నీభటశిక్షణము నిచ్చెను. శిక్షణము పొందిన బాలురకు దేహపటుత్వము, సత్ప్రవర్తనము, కార్యాచరణ కౌశలము మొదలగు సుగుణములు పట్టువడి ప్రజల నాకర్షింపఁగల్గుటచే నీ యుద్యమ మతిశీఘ్రముగ దేశదేశములకు వ్యాపించెను. దొరతనమువా రీ యుద్యమమును 1917 వ సంవత్సరములో మన దేశమున నారంభించిరి. పిదప 1921 వ సంవత్సరములో శ్రీ బేడెన్ పవెల్‌గారే మనదేశమున కరుదెంచి బాలభటోద్యమము నుస్థిరముగ నిచట నెలకొల్పిరి. ప్రస్తుత మీ యుద్యమము ప్రపంచమునం దంతటను వ్యాపించియున్నది. ఈయుద్యమమునకు నేటికిని శ్రీ బేడెన్ పవెల్‌గారే ప్రధాన నాయకులు.

బాలభటోద్యమముయొక్క యుద్దేశము మూఁడు. బాలురను చిన్నవయస్సుననే సంఘములుగ నేర్పరచి వారారోగ్యమునందును, బలమునందును వృద్ధిపొందునట్లు చేయుట మొదటిది,

అధికారుల శిక్షణము మూలమున సత్ ప్రవర్తన మలవరచుకొనుట రెండవది. రాజభక్తియు, దేశాభిమానమును గలిగి మానవసేవ చేయ నేర్చుకొనుట మూడవది.

బాలభటులసమాజమున మూఁడు శాఖలు గలవు. అవి యేవన: 1. తోడేలి కూనలు 2. బాలభటులు 3. రోవర్లు అనునవి. ఇందు 7 ఏండ్లనుండి 11 ఏండ్ల లోపల నున్న బాలురు తోడేలి కూనలనియు, 11 ఏండ్లు మొదలు 18 ఏండ్లువరకుఁగల బాలురు బాలభటులనియు, 18 ఏండ్లకు పైబడిన వారందరు రోవర్లనియు విభాగించిరి. ఈ మూఁడు శాఖలు యుద్దేశము లించుమించు సమానమే యైనను వారి వారి వయస్సునుబట్టి శిక్షణపద్ధతులు మాత్రమే భేదముగ నుండును. ఎట్లన తోడేలికూనల శిక్షణమున కథలు, ఆటలు, వేషములు, నాట్యములు —ఇవి ప్రధానములు బాలభటులకు శిబిరజీవితము, జాడలుతీయుట, కఠినములగు నాటలు మున్నగు వాని మూలమున శిక్షణము జరుగును. రోవరుకు శిబిరజీవితము, గ్రామసమస్యల నెదుర్కొనుటయే శిక్షణ మార్గములు.

ఈ యుద్యమము మూలమున మన దేశమునకు గొప్పలాభము చేకూరఁగలదని యాశించుట కవకాశము లున్నవి. కనుకనే ప్రభుత్వమువారీ యుద్యమమును పాఠశాలలలోఁ బ్రోత్సహించి కొంత ద్రవ్యసహాయ్యము సైత మీ యుద్యమమునకుఁ జేయుచున్నారు. బాలురకు లేత వయస్సునందే యారోగ్య మార్గములు బోధించి, యారుబైట దేహపరిశ్రమ మూలమున శరీరములను వృద్ధిపొందించుటకును, ఇతరాభ్యాసముల వలన మానసిక నైతిక శక్తులను వృద్ధి పొందించుటకును నీ యుద్యమము చాల యనుకూలము గనుక భావి కాలమున జనులు బాగుపడవచ్చును. దేశములో నున్న కుల మత భేదములను గొంతమట్టున కీ యుద్యమము తొలగించి దేశీయులలో నైక్యభావమును కలిగించును. బాలుర విరామకాలమును సద్వినియోగము చేయుటకుఁ దోడ్పడుటయె గాక బాలురను సత్పౌరులుగఁ జేయుట కీ యుద్యమ మెంతయు దోహద మొనగుచున్నది. కావున నీ యుద్యమము ప్రతి పాఠశాలలోను నుండదగి యున్నది.

బాలుర రెడ్ క్రాస్ సంఘము:—యూరపులోని స్విట్జర్లండు దేశస్థుఁ డగు హెన్రీజూయంట్ అనునతఁడు రెడ్ క్రాను సంఘమును 1864 లో స్థాపించెను. యుద్ధములలో గాయములు తగిలి బాధపడు వారికిఁ బరిచర్య చేయుటయే ఈ సంఘముయొక్క ప్రథమోద్దేశము. కాని యుద్ధములు ముగిసిన వెనుక ననేకవిధముల బాధఁ నొందు వారికి సేవచేయవచ్చు నని యీ సంస్థ ప్రపంచములో ననేక దేశము లలో నేర్పరుపబడినది. ఇప్పటికి సంఘములలోఁ గోట్లకొలఁది సభ్యు లున్నారు.

రెడ్ క్రాసు సంఘములో బాలుర సమాజ మొకశాఖ. పాఠ శాలలో బదునెనిమిదేండ్లకంటె దక్కువ వయస్సుగల బాలబాలిక లీ సంఘములో జేరవచ్చును.

బాలుర రెడ్ క్రాసు సంఘములో మూఁడుద్దేశములు కలవు. ఆరోగ్యభ్యాసముల నలవరచుకొనుట మొదటిది. రోగులకు, బాధి తులకు సేవచేయుట రెండవది. ప్రపంచములోని ఇతరజాతుల బిడ్డ లతో స్నేహభావము కలిగియుండుట మూఁడవది. ఈ సంఘము వారు సంఘసభ్యులు గైకొనవలసి నట్టేర్పాటుచబడిన పదునైదు ఆరోగ్య విధులను గైకొనుట, ప్రథమచికిత్స, రోగులకుపచారము అను విషయమున శిక్షణమ్ము పొందుట, తాము సిద్ధముచేసిన పటముల పుస్తకములను పరదేశపు రెడ్ క్రాసు సంఘముల కంపి వారు సిద్ధ ముచేసిన పటముల పుస్తకములను దెప్పించుకొనుట యను నీ మూఁడు విధముల సంఘపుటుద్దేశములకు నెఱవేర్పుఁ జూచుచుందురు.

ఒక పాఠశాలలో నీ రెడ్ క్రాసు సంఘమును స్థాపింప గోరు వారు మద్రాసులో నున్న యీ సంఘమునకు వ్రాసి వలయు గ్రంథ ములను దెప్పించుకొని యొక యుపాధ్యాయుని యాజమాన్యమున సంఘమును స్థాపింపవలయును. బాలురు తమవారిలో నొక కార్య నిర్వాహక సంఘము నెన్నుకొనవలయును. సభ్యులు నెలచందా లియ్యనక్కర లేదు. కాని యేదైనఁ జిన్న వస్తువులను సిద్ధముచేసి యమ్మకముచేసియు, దమ తల్లిదండ్రులు “పిలకాయలకొఱకిచ్చు

సొమ్ములోఁ గొంత దాచుకొనియు నప్పుడప్పు డీ సంఘమునకు చందాల నియ్యవలయును. ఈ చందాలనుండి బాధపడుచున్న స్వదేశ బాలురకు సొమ్ము పంపవచ్చును. సొమ్ము లేనియెడలఁ దమ సానుభూతినైన దెలుపు సందేశ మంపవచ్చును. మద్రాసులోని సంఘమునకు సంవత్సరమున కొక రూపాయి చెల్లించిన పక్షమున వారు కొన్ని గ్రంథముల నుచితముగ పంపుచుందురు. ఇందు మూలమున బాలబాలికలు మంచి విషయముల నేర్చుకొనుట కవకాశము లున్నవి.

ప్రకృతి పరిశీలన సంఘములు :—ప్రకృతిలోని వివిధ ప్రాణులను బరిశీలించి వాని యునికి, ఆహారము, అభ్యాసములు మున్నగు విషయములను దెలిసికొని యానందించు యాప్రాణులయెడ దయతో మెలఁగ నేర్చుకొనుటయే యీ పరిశీలన సంఘముల యుద్దేశమై యుండవలయును. బాలురు చిన్నతనమున జంతువుల యెడలను, పక్షుల యెడలను క్రూరముగఁ బ్రవర్తించుచుందురు. మంచి చెడ్డ లెఱుగని యజ్ఞానమే యిందులకుఁ గారణము. తమ చుట్టునున్న ప్రాణులకు సైతము తమకువలెనే యాకలిదప్పులు శరీరబాధయు నుండునను జ్ఞానము ప్రకృతిపరిశీలన సంఘముల మూలమున వారికిగలుగును. అప్పుడు వారితరప్రాణులయెడ నిర్దయగా బ్రవర్తింప కుందురు.

కావునఁ బాఠశాలలో నిట్టి సంఘముల నుపాధ్యాయులలో నొకరి యాజమాన్యమున నేర్పరచి బాలురు దానిలోఁ జేరునట్లు ప్రోత్సహింపవలయును. సంఘములోఁ జేరినవారు తమ విరామ కాలమునఁ దమచుట్టు నున్న జంతువులను, పక్షులను జాగ్రత్తగ గమనించి వాని యాహారాభ్యాసములను గూర్చి నేర్చుకొనవలయును. జంతువుల గిట్టలు, రోమములు, పక్షుల గ్రుడ్లు, ఈఁకెలు మున్నగు వస్తువులను సేకరించి, (అట్లని పక్షులగూళ్ళను గ్రుడ్లను బూర్ణముగ పీకి వేయరాదు.) వాని బరిశీలించి యా జంతువులను గుఱించియు పక్షులను గురించియు నేర్చుకొనవలయును. ఈ పరిశీలన వలన బాలురలో భూతదయ యేర్పడగలదు.

పఠనసంఘములు:— పాఠశాలలోని యుపాధ్యాయులును, బాలురును జదువఁగోరు గ్రంథము లన్నియుఁ బాఠశాలయందలి గ్రంథాలయమున లభింపకపోవచ్చును. అంతియకాక మాసపత్రికలు, వార్తాపత్రికలు మున్నగునవి పాఠశాలాధికారులు పాఠశాలకుఁ దెప్పింపజాలనపు డుపాధ్యాయులట్టి గ్రంథములను, బత్రికలను దెప్పించుకొని చదువుటకు బఠనగ్రంథాలయమును స్థాపించుకొనవచ్చును. ఉపాధ్యాయు లందఱును నట్టిసంఘములోఁ జేరి మాసమున కింత చొప్పున చందాలను వేసికొని యాసొమ్ముతో వలయు గ్రంథములను, బత్రికలను దెప్పించు నేర్పాటుచేయవలయును. విద్యార్థు లీపఠన సంఘములకుఁ జందాలను జెల్లింపలేకున్న బాఠశాలయే విద్యార్థుల పక్షమున గొంతసొమ్ము చెల్లించి పత్రికలను జదువుటకు వారికి సౌకర్యములను గలిగింపవలయును.

వారమున కొకపర్యాయ ముపాధ్యాయులలో నొకరు వంతుల ప్రకారము పాఠశాల కంతకును నావారములోని ముఖ్యవార్తలను జెప్పు నేర్పాటు పాఠశాలలో నుండుట మంచిది. దాని మూలమున బాలుర జ్ఞానము వృద్ధియగుటయుఁ బత్రికలు చదువ నవకాశములేని వారు ప్రపంచవార్తలను దెలిసికొనుటయుఁ జేకూరఁ గలవు. పత్రికలను జదువు నాశ విద్యార్థులలోఁ బొడమ గలదు.

సాంఘికసేవా సంఘములు :— గ్రామపాఠశాల గ్రామాభివృద్ధికి దోడ్పడునదై యుండవలయును. ప్రస్తుతకాలమున గ్రామములు విద్య, ఆరోగ్యము, ఆర్థికములు మున్నగు విషయములలోఁ జాల వెనుకఁబడి యున్నవి. ఇట్టి గ్రామముల నుద్ధరించుటకు గ్రామపాఠశాలలోని యుపాధ్యాయులు తగు యత్నములు చేయుట యెంతయు దగియున్నది. ఇందులకు వీరు సేవాసంఘముల నేర్పరచి పాఠశాలలోని యుపాధ్యాయులును బాలురును మాత్రమే కాక గ్రామములోని యువకులను దానిలోఁ జేరునట్లు ప్రేరేపింపవలయును. అట్టి సంఘములు గ్రామమును శుభ్రముగ నుంచుటకుఁ బూనుకొనవలయును. అవసరమగుచో వీధులను, సందులను నూడ్చుటకు సైతము

సిద్ధపడి గ్రామస్థులకు మాదిరి చూపవలయును. ఆరోగ్యమును గూర్చిన నాటకములను బాలురకు నేర్పి వానిని గ్రామములోఁ బ్రదర్శింపఁ జేయవలయును. ప్రభుత్వపు టుద్యోగులు గ్రామమును దర్శించినపు డారోగ్యము, వ్యవసాయము, సహకారము మున్నగు విషయములను గూర్చిన యుపన్యాసము లిప్పింపవలయును. గ్రామములో రోగపీడితులకుఁ దగు వైద్యసహాయము దొరకునట్లు చేయుటకుఁ బ్రయాస పడవలయును.

నాటకసంఘములు :— గ్రామస్థులకు సంతసము కలిగించు కథలు, పాటలు, నాట్యము మున్నగువాని మూలమున వారికి జ్ఞానముపదేశించుటకుఁ బాఠశాలలో నొకనాటక సంఘ ముండదగును. గ్రామములో సంగీతమునం దభిరుచి గల యువకులను సయితము కొందఱ నీ సంఘములోఁ జేర్చుకొని నీతిబోధకములును, జ్ఞానబోధకములునగు నాటకముల నీసంఘము వారప్పుడప్పుడు ప్రదర్శించుచుండవలయును. నాటకములు సామాన్యముగ బాలుర గ్రహణశక్తి మించినవై యుండరాదు. వేషధారణమునను విశేషధనము వ్యయము చేయరాదు. దుస్తులు చౌకగ నుండవలయును. నాటకములలో బూతుమాట లుండరాదు. రోతపుట్టించు హాస్యము గూడదు. కేవల మొక నాటక ప్రదర్శనమునే గాక బొమ్మలాటవంటి ప్రదర్శనములు, నృత్యము, కోలాటము మున్నగున వన్నియు నుపాధ్యాయులు బాలురకు నేర్పించి గ్రామస్థుల కానందము గలుగఁ బ్రదర్శింపవలయును.

వస్తువిక్రయ సహకార సంఘము:— పాఠశాలలోని బాలురు పుస్తకములు, కాగితములు మున్నగు వస్తువులను అంగడి వీధిలో గొనుచుందురు. వారు వస్తువుల నొకటొకటిగాఁ గొనునపు డా వస్తువుల కెక్కువసొమ్ము చెల్లింపవలసి యుండును. కాని బాలురందరును గలసి తమకుఁ గావలసిన యొక మొత్తముగాఁ గొన్నచో వస్తువులు తక్కువ ధరలకు లభింపఁగలవు.

ఈ కారణముచేత బాఠశాలలో నొక వస్తువిక్రయ సహకార సంఘమును బాలుర నిమిత్త మేర్పఱుప వలయును. బాలురా సంఘ

ములో సభ్యులుగఁ జేరి తాము కొనదలఁచిన బడివస్తువుల కగు సొమ్మును ప్రోగుచేసి కావలసిన వస్తువుల నన్నింటిని దెప్పించుకొని సంఘముగుండా విక్రయము చేయవలయును. ఆ విక్రయమువలన వచ్చులాభమును సంఘమునకు మూలధనముగా నేర్పరచిన యెడల మఱికొన్ని వస్తువులను గొనవచ్చును. ఈసంఘము ను బాలురే నడుపు కొనవలయును. అట్లు చేయుటవలన వారికి మంచివస్తువులు చౌకగ దొరకుటయే గాక, బాధ్యత గల పదవులను నిర్వహించుటయం దను భవము సైతము సంపాదించుకొన్నట్లగును. సహకార సంఘములను గూర్చిన జ్ఞానముకూడ వారికిఁ గలుగును.

వ్యాయామసంఘములు:—పాఠశాలలోని బాలురందరును నేదో యొక యాటను ప్రతిదినము విధిగ నాడవలయునను నియమము సామాన్యముగఁ ప్రతిపాఠశాలలోను నుండును. పాఠశాలలో నిర్బంధముగ నాటలులేని దినములయందును, సెలవు దినముల యందును పాఠశాలల బాలురతోఁ గలసి యాటలనాడియు నితర విధము లగు శరీర వ్యాయామము చేసియు, నాటలయందు నేర్పును, నితరబడుల బాలురతో స్నేహమును సంపాదించుకొనుటకై బాలురు వ్యాయామసంఘముల నేర్పరచుకొను చుందురు. ఉపాధ్యాయులు వీనిని బ్రోత్సహింప వలయును. ఏలయన వాని మూలమున బాలురలో స్నేహభావము గలుగును.

## ప్రశ్నలు

(1) పాఠములు ప్రణాళికలో లేని పనులను బాలుర కేందుకు నేర్పవలయును ?
(2) హాబీ లనగా నేమి? వానివలన ప్రయోజనములను వివరింపుము.
(3) ప్రాథమిక పాఠశాలలోని నాల్గు-ఐదు తరగతిలోని విద్యార్థులకు నీవు సూచింపఁగల హాబీల నొక పట్టికను వ్రాయుము.
(4) విద్యార్థులు హాబీల నేర్పరచుకొనునట్లు చేయుట కుపాధ్యాయు డేమి చేయ వలయును?
(5) నీవున్న బడిలో బాలభటోద్యమము లేకున్నయెడల దాని నేర్పరచుటకు నీ వేమి చేయుదువు ?

(6) బాలభటోద్యమము వలన (1) విద్యార్థులకు, (2) ఉపాధ్యాయులకు (3) పాఠశాలలకుఁ గలుగ గల లాభములను వ్రాయుము.

(7) రెడ్ క్రాసు సంఘముయొక్క యుద్దేశము లెవ్వి? ఆ సంఘములోఁ జేరిన బాలురు ప్రపంచములో నాపదయందున్న బాలుర కెట్లు తోడ్పడగలరు?

(8) వస్తువిక్రయ సహకారసంఘము నీవున్న బడిలో స్థాపింపఁ బడియున్న దనుకొనుము. ఆ సంఘముయొక్క ఒకనాఁటి పనిని వివరించుము?

(9) బడిలోని వ్యాయామసంఘముయొక్క యుద్దేశములు, పనులు ఎట్లుండ వలయునో వ్రాయుము?

(10) ప్రకృతి పరిశీలనసంఘముల మూలమున జంతువృక్షజాలముల యెడ బాలురలో నెట్టి యభిరుచి నెట్లు వృద్ధిపొందింతువో తెలుపుము?

# క్రమశిక్ష

క్రమశిక్ష పాఠశాలకు జీవమువంటిది. అది లేని పాఠశాలలో బడి సక్రమముగ జరుగనేరదు. అంతియకాదు, క్రమశిక్షలేని పాఠశాలలో నుండు బాలురు దుష్ప్రవర్తనమున కలవడి తమకును తమతోటివారికిని గొప్ప యాపదలను దెచ్చి పెట్టుదురు.

క్రమశిక్ష యన నేమి?:—క్రమశిక్ష యను పదమునకు నిర్వచనము చేయు టంత సులభముకాదు. కాని చట్టమునకు లోబడి నడచుకొనుట యని చెప్పవచ్చును. ఒకడు తన జీవితము నుత్కృష్టమైన దానిగఁ జేసికొనుటకై యవలంబించెడు పద్ధతియే క్రమశిక్ష యనదగును. తనలో నుత్తమశీల మేర్పడుట కొఱకు తన జీవితచర్యలనెల్లఁ గ్రమపరచుకొనుటయే క్రమశిక్ష. మనస్సులోఁ బుట్టు చెడ్డకోర్కెలను నిరోధించుటయే క్రమశిక్ష. కాఁబట్టి క్రమశిక్షలో విధేయత, యధికారము, ఉత్తమాదర్శమునను మూడు సంగతులిమిడి యున్నవి. ఆజ్ఞకు లోబడని వానిలో విధేయత లేదు. విధేయత లేనిచోటఁ గ్రమశిక్ష యుండదు. కానీ యావిధేయత దండన వచ్చునని భయముచేతఁ బుట్టినదిగ నుండరాదు. ఆజ్ఞ కెందులకు లోఁబడవలయునో తెలియని యజ్ఞానమువలనఁ బ్రేరితమైన విధే

యతయు మంచిదికాదు. విధేయభావమునకుఁ గారణము తెలిసికొని మనఃపూర్వకముగఁ జూపు విధేయతయే యుత్తమమైనది.

లోఁబడుట యనఁగా నాజ్ఞకు లోఁబడుట. ఆజ్ఞ యధికారముతోఁ గూడియుండును. ఆజ్ఞ యెప్పుడుగాని గైకొనువాని మేలునకే యుద్దేశింపఁబడి యుండును. ఈ సంగతి నాయాజ్ఞకు లోఁబడవలసినవాఁడు గ్రహించునట్లు చేయఁగలిగినఁ గ్రమశిక్ష భార మనిపించదు.

బాలురలో సత్ప్రవర్తన కలుగఁజేయుటయే క్రమశిక్ష యొక్క యుద్దేశము. తనలో సచ్ఛీల మేర్పడుట కాజ్ఞలకు బద్ధుడై వర్తించుట యవసరమని బాలుఁడు గ్రహించి యుత్తమశీలము నలవఱచుకొనఁగోరినపుడే యతఁ డుత్సాహముతోఁ గ్రమశిక్షకు లోఁగును. ఈ భావ మెచ్చట నుండునో యచ్చట జక్కని క్రమశిక్ష యున్నదనగలము.

బడిలోని క్రమశిక్ష:—బడిలోని క్రమశిక్ష యనఁగా "పాఠశాలలోని పనిని సక్రమముగ జరుపుచు నందలి బాలురను సుశిక్షితులను జేయు నవలంబించెడు పద్ధతులని కొందఱందురు. బడిలోని క్రమశిక్ష చట్టములపై నాధారపడియున్నది. అనగా బడిలోనిపని క్రమముగ జరుగుటకు బాలు అందరును బడి నియమములకు లోబడి నడచుకొన వలయును, నడచుకొనవిచో శిక్షకుఁ బాత్రు లగుదురు. కావున బాలుఅందరును బడిచట్టములను మన్నించు గుణము వారిలో గలుగ జేయవలయును. కనుక చట్టములను విశేషముగఁ జేయరాదు. చేసిన కొన్ని నియమములను బాలురంద అనుసరించునట్లు మాత్రము చూడవలయును. ఆ యనుసరణము సంతోషముతో గూడినదైనపుడు మంచి క్రమశిక్ష కదియొక చిహ్న మనగలము.

బడిలో క్రమశిక్ష బాగున్నపుడు తరగతిలోఁ గ్రమముండును. బాలురు పాఠములను శ్రద్ధగా వినుచుందురు. ఒక్కొక్కబాలుడును దన పనిమీఁదనే మనస్సు నిలిపియుండును. ఉపాధ్యాయుల యాజ్ఞలకు వెంటనే లోఁబడును. "మంచి క్రమశిక్షయున్న బడిలో బాలురు

నియమిత వేళకుఁ బ్రతిదినమును బడికి వత్తురు. ఉపాధ్యాయునియెడల వినయ విధేయతలతో మెలఁగుదురు. ఉపాధ్యాయుఁడు వారిని ప్రేమతో జూచును. బాలురు బడిసామానులను జాగ్రత్తగ నాడుకొందురు. తమ తమ పనులయందే మనస్సుంచుదురు వ్యక్తిగతమగు మేలును పాటింపక యందఱి మేలును గమనించి ప్రవర్తింతురు. పెద్దలయెడ గౌరవ భావము కలిగి యుందురు."

క్రమశిక్ష బాగుగా నున్న బడిలో పనియంతయు సక్రమముగ జరుగుట కవకాశముండును. ఎందులకన, బాలురందరును తమతమ పనులను శ్రద్ధతో జేయుచుందురు. మంచి క్రమముండును.

కాని క్రమశిక్ష లేని బడిలో బాలురు సోమరులై యెవరి యిష్టముచొప్పున వారు ప్రవర్తించుదురు. చదువు సాగదు. తుంటరి పనులు సామాన్యముగ జరుగుచుండును.

తరగతిలోనుండు మంచి క్రమశిక్ష:—తన తరగతిలో మంచి క్రమశిక్షయుండుట కుపాధ్యాయుఁడు క్రింది విషయములను గమనింప వలయును. బాలుర నెట్లు దిద్దవలయునో యుపాధ్యాయుఁ డెరిగి యుండవలయును. తరగతిలోని ప్రతి చిన్న యక్రమమును, దప్పును, వెంటనే సవరింపవలయును. పాఠములను జాగ్రత్తగను బాగుగను సిద్ధము చేసికొని తరగతికి బోవలయును. బాలురందరియెడల సమాన దయ చూపవలయును. తప్పుచేసినపు డందఱిని సమానముగ శిక్షింపవల యును. ఎవరికిఁగాని యన్యాయము చేయరాదు. క్రమశిక్షను సులువుగా పనులుజరుపుటకు దగిన వసతులను పాఠశాలలో నేర్పఱుపవలయును.

క్రమశిక్షా పద్ధతులు:—వీనిని ప్రత్యక్ష పద్ధతులని, పరోక్ష పద్ధతులని రెండు భాగములు చేయవచ్చును. ప్రత్యక్షపద్ధతులనుగూర్చి మొదట నాలోచింతము.

దండనము:—ఆజ్ఞ నతిక్రమించు వారి కనఁగా హద్దుమీఱి నడచు వారికి దండన ముండు టవసరము. దండన మనేక విధములుగ నుండవచ్చును. వెలుగుచున్న లాంతరు చిమ్నీని ముట్టరాదనిన నొక బాలుడు దానిని ముట్టుకొనును. చేయి కాల్చుకొనును. జాపుడు

బండమీఁద నడవరాదని చెప్పినను బిడ్డలు కొందఱు దానిపై నడచి కాలుజారి క్రిందపడి దెబ్బలను తగిలించుకొందురు. ఈ సందర్భములలోఁ తల్లిదండ్రులు దండింపకున్నను బిడ్డలు తాము చేసిన తప్పు పనులవలన హానిబొంది మఱొకసారి యట్లు చేయకుండుటను నేర్చుకొందురు. బాలుడు చేసిన తప్పుపనుల ఫలమే శిక్షలు. బాలుడు చేయు ప్రతితప్పున కట్టిశిక్ష రాఁగలిగినయెడల నంతశ్రమ యుండదు: ఎందులకన, తప్పునకు వెంటనే శిక్ష కలుగుచుండును. బాలుడు తన ప్రవర్తనము వలననే శిక్షవచ్చిన దనియు, నది న్యాయమైనదనియు గ్రహించి గుణపాఠము నేర్చుకొనును. కాని, యనుభవమువలన గుణపాఠమును నేర్చుకొను నీ పద్ధతిలో గొన్నివేళల శిక్ష వెంటనే రాదు. వచ్చినను దప్పునకుఁ జాలినంత కాకపోవచ్చును; లేదా శిక్ష బాలుని మీఁదికి వచ్చుటకుబదు లతని సంరక్షకులకుఁ దగులవచ్చును. కనుక నిట్టి విధమగు శిక్షలో లోపము లున్నవి.

పాఠశాలలలోని బాలురు తప్పులు చేసినప్పు డీ క్రిందజూపిన దండనముల బొందుచుందురు:—

1. గద్దింపులు : ఇది మిక్కిలి సామాన్యమైన దండనము కొందఱు బాలురపై నిదీ పనిచేయదు.

2. నిలువబెట్టుట, మోకాళ్ళపైఁబెట్టుట, స్థలమునుమార్చుట, మొదలగున వన్నియు బాలుని సిగ్గుపరచుటకుఁ బనికివచ్చును. కాని యివి చిన్నతప్పులకు మాత్రమే ఉపయోగించును.

3. హక్కులను దీసివేయుట: ఆటలాడుటకుగాని, లేదా నాటకములను బ్రదర్శించుటకుఁగాని బాలునికి గల హక్కును దీసివేయుట వలనఁ గొందఱు బాలురు గుణపడుదురు.

4. వ్రాతవ్రాయుట : కంఠపాఠము చేయుట యనునవి బాలురు పాఠములను నేర్చుకొని రానప్పుడుపయోగింపనగును.

5. బడిలోనుండి వెళ్ళగొట్టుట : ఒక బాలుఁడు బడిలో నుండుట వలనఁ దక్కిన బాలురందరకును హానికలుగునని తోఁచి నపుడే ఇట్టి శిక్షను బాలునిపై విధింపవలయును.

6 దెబ్బలు కొట్టుట : దెబ్బలుకొట్టు పద్ధతి యంత మంచిది కాదు. ఏలయన : నది దేహమునే శిక్షించునుగాని దేహమును నడుపుచున్న మనస్సును శిక్షింపఁ జాలదు. మనస్సు మారనపుడు బాలుఁడు దెబ్బలవలనఁ గలిగిన బాధను త్వరలో మఱచిపోయి తాను జేసిన తప్పునే మఱల మఱలఁ జేయుచుండును. కాని దెబ్బలు తగులుటవలన బాలుఁడు తాను జేసిన తప్పునుగూర్చి తలంచి, చింత పడి దానిని మానివేయునని కొందఱందురు. కాని యట్లు జరుగునని నిశ్చయముగఁ జెప్పలేము. ఒకొక్కప్పుడు దెబ్బలుతిన్న బాలుడు మూర్ఖుడై మఱింత చెడిపోవుటయు దటస్థించును. లేదా యితరుల కంటబడకుండ దప్పులను జేయఁ బ్రయత్నించును. ఒకవేళ తప్పులో దొరకిన యెడల దెబ్బలు తప్పించుకొనుటకబద్ధములు చెప్పును. కనుక దెబ్బల పద్ధతి నూటికి తొంబదితొమ్మిదిపాళ్ళు కోరఁదగినది కాదనియే చెప్పవలయును.

కాఁబట్టియే విద్యాశాఖవారు పాఠశాలలలో బాలురకు దెబ్బలశిక్ష విధింపరాదనియు, నట్టి శిక్ష విధింపవలసిన యవసర మేర్పడినచోఁ దప్పుజేసిన బాలుని చేతిమీద నాలుదెబ్బలకంటె నెక్కువ కొట్టరాదనియు, నీ శిక్ష నయినను ఎస్.ఎస్.ఎల్.సి. తరగతి బాలురకు విధింప రాదనియుఁ జట్టములను జేసియున్నారు. ప్రాథమిక పాఠశాలలో బాలురకు దెబ్బలుగొట్టుట చట్టవిరుద్ధమే కాకుండ క్రూరకార్యము నహితమగును.

పారితోషికములు:—బాలురు తాము చేయవలసిన పనులను శ్లాఘనీయములుగఁ జేసి ముగించినపుడు కొన్ని పాఠశాలలలోని యధికారులు వారికిఁ బారితోషికముల నిత్తురు. పారితోషికముల నిచ్చుట వలన బాలురు వాని కాశపడి తమతమ పాఠములను శ్రద్ధతో జదువుదు రనియు, సన్మార్గమున మెలఁగెదరనియు నట్టి వారి

యభిప్రాయము. ఈ పారితోషికములు మెప్పు, యోగ్యతాపత్రములు, గ్రంథములు, పతకములు మున్నగునవిగ నుండును. బాలురు బడిలో నభివృద్ధి కనబఱచినపుడు వారిని మెచ్చుకొనుటవలన వారు మరింత శ్రద్ధగ బనిచేయుదురు. గ్రంథములు, పతకములు మున్నగు వాని కొఱకు ప్రయాసపడు బాలురు లెక్కువమంది యుండరు. కనుక బారితోషికముల మూలమున బాలురలోఁ గ్రమశిక్ష వృద్ధిపొందింపదల చుట శ్రేయస్కరమగు పద్ధతికాదు.

బడిచట్టములు :— ప్రత్యక్షములగు క్రమశిక్షాపద్ధతులలో నిది యొకటి. ప్రతి పాఠశాలలోను గొన్ని చట్టము లవసరముగ నుండవలయును. ఇవి ఎంత తక్కువగనున్ననంతమంచిది. వీని యనుసరణము మూలమున బాలురలో సత్ప్రవర్తనమును జక్కని క్రమశిక్షయు వృద్ధి కావలయును. చట్టముల మూలమున నిట్టి ఫలితము కలుగుట కవియేవి యని బాలు రందఱకుఁ జక్కగఁ దెలిసి యుండవలయును. చట్టమును మీఱి నడిచిన ప్రతిబాలుఁడును దండన పొందవలయును. అప్పుడు బాలురు వానిని గైకొనుట కభ్యాసపడుదురు.

ఈ చట్టము బాలుర దేహశుభ్రత, దుస్తులు, తరగతి గది శుభ్రతను, నియమితకాలమున బడికి వచ్చుట, ఉపాధ్యాయుల యెడ గౌరవము, బడిసామానులను జాగ్రత్తగ వాడుకొనుట, వరుసక్రమము మున్నగు విషయములను గుఱించినవై యుండవలయును. మచ్చునకుఁ గొన్ని నియమము లీ దిగువఁ జూపఁబడినవి.

1. బాలుడు కాలుచేతులను, ముఖమును బ్రతిదినము శుభ్రముగ గడిగికొని శుభ్రమగు దుస్తులను ధరించి బడికిరావలయును.
2. ప్రతిదినము మొదటిసారి యుపాధ్యాయులను జూచినపుడు వినయముగ నమస్కారము చేయవలయును. తరగతిలోని కుపాధ్యాయుడు వచ్చినపుడు లేచి నిలుచుండి కూర్చుండుమని యాయన చెప్పువరకు నిలిచియే యుండవలయును.
3 బడిలో నితరబాలురతోఁ గలహింపరాదు. తగవు కలిగినపుడుపాధ్యాయునకుఁ జెప్పవలయును.

4. ఉదయము సాయంత్రము రెండుపూటలు నియమిత వేళకు బడికి రావలయును.
5. పెక్కుమంది బాలురొక్కచోటఁ జేరవలసి వచ్చినపుడు వరుస లుగ నిలుచుండవలయును (క్యూ పద్ధతి).

ఇట్టి చట్టముల నూరక చేసినంత మాత్రమున బడిలోఁ గ్రమ శిక్ష ఏర్పడదు. బాలురు వాని ననుసరించి నడచుకొను నట్లుపా ధ్యాయు లందఱును జూడవలయును.

పైనిజెప్పిన చట్టము లమలుజరుపుట కుపాధ్యాయులు చేయ వలసిన పనులు కొన్నికలవు. అవి యేవి యనిన : ఉపాధ్యాయుడు శుభ్రతయందును, దుస్తులవిషయము నందును, వేళకు సరిగా బడికి వచ్చుటయందును బాలుర కాదర్శప్రాయముగా నుండవలయును. ఉపాధ్యాయుఁ డశ్రద్ధగానుండి బాలురు మాత్రము విధులను నెఱకొన వలయునని కోరుట భావ్యముకాదు, దేహశుభ్రత, దుస్తుల శుభ్రత విషయములను బాలురు తరగతికి వచ్చినతోడనే ప్రతిదిన మొకటి రెండునిమిషములపాటు వారి నందఱను బరీక్షించి మురికిగానుండు బాలుర నింటికిఁ బంపవలయును. బడి కాలస్యముగవచ్చు బాలురను దప్పక దండించి క్రమముగ వచ్చునట్లు చేయవలయును. బడి వస్తువు లను జాగ్రత్తగ వాడుకొనుటనుగూర్చియు, పెద్దలయెడ గౌరవము చూపుటనుగూర్చియు నప్పుడప్పుడు సమయానుకూలముగ హెచ్చ రించు చుండవలయును. బాలురు విడుపుసమయమున నీరు త్రాగుటకు బోయినప్పుడును ప్రధానోపాధ్యాయుని జూడబోయి నప్పుడును వెనుక వచ్చినవారు ముందున్నవారిని ద్రోసికొని ముందునకుఁ బోక వచ్చిన వరుసప్రకార మొకరివెనుక నొకరు నిలిచి తమ వంతులో నాపని చూచుకొనున ట్లుపాధ్యాయుఁడు బాలురను హెచ్చరింప వలయును.

పరోక్షసాధనములు:—బడిలోఁ గ్రమశిక్ష నేర్పుటకుఁగల పరోక్ష సాధనములను గుఱించి యిప్పుడు విచారింతము.

1. అనుదిన సమావేశము:—బడిలోని బాలురందఱు ప్రతి దినము బడిపని ప్రారంభింపకముందు బడిలో నొకచోట సమావేశ మగుట యాచారము. ఇది మిగుల సదాచారము. ఇట్టి సమావేశముల సమయమున దైవప్రార్థనలు జేయవచ్చును. ప్రధానోపాధ్యాయులు బడి కంతటికిని జెప్పవలసిన సంగతులేవైన నున్న యెడల నీ సమావేశ మట్టి సంగతులను జెప్పుటకు మంచితరుణము. అంతియు గాక బాలురు వరుసలలో నిలుచుటకును, గూర్చుండుటకును, వరుసగాం దమతమ తరగతులకుం బోవుటకును నిది యవకాశముల నిచ్చును.

2. కుటుంబపద్ధతి:—ఈ పద్ధతి ననుసరించి బాలుర నందరిని కొన్ని కుటుంబములుగ నేర్పరచి వారికి దగినవిధమున నామకరణముచేసి యొక్కొక్క దానికి నొక్కొక్క యుపాధ్యాయుని పెద్దగ నియమింపవచ్చును. ఇట్టి కుటుంబములు లాటలు, పాటలు, మొదలగువానిలో నొకదానితో నొకటి పోటీచేయుటవలన నాకుటుంబమునకుం జేరిన బాలుర కైకమత్యము, విధేయత మొదలగు గుణము లలవడును.

3. ఐక్యభావము, విద్యార్థినాయకులు:—విద్యార్థు లాటపాటలను సాగించుటకు గుంపులుగ నేర్పరచుట యుచిత మగుపని. అట్టిగుంపులకు విద్యార్థులు తమలోనుండి తామే నాయకుల నెన్నుకొనునట్లు చేయవలయును. బాలు రిట్టి నాయకులక్రింద నాటలాడుటవలన నొక్కొక్క గుంపులోం జేరినవారి కందఱకు నైక్యభావము తప్పక యలవడును. మఱియు నాయకునకు లోంబడు గుణములు పట్టువడును. నాయకులుగా నేర్పడిన విద్యార్థులు బాధ్యతగల పనులను నిర్వహింపవలసి వచ్చుటచేత న్యాయము, ఓర్పు, సమభావము, ముందాలోచన మొదలగు గుణముల నలవఱచుకొందురు. ఇట్టిసంస్థలు క్రమశిక్షకు మిగులం బ్రయోజనకరములు.

4. తరగతి పెద్దలు, మానిటర్లు:—ఉపాధ్యాయుడు తరగతిలో లేనప్పుడు తరగతిలో నల్లరి జరుగకుండం జూచుటకును, నోటుపుస్తకములు మొదలగు వస్తువులను గూర్చుటకును, నిచ్చివేయుటకును,

తరగతిలోని నల్లబల్ల, కుర్చీ, బల్లమున్నగు సామానులు సరిగ నుంచు టకును తరగతి పెద్దలుంచుట యవసరము. తరగతియొక్క యవసరము లను గూర్చియు, తరగతిలో నల్లరిచేయు బాలురను గూర్చియు నుపా ధ్యాయునికి జెప్పి పాఠశాలలోని క్రమశిక్షకు వారు బాగుగ దోడ్పడఁ గలరు.

5. విద్యార్థుల స్వపరిపాలన :—విద్యార్థులుచేయు తప్పులను విచారించి వారికి వేయఁదగు శిక్షలనుగుఱించిన సిఫారసులు చేయు టకును, విద్యార్థుల యక్కఱలను గుఱించి పాఠశాలాధికారులకుఁ దెలుపు కొనుటకును విద్యార్థుల పంచాయతీ యొకటి యుండుట మంచిది. దీనిలో నొక యుపాధ్యాయుఁడు సభ్యుఁడుగమాత్ర ముండ వచ్చును. కాని యధ్యక్షుఁడు విద్యార్థియే యుండుట మంచిది. ఇట్టి సంస్థవలన బాలురు నేరములను విచారించుటలో గల చిక్కులను గ్రహించుటయే కాక, బాలురు నేరములు చేయకుండఁ జేయుటకు ప్రయత్నపడుదురు.

## ప్రశ్నలు

(1) క్రమశిక్ష యనగా నేమి?

(2) తరగతిలోని క్రమశిక్ష ఉపాధ్యాయుని ప్రవర్తనముపై నాధారపడి యుండునని ఋజువు చేయుము.

(3) క్రమశిక్షా పద్ధతు లెన్నివిధములు? అవి యేవి?

(4) బడిలోని విద్యార్థులకుఁ బారితోషికములనిచ్చు పద్ధతి మంచిది కాదందురు. కారణములను వ్రాయుము.

(5) దెబ్బలు కొట్టుటవలన బాలుర ప్రవర్తనము చక్కబడదు. ఇట్లనుట సరియేనా? కారణములను దెలుపుము.

(6) బడి ననుదిన సమావేశము క్రమశిక్ష కెట్లు తోడ్పడును?

(7) తరగతి పెద్దలు విద్యార్థి నాయకులు — వీరు బడిలో క్రమశిక్షణము నిలుపుట కెట్లు తోడ్పడుదురు?

(8) నీవున్న బడిలోని బాలుర సత్ప్రవర్తనయందుఁ బెరుగుటకు వారు గైకొనవలసిన పండ్రెండు విధులను వ్రాయుము.

---

# 11. ఉపాధ్యాయవర్గము

ఉపాధ్యాయవృత్తి వృత్తులన్నిటిలోను దొడ్డదే కాని యార్థిక సౌకర్యములనుబట్టి చూచినచో నింతకంటె దౌర్భాగ్యమైన వృత్తి మఱొకటి లేదని యాంగ్లభాషలో నొక సామెత కలదు; భగవంతుఁడు ప్రసాదించెడు అనంతశక్తులు గుప్తములై యున్న చిన్నబాలురకు విద్యాబుద్ధులు గఱపి వారిని సద్వృత్తిలోఁ బెంచు పనికంటె నుత్తమమగు పని వేఱొకటి యుండఁజాలదు. 'చిన్నపిల్లలను నాయొద్దకురానియ్యుఁడీ, పరలోకరాజ్య మట్టివారిదే' నని శ్రీ యేసుక్రీస్తు భగవానుఁడు సెలవిచ్చెను. క్రీస్తుభక్తులలో నొకఁడగు 'మార్టిను లూథరు' ఉపాధ్యాయవృత్తిని గుఱించి యిట్లు వ్రాసెను. "నీతిబోధలు చేయు మతగురువృత్తికి బిదప నుపాధ్యాయవృత్తికంటె గొప్పది కాని, శ్రేష్ఠమైనది కాని మఱొకటున్నట్లు నే నెరుఁగను. బాలురు చిన్న మొక్కలవలె నుండి శిక్షణమునకు మిక్కిలి దగియున్నందున వారిని శిక్షించు నుపాధ్యాయవృత్తి గొప్పదియో, పెద్దలకు నీతిబోధించు మతాచార్యులవృత్తి గొప్పదియో చెప్పఁజాలను. తల్లిదండ్రులలో ననేకులు తమ సొంతబిడ్డలనే సన్మార్గమున బెంచుటకు బాటుపడరు. ఇట్టితఱి నితరుల బిడ్డలను జేర్చుకొని వారికి విద్య నేర్పి సచ్ఛీల మేర్పడఁజేయు నుపాధ్యాయవృత్తి మిక్కిలి దొడ్డదనవలసియున్నది. కనుక నుపాధ్యాయులు తమ పనిని చులకనగాఁ జూచుకొనరాదు."

ప్రధానోపాధ్యాయుఁడు:—ఒకరికంటె నెక్కువమంది యుపాధ్యాయులు పనిచేయు ప్రతి పాఠశాలలోను, ప్రధానోపాధ్యాయుఁ డుండును. అతని పని గొప్ప బాధ్యతతోఁ గూడినది. అతఁడు

పాఠశాలకు ప్రాణము వంటివాడు. అతని తెలివితేటలు బోధనాశక్తి, నైతిక ప్రవర్తనము, కార్యచతురత, పాఠశాలానిర్వహణపద్ధతులు- వీని ననుసరించి యతని పాఠశాలయుండును. కనుక ప్రధానోపాధ్యాయుడు తగిన యోగ్యతలు కలవాడే యుండవలయును. అతడు దేహారోగ్యము కలిగి అంగవైకల్యము లేక చురుకుదనమును, పటుత్వమును గలవాడై యుండవలయును. దినమంతయు బాటుపడి పనిజేయువాడును, దన సహోపాధ్యాయులచేతః బని చేయింపగలవాడునై యుండవలయును. పాఠశాలలో నందఱికంటెను గొప్ప విద్యా విషయిక యోగ్యతలు కలిగి యుండవలయును గ్రంథపఠనముచే నెప్పుడును దన జ్ఞానమును వృద్ధిచేసికొనుచు బాఠశాలలోని యితర ఉపాధ్యాయుల మన్ననకు బాత్రుడై యుండవలయును. పాఠశాలా నిర్వహణపద్ధతులను జక్కగ నెఱిగినవాడై పాఠశాలకు జెందిన ప్రతి చిన్నవిషయమును గమనించు శక్తిగలిగి బడిపని సక్రమముగను, జయప్రదముగను జరుగుటకు వలయు నేర్పాటుల నెప్పటికప్పుడు చేయగలిగి యుండవలయును. అతని నైతికప్రవర్తన మితరుల కాదర్శప్రాయముగ నుండవలయును. సత్యము, న్యాయము, నిష్కాపట్యము, కార్యాచరణయందాసక్తి యతని నైతికజీవితమునః బ్రసిద్ధముగ గనబడవలయును. తన పవిత్ర జీవితముచే బలుకుబడి కలిగి స్థిరచిత్తుడై సహయోపాధ్యాయులను నడపుటయందు నేర్పుకలవాడై పాఠశాలకు నాయకుడై యుండవలయును. ఇట్టి ప్రధానోపాధ్యాయులరుదుగ నుందురు. కాని, వారేపాఠశాలలలోనుందురో యా పాఠశాలలో జదువు విద్యార్థులు ధన్యులు.

ప్రాథమిక పాఠశాలలో నయిదవ తరగతికంటె బెద్ద తరగతి యున్న పాఠశాలలలో ప్రధానోపాధ్యాయుడు సామాన్యముగ సెకండరీగ్రేడు ట్రెయినింగు పొందినవాడుగ నుండవలయునని విద్యాశాఖ వారి చట్టము. అంతియగాక మొదటి యయిదు తరగతులుండి, నలుగురుగాని, యంతకంటె నెక్కువమందిగాని యుపాధ్యాయు లుండు ప్రతి ప్రాథమిక పాఠశాలకు 1939 సం॥రం నుండి సెకండరీగ్రేడు

ట్రెయినింగు పొందిన యుపాధ్యాయులనే ప్రధానోపాధ్యాయులుగ నియమింపవలసినట్లుగా నేర్పఱుపఁ బడినది.

ప్రధానోపాధ్యాయుని పని:—శక్తివంచన లేకుండ త్రికరణశుద్ధిగఁ బనిచేయు ప్రధానోపాధ్యాయుని పని మిగుల భారమైనది. సహాయోపాధ్యాయులకంటెఁ బ్రధానోపాధ్యాయులపని సులభమైనదని తలంచుట పొరబాటు. పాఠశాలలోని ప్రతిచిన్న యంశమును గూర్చియుఁ బ్రధానోపాధ్యాయుఁడు తలంచి తగిన విధమున నేర్పాటులు చేయవలసి యుండును. ఏ తరగతుల నే గదులలో నుంచవలయునో, యే యుపాధ్యాయు లే తరగతులకు నేర్పునట్లు నియమించవలయునో, ఆయా తరగతుల బోధనకు వలయు నుపకరణము లెవ్వియో, వాని నెట్లు సంపాదింపవలయునో బాలుర కెట్టి బెంచీ లుండవలయునో, యను నీ మొదలగు విషయములను ప్రధానోపాధ్యాయుఁడు శ్రద్ధగ నాలోచించి యేర్పాటులు చేయవలయును. పాఠశాలలోని పని నిరాటంకముగ సాగుటకుఁ దగినట్లుగ నాయా తరగతులకుఁ గాలనిర్ణయ పట్టికలను సిద్ధబరుప వలయును. బడి యాటస్థలములు, మఱుఁగుదొడ్లు మున్నగునవి తగిన స్థితిలో నుండునట్లును, వాని విషయమై శ్రద్ధఁ బూనవలసిన నౌకర్లు వారివారి పనులను జక్కఁగ జేయునట్లును ప్రధానోపాధ్యాయుఁడు చూడవలసియున్నది. బడిలోని క్రమశిక్ష కేలాటి భంగమును కలుగని విధమున నుపాధ్యాయులు బాలురయెడలను బాలు రుపాధ్యాయుల యెడలను మెలఁగునట్లును, పాఠశాలలోని ప్రతివ్యక్తియుఁ దన పనిలో నిమగ్నుఁడై యితరుల కభ్యంతరము కలుగని విధమునఁ బ్రవర్తించునట్లును గాలము గడచుకొలఁదిని పాఠశాల సద్విషయములలో వృద్ధిపొంది దేశాభ్యుదయమునకుఁ దోడ్పడు సంస్థగా వెలయునట్లును ప్రధానోపాధ్యాయుఁడు చూడవలసి యున్నది.

ప్రధానోపాధ్యాయుఁడు బోధనాపద్ధతులను జక్కఁగ నెఱిఁగి యుండవలయును. లేకున్నచో నతఁడు తన సహాయోపాధ్యాయులు పాఠములను దగినవిధమున బోధించుచున్నారా? లేదా? యని

తెలిసికొనఁజాలరు. వారికిఁ బాఠముల బోధనయందుఁ గష్టములు కలిగినప్పుడు తగిన సలహా నియ్యలేఁడు అట్లని ప్రధానోపాధ్యాయుఁడు తన కాలమంతయును బాఠముల బోధనకే వినియోగింపరాదు. ఇందువలనఁ బాఠశాలకు గొప్ప నష్టమేర్పడగలదు. పెద్ద పెద్ద పాఠశాలలలో ప్రధానోపాధ్యాయుఁడు దినమునకే యొకటి రెండుగంటలో పాఠముల బోధనలోఁ గడపి మిగిలిన కాలము నంతయు బాఠశాలానిర్వహణ కార్యమునకే గడుపవలయును. చిన్న పాఠశాలలలో ప్రధానోపాధ్యాయునకుఁ బాఠశాలా నిర్వహణ భారమంత యెక్కువగ నుండదు. కనుక బాఠముల బోధనయం దెక్కువకాలము గడుపవలయును. కాని దినమున కొక గంటయైనను సహోపాధ్యాయుల పనిచూచుట, ఉత్తర ప్రత్యుత్తరములు, రిజిష్టర్లు చూచుట మున్నగు పనుల కుంచుకొనవలయును.

ప్రధానోపాధ్యాయుఁడు చేయవలసిన పనులలో పైవిచారణ యొక ముఖ్యమగు పని. బడిపని ప్రారంభము కాకముందే యతఁడు బడికి రావలయును. బడిగంటకొట్టినప్పు డుపాధ్యాయులును బాలురును వేళకు గ్రమముగ వచ్చుచున్నదియు లేనిదియుఁ గనిపెట్టి, యాలస్యముగ వచ్చువారిని తగురీతిని దండింపవలయును. ప్రతిదినము సమావేశములో దానుండి జరుపవలయును. పని ప్రారంభమయిన పిదప నప్పుడప్పుడు తన సహోపాధ్యాయు లెట్లు నేర్పుచున్నదియు గమనించుటకును, బ్రతి తరగతిలోను బని సక్రమముగ జరుగుచున్నదా ? లేదా ? యని తెలిసికొనుటకును నాయా తరగతులను దర్శింప వలయును. ఉపాధ్యాయులను విమర్శించు భావముతోఁ గాక వారికి దోడ్పడుగుణముతో నీ పనిని చేయవలయును. తరగతిలోని బాలుర నోటుపుస్తకములను, వ్రాతపనిని జూడవలయును. తగినసమయమున నుపాధ్యాయుల నోట్సు చూడవలయును. ఉపాధ్యాయుల కుచిత సలహాల నియ్యవలయును.

పరీక్షలను జరుపు విషయమునఁ బ్రధానోపాధ్యాయునికి గొప్ప బాధ్యత కలదు. ఉపాధ్యాయుల ప్రశ్నల నన్నింటిని బ్రధా

నోపాధ్యాయుడు పరీక్షలకు ముందే చూచి వానిని గురించి యాయా యుపాధ్యాయులతో మాటలాడవలయును. ప్రశ్నలు బాలుర జ్ఞానమునకు మించనివై సుబోధకమగు శైలిలో నుండునట్లును, బాలుర తెలివిని బరీక్షించునవిగ నుండునట్లును నేర్పాటు చేయవలయును. నికరముగ మార్కులనిచ్చు విషయమునుగూర్చి ముచ్చటింపవలయును.

ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుటకును, రిజష్టర్లు మొదలయిన వానిని సిద్ధము చేయుటకును నితరులు సిద్ధముచేసిన వానిని జూచుటకును ప్రధానోపాధ్యాయుడు ప్రతిదినము కొంత కాలమును వినియోగింప వలయును. అధికారులతో నుత్తర ప్రత్యుత్తరములు జరుపుటలో మిక్కిల జాగ్రత్తగ నుండవలయును. తగిన కారణము లేకయే పనికిరాని బాలురను శ్రద్ధగాఁ జదువని బాలురను విచారించి దండించుటయుఁ బ్రధానోపాధ్యాయుని పనియే. మిక్కిలి యశ్రద్ధగనుండు బాలుర విషయము వారి తల్లిదండ్రులతో మాటలాడుట, వారికిఁ దగిన సలహాలిచ్చుట మొదలగు పనుల నీతడు చేయవలసి యుండును. అప్పుడే బడి పని నిర్విఘ్నముగ సాగుచుండ గలదు.

ప్రధానోపాధ్యాయుడు బడిపనియొక్క యవసరములనుబట్టి వారమున కొకతూరి యుపాధ్యాయసంఘ సమావేశములను జరుపవలయును. ఈ సమావేశములందుఁ బాఠశాలలో నాయా పాఠములను నేర్పు పద్ధతులు, క్రమశిక్ష, వ్యాయామమును గూర్చిన యేర్పాటులు, బడి సెలవులు మున్నగు విషయములను గూర్చి చర్చలు జరిపి యుపాధ్యాయుల యభిప్రాయములను గనుగొని, పాఠశాల నిరభ్యంతరముగ జరుగుటకుఁ దగిన యేర్పాటులను జేయవలయును ఉపాధ్యాయులలో గలత లుదయించినపుడు ప్రధానోపాధ్యాయుడు సానుభూతితో మెలగుటయే గాక స్పర్ధలుగల యుపాధ్యాయుల మధ్య న్యాయముఁ దీర్చి సమరస స్నేహభావములను గలుగ జేయవలయును.

**సహాయోపాధ్యాయుడు:**—పాఠశాలలోఁ బనిచేయు సహాయోపాధ్యాయులకుఁ సైతము వారు నేర్పవలసిన తరగతులను బట్టియు, పాఠములనుబట్టియు యోగ్యత లుండవలయును. సామాన్యముగ

ప్రతి యుపాధ్యాయుఁడును నారోగ్యవంతుఁడై యంగలోపముగాని, యంటువ్యాధులుగాని లేనివాఁడై యుండవలయును. మఱియునతఁడు బుద్ధికుశలతయు సదభ్యాసములును కలవాఁడునై యుండవలయును. అంగలోపములు గలవారు బాలురకు డ్రిల్లు, ఆటలు మున్నగు పాఠములను చక్కఁగ బోధింపజాలరు. కొందఱుపాధ్యాయులు క్షయ మున్నగు వ్యాధులను గలవారయ్యు దమకట్టివ్యాధులున్నవని యైనను దెలియక యుండువారు వానిని బాలురకు వ్యాపింప జేయగలరు.

విద్యావిషయిక యోగ్యతలనుగూర్చి విద్యాశాఖవారి చట్టములప్రకారము యోగ్యతలుండుట యవసరము. ఈ చట్టముల ప్రకారము ప్రాథమిక పాఠశాలలోఁ బనిచేయు నుపాధ్యాయులు బోధనాభ్యసన శిక్షణమును బొందినవారై యుండవలయును. వీరు లోయర్ గ్రేడువారని, హాయ్యరు గ్రేడువారని, సెకండరీ గ్రేడువారని మూఁడుతరగతులుగ నున్నారు. లోయరు గ్రేడుపాధ్యాయులు ప్రాథమిక పాఠశాలలో నయిదవతరగతి పరీక్షలయందు మాత్రము కృతార్థులైనవారుగానుండుటచే విద్యాయోగ్యతలు చాలవని విద్యాశాఖాధికారులు వీరి నిప్పుడుపాధ్యాయపదవినుండి తొలఁగించుచున్నారు. హాయ్యరు గ్రేడు ఉపాధ్యాయు డెనిమిదవ తరగతిగాని, మూఁడవ ఫారముగాని చదివినవారుగా నుందురు. ఇఁక మూఁడవ తరగతివారె ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలో నెగ్గి సెకండరీ గ్రేడు ట్రెయినింగు పొందినవారు. పాఠశాలలోని ప్రతి 36 మంది బాలుర కొక ఉపాధ్యాయుడుచొప్పున పాఠశాలలో నుండవలయును. ఒక తరగతిలోఁ బ్రతిదినము 45 మందికంటె నెక్కువమంది బాలుకు హాజరగుచున్న పక్షమున నా తరగతిని రెండుగ విభజించి యొక్కొక్క భాగమున కొక్కొక్క యుపాధ్యాయు నేర్పఱుప వలయును.

ఉపాధ్యాయుఁడు తా నెప్పుడో నేర్చుకొన్న విషయములతోఁ దృప్తి చెందక జ్ఞానోపార్జనకొఱకై సామాన్యముగ నూతనగ్రంథములను, బత్రికలను జదువుచుండవలయును. లేనిచో నతఁడు విద్యాపద్ధతులయందు గలుగుచున్న మార్పులను తెలియజాలక మొద్దుబాఱిన

కొనునట్లు నుపయోగించు పనివానివలెనగును. ఈ యుద్దేశములతోనే యతఁడు పునరాశ్వాసక (రిఫ్రెషర్ కోర్సు) తరగతులకు సైతముపోయి యనుభవజ్ఞులగు నుపాధ్యాయులయొద్ద బోధనాపద్ధతులను నేర్చుకొనవలయును. ఉపాధ్యాయసంఘ సమావేశములకుఁ గ్రమముగఁ బోయి యచ్చట డిప్యూటీ ఇన్స్పెక్టరుగారి యొద్దను సహోపాధ్యాయుల యొద్దను బడిపనిలోఁ దనకుఁ గలుగుచుండు కష్టనిష్ఠురములను దీర్చుకొనవలయును.

నైతికముగ నుపాధ్యాయుని ప్రవర్తనము బాలు రనుసరింపఁ దగినదిగ నుండవలయును. ఉపాధ్యాయుఁడు బాలురకు సత్ప్రవర్తన మునుగూర్చి యుపదేశముననే విశేషముగ బోధించుటకంటె తనజీవితమూలముననే వారికి ఋజువర్తన మలవడునట్లు చేయవలయును. వలయన, బాలు రుపాధ్యాయుడు చెప్పినట్లు చేయుటకంటె నెక్కువగ నతఁడు చేసినట్లు చేయుచుందురు. సిగరెట్లు కాల్చు నుపాధ్యాయుఁడు బీడీలు, సిగరెట్లు త్రాగరాదని బాలురకుఁ జెప్పుటవలన నించుకేనియు ప్రయోజనము ముండదు. కావున నుపాధ్యాయుఁడు సదభ్యాసములు కలవాఁడై యున్నయెడల బాలురను సులభముగ నట్టి యభ్యాసములను నేర్చుకొనఁ గలరు.

మఱియు నుపాధ్యాయుఁడు బాలురను ప్రేమించువాఁడుగ నుండవలయును. అది లేనియెడల బాలురలో నొక్కొక్కరిని వృద్ధికి దెచ్చుట కతఁ డంతగా కష్టపడడు. ఉపాధ్యాయుఁడు బాలురను ప్రేమించుచో బాలురును నుపాధ్యాయుని ప్రేమింతురు. అతనియాజ్ఞలను శిరసావహింతురు. తరగలోఁ గ్రమశిక్ష జరుగుట కభ్యంతరములంతగానుండవు. న్యాయదృష్టి గుణములేనియుపాధ్యాయుఁడు బాలురభక్తి మర్యాదలను సంపాదింప జాలడు. పనియందు శ్రద్ధగలిగి తరగతిలోని తెలివిగల బాలురకంటె మందముగనుండు బాలురకే కడుశ్రద్ధతో విద్య నేర్పవలయును బడిలోఁబాఠములను జెప్పునపుడు క్రమశిక్ష నమలు జరుపవలసి యుండును. తరగతిలోఁ గ్రమశిక్ష నెలకొల్పలేని యుపాధ్యాయుఁడు తనపని నెప్పుడును తృప్తికరముగఁ

జేయజాలఁడు. బాలురను క్రమశిక్షలో నుంచుట కుపాధ్యాయునికిఁ జిత్తస్థైర్యముండవలయును. చిత్తస్థైర్యము లేనియెడల నుపాధ్యాయుడు పెట్టు నాజ్ఞలకు బాలురు కట్టుపడరు. వారు కట్టుపడక యుల్లంఘించు చున్నను, నుపాధ్యాయుఁడూరక యుండవలసి వచ్చును. అట్టిపరిస్థితిలో నుపాధ్యాయునకితర సంకటములు సైతము గలుఁగగలవు.

ఒక్కొక్కప్పుడు బాలురేదైనఁ దప్పుచేసిన యెడల నుపాధ్యాయుఁడు మీరు మఱల నీతప్పు చేసినయెడల నేను మిమ్ము నందఱిని శిక్షించెదనని యనును. బాలురా తప్పును మఱలఁ జేసినపుడుపాధ్యాయుఁడు స్థిరచిత్తుఁడు కానందున వారల దండింపక యూరకుండును. కనుక బాలురుపాధ్యాయుని మాటలను నమ్మకుందురు. కనుక నుపాధ్యాయుఁడు తానేది సంకల్పించునో దానిని తప్పక నెఱవేర్చు గుణము గలిగియుండుట మిక్కిలి యవసరము.

ప్రాథమిక పాఠశాలలలోఁ బనిచేయు నుపాధ్యాయుఁడు తానెవరిమధ్య నున్నాఁడో యాజనులకు సేవచేసెడి గుణము కలవాఁడై యుండవలయును. బడిలేని కాలమున గ్రామములోని యిండ్లకుఁబోయి బాలుర తల్లిదండ్రులతో చెలిమిచేసికొని వారు కష్టములలో నున్న యెడల వారి కష్టములను దొలఁగించుటకుఁ బ్రయాసపడవలయును. ఈయుద్దేశ్యముతో నుపాధ్యాయుఁడు క్వైనా, బోరిక్ పౌడి, టించర్ అయోడిన్, కంటి మందు, దూది, తేలుమందు మున్నగు నౌషధములను తన యొద్దనుంచుకొని స్వల్పరోగములతో బాధపడు వారికి చికిత్స చేయవలయును. అంటురోగములు, త్రాగుడు, అప్పులు, సహకార సంఘములు మున్నగు వానిని గూర్చి జనులతో ముచ్చటించి వారు బాగుపడుటకుఁ దోడ్పడవలయును.

ముఖ్యముగ నతఁడు గ్రామస్థుల యవిద్యనుగుఱించియు దాని వలన చెడుగును గుఱించియు జనులతో ముచ్చటించి గ్రామములో నిరక్షరాస్యతను బోఁగొట్టుటకు బద్ధకంకణుఁడై యుండవలయును.

ఈయుద్దేశమును సంపూర్ణముగ నెఱవేర్చుట కుపాధ్యాయుఁడు పాఠశాలయున్న గ్రామములోనే నివసింపవలయునని యొక చట్టము కలదు. పాఠశాల యొక గ్రామములోను, నుపాధ్యాయుఁడు మఱొక గ్రామములోను నున్న యెడల నతఁడు కాలపరిస్థితులనుబట్టి యప్పుడప్పుడు బడికి వేళకు సరిగా రాఁజాలకపోవును. తన గ్రామమునుండి బడికివచ్చుటకును బోవుటకును బ్రతిదినము కొంతకాలము వినియోగింపవలసి వచ్చును. అదే గ్రామములో నున్నయెడల నీ కాలమును దన పాఠములను సిద్ధపఱచుటకో మఱేదైన బాఠశాలకు సంబంధించిన కార్యములకో యుపయోగించుకొన వచ్చును. మఱియు వేఱొక గ్రామమునుండివచ్చు నుపాధ్యాయుఁడు బడిలేని కాలమున బాలుర తల్లిదండ్రులతో వారిబిడ్డలను గురించిగాని గ్రామక్షేమమును గురించిగాని సంభాషణలు సలుపఁజాలఁడు. బడి యభివృద్ధికై యూరిపెద్దలతో నాలోచనలు చేయలేఁడు. గ్రామసేవ చేయుట కతనికి వ్యవధియుండక బడిపని ముగియఁగనే తనయూరికి బోవుట కాతురపడుచుండును. కాని యుపాధ్యాయుడు గ్రామములోనుండు కక్షలలోఁ బ్రవేశింపఁ రాదు. ప్రవేశించినచో నతనిపనికి గొప్పకీడు కలుగక మానదు. రాజకీయములలో అందును ముఖ్యముగ స్థానికసంస్థల యెన్నికలలో గాని, శాసనసభల ఎన్నికలలోఁగాని జోక్యము కలిగించుకొనరాదు.

ఉపాధ్యాయుఁడు బడిలోను, బైట నాటస్థలములలోను బాలురు చేయుపనులలోఁ బ్రవేశించి వారితోఁ గలిసి పనిచేయువాఁడుగను నాడుకొనువాఁడుగను నుండవలయును. కొందఱుపాధ్యాయులు తాము పెద్దలమను భావముచేత బాలురతో నాడుకొనుటకు సంకోచింపుచుందురు. అట్టివారు బాలురకుఁ దగిన యుపాధ్యాయులుగ నుండఁ జాలరు. మఱియు నుపాధ్యాయుఁడు బడిలోని ప్రతిబాలుని యొక్క చిత్తవృత్తిని గమనించువాఁడై యుండవలయును. ఒక్కొక్క బాలుఁడు తరగతిలో నెట్లు ప్రవర్తించునదియు, నాటస్థలములో నెట్లు ప్రవర్తించునదియు గమనించి వాని మనోవ్యాపారములను గ్రహించుటకును, బాఠములను బోధించునపు డాయా బాలుర చిత్తవృత్తికిఁ దగినట్లు మార్పులు చేయుటకును బాటుపడవలయును.

ఉపాధ్యాయుని యోగ్యతలును బాధ్యతలును మిగులదొడ్డవిగ నుండవలయు ననుట నిక్కము కాని వారికిచ్చు వేతనములు సయితము వారి సుఖజీవనమునకుఁ దగినవిగ నుండవలయును. తన కుటుంబమును బోషింపఁజాలని జీతమును సంపాదించు నుపాధ్యాయుఁడు తన పనిని శక్తివంచన లేకుండఁ జేయఁజాలఁడు. కనుకనే యిప్పుడు దొరతనమువా రుపాధ్యాయులకిచ్చు గ్రాంటులను గొంతమట్టుకు హెచ్చించి యున్నారు. కాని వాని నింకను హెచ్చింపవలసి యుండును.

ఉపాధ్యాయు లందరును దమ జీవితకాలములో నెంతసంపాదించినను వృద్ధాప్యము వచ్చినప్పుడుగాని లేక హఠాత్తుగ మరణించినప్పుడుగాని తమపై నాధారపడియున్న భార్యాబిడ్డల కగచాట్లు గలుగకుండఁ గొంత జీవనాధారము గలుగునట్లు తాముసంపాదించు కాలములోనే నిలువజేసి పెట్టుకొనుటకు బ్రావిడెంటుఫండు కట్టునట్లు నిర్బంధము లుండవలయును. అంతియకాక యొకసారి పనిలోఁ బ్రవేసించిన యుపాధ్యాయుఁడు సమ్యక్కముగను శ్రద్ధగను బనిచేయునంత కాలమతనిని బాఠశాలాధికారులు పనిలోనుండి దొలగింపకుండునట్లుగూడ చట్టము లుండవలయును.

ఉపాధ్యాయుని పని:—ఉపాధ్యాయుఁడు సంవత్సరారంభముననే తనపని యంతటికిని నొక ప్రణాళికను సిద్ధముచేసి యుంచుకొనవలయుననియు, బ్రతిపాఠమునకును బోధనాక్రమ పట్టికలు వ్రాసి యుంచుకొనవలెననియు వెనుకఁ జెప్పితిమి. బాలురు బడికి, గ్రమముగ వచ్చునట్లు చేయుటకుఁ దల్లిదండ్రులతోఁ జెలిమిచేసికొనుట యవసరమనికూడఁ జెప్పితిమి. కొన్ని గ్రామములలో నుపాధ్యాయుఁడు బాలుర యిండ్లకుబోయి, బాలురను బడికిఁ బిలుచుకొని రావలసి యుండును. బాలుర తల్లిదండ్రులలో విద్యయందభిలాష లేనంత కాల ముపాధ్యాయులకీ శ్రమయుండకతప్పదు. తాను బడిలో నేర్పవలసిన పాఠముల కన్నింటికి బోధనాక్రమ పట్టికలను సంవత్సరారంభముననే వ్రాసి యుంచుకొనినప్పటికిని ఉపాధ్యాయుఁడు ప్రతిదిన

మింటియొద్ద నాదినము తాను నేర్పవలసిన పాఠములను మఱల శ్రద్ధగ జదువవలయును. పాఠమును నేర్పుటకుఁ గావలసిన యుపకరణములను సేకరించి యుంచుకొనవలయును.

తరగతిలో నుపాధ్యాయుఁడు కాలము వ్యర్థపుచ్చక పాఠమును బాలుర కర్థమగునట్లు సులభమగు మాటలతో నేర్పవలయును. నేర్పునప్పుడు ముద్దుగారుచుండు బాలురను గూర్చి విసుగుగొనక వారికి పాఠము చక్కఁగాఁ దెలియువఱకును శ్రమయని యెంచుకొనక నేర్పవలెను. మందమతులగు బాలురను జక్కఁగ నేర్పువాఁడే యుత్తముఁడగు నుపాధ్యాయుఁడు. కొందఱుపాధ్యాయులు గంటయంతయుఁ దామే మాటలాడుచు బోధించుచు బాలురకు మాటలాడుట కవకాశ మియ్యరు. అట్లుగాక బాలురను మాటలాడ నిచ్చుట, వారు తనను ప్రశ్నల నడుగునట్లు చేయుట, వారెంతవఱకు గ్రహించినారో యని దెలిసికొనుటకుఁ బ్రశ్నలడుగుట, ఇవి ముఖ్యముగ నుపాధ్యాయుఁడు గమనింపవలసిన విషయములు. చెప్పెడిపాఠములు బాలురకు విసుగు పుట్టింపరాదు. ఎట్టి పాఠమునైనను బాలుర కుల్లాసము పుట్టునట్లు నేర్పుటయే మంచి పద్ధతి. ఈవిధముగ నేర్పునుపాధ్యాయులు తప్పక తమ బాలుర కృతజ్ఞతకుఁ బాత్రులగుదురు. పాఠశాలలో నుంపఁదగిన రిజిష్టర్లు, రికార్డులు మొదలగువాని విషయమున నుపాధ్యాయుఁడు చేయవలసిన పనులు వేఱొకచోట వివరింపబడి యున్నవి.

## ప్రశ్నలు

(1) ఉపాధ్యాయవృత్తి దొడ్డదగుటకుఁ గల కారణములను వ్రాయుము.

(2) ప్రధానోపాధ్యాయున కుండవలసిన గుణలక్షణము లెవ్వి?

(3) ఏ పాఠశాలగాని యందలి ప్రధానోపాధ్యాయుని ననుసరించి యుండును. దీనిని నీ వొప్పుకొందువా? కారణములను వ్రాయుము.

(4) ప్రధానోపాధ్యాయుఁడు చేయవలసిన పనులలో ముఖ్యములైనవానిని వివరించుము.

(5) ప్రాథమిక పాఠశాలలలో పనిచేయు నుపాధ్యాయుల కుండవలసిన (1) శారీర, (2) మానసిక, (3) నైతిక యోగ్యతలను వ్రాయుము.

(6) పాఠశాల యున్న గ్రామములోనే యుపాధ్యాయుఁ డుండవలయు ననుటకు గారణములను వ్రాయుము.

(7) ఉపాధ్యాయుఁడు గ్రామమునకు సేవ చేయఁగల కొన్ని విధములను దెలుపుము.

(8) ఇద్దఱుపాధ్యాయుల నొకరు గంటసేపు తానే మాటలాడుచుఁ బాఠములను నేర్పును. రెండవ యుపాధ్యాయుఁడు బాలురు మాటలాడునట్లు చేయుచు, వారిచేతఁ గొన్ని పనులఁ జేయించును. వీరిద్దరిలో నెవరిది మంచి పద్ధతి? కారణములతో వ్రాయుము.

---

# 12. రిజిష్టర్లు, రికార్డులు

<u>ఉద్దేశములు:</u>— ప్రాథమిక పాఠశాలలో రిజిష్టరులను రికార్డులను నెందులకు వ్రాసి యుంచవలయును? రిజిష్టరులవలన ప్రయోజనము లనేకములు కలవు. ఒక బడిని స్థాపించిన కొంతకాలమున కాబడియొక్క చరిత్రఁ దెలిసికొనుటకు రిజిష్టర్లు బాగుగఁ బనికివచ్చును. రిజిష్టర్లు లేకున్నచో నాబడిలో నెప్పుడెంతమంది బాలురు చదివినదియు, నెవరు చదివినదియు, నేయే తరగతులలోఁ జదివినదియు తెలిసికొనజాలము. బడిని స్థాపించిన ప్రాంతమున విద్య వృద్ధి యగుచున్నదా? లేదా? యని కనుగొనుటకును, నట్లు వృద్ధి కాకున్నచో దానికిఁ గారణములను దెలిసికొనుటకును, పాఠశాల యెట్లు నిర్వహింపఁబడుచున్నదో తెలిసికొనుటకును; రిజిష్టర్లును, రికార్డులును మిగుల నవసరము. పాఠశాలలోని పని దినదినము సక్రమముగ జరుగుచున్నదా? లేదా? యని కనుఁగొనుటకును, బాలుర యభివృద్ధిని బరీక్షించి తెలిసికొనుటకును, రిజిష్టర్లు అవసరముగా నుండవలయును. కాఁబట్టి యుపాధ్యాయుఁడు బడి రిజిష్టర్లను జాగ్రత్తగను, యథార్థముగను ప్రతిదినమును వ్రాసి యుంచవలయును. యథార్థము గాని రికార్డులుండిన ప్రయోజనము లేదు. రిజిష్టర్లు, రికార్డుల గరిష్ట

ప్రమాణలాభమును బొందుటకవి సాధ్యములుగ నుండవలసినదే గాక, బడికి సంబంధించిన యన్నిసంగతులను దెలుపునవిగ నుండవలయును.

రిజిష్టరు లెవరు వ్రాయవలెను?:—పాఠశాలలోఁ బనిచేయు ప్రతి యుపాధ్యాయుఁడు నేవో కొన్ని రిజిష్టరులను వ్రాయవలసి యుండును. తన తరగతికిఁ జెందిన రిజిష్టరులేగాక తక్కిన రిజిష్టరులను సైతము వ్రాయుట నుపాధ్యాయుఁడు దెలిసి యుండవలయును. కనుకఁ బాఠశాలలోని ప్రధానోపాధ్యాయుడు, ప్రతి యుపాధ్యాయుడును పాఠశాలలోని రిజిష్టరు లన్నిటిని నేవో కొన్ని నెలల పర్యంతము వ్రాయుచుండునట్లేర్పాటు చేయవలయును. రిజిష్టరులు పాఠశాలయొక్కస్థితిని దెల్పగల రికార్డులు గనుక వానిని వ్రాయుటలో వ్యయమగు కాలము వ్యర్థమయినట్లు తలపరాదు. రిజిష్టరులను వ్రాయవలసిన పద్ధతులను బోధనాభ్యసన పాఠశాలలలో నుపాధ్యాయులకు నేర్పుదురు. అచ్చట వాని నశ్రద్ధగ నేర్చుకొనినవారును, క్రొత్తగ వ్రాయవలసి నట్లేర్పడిన రిజిష్టరులను వ్రాయు పద్ధతులను అందఱును ఉపాధ్యాయ సంఘసమావేశములలో నేర్చుకొనవలయును.

ప్రాథమిక పాఠశాలలలో నుండవలసిన రిజిష్టరులు:—

ఈ క్రిందఁ జూపిన రిజిష్టరులు ప్రతి ప్రాథమిక పాఠశాలలోను నుండవలసినట్లు విద్యాశాఖ వారి చట్టము:

(1) ప్రవేశము, విడుదలపట్టీ (అనుబంధము 3)
(2) విద్యార్థుల హాజరుపట్టీ (అనుబంధము 4)
(3) ఉపాధ్యాయుల హాజరుపట్టీ (అనుబంధము 5)
(4) ఉపాధ్యాయుల జీతములపట్టీ (అనుబంధము 6, 7)
(5) పరీక్షలపట్టీ
(6) దర్శకులపట్టీ (అనుబంధము 8)
(7) జరిమానాలపట్టీ (అనుబంధము 9)
(8) బాలుర చరిత్ర పత్రములపట్టీ (అనుబంధము 10)
(9) బాలురను బడికిఁ బంపనివారిపట్టీ (అనుబంధము 11)

ఇప్పుడీ రిజిష్టర్లలో నొక్కొక్కదాని యవసరము, వ్రాయ వలసిన పద్ధతిని గూర్చి కొంత తెలిసికొందము.

1. ప్రవేశము, విడుదలపట్టీ:—ఇది చాలా ముఖ్యమగుపట్టీ బాలురను బడిలో జేర్చుకొనునపుడు బాలునిగూర్చిన వివరములనీ పట్టీలో వ్రాయవలయును. వ్రాయునపుడు గమనింప వలసిన ముఖ్యవిషయము లేవనగా :

(1) పట్టణములలో బాలుని పూర్తిచిరునామా,
(2) బాలుడు పుట్టిన తేది, ఇదిచాల ముఖ్యము. బాలుని తల్లిదండ్రులుగాని, యుపాధ్యాయుడుగాని గ్రామ రెడ్డి యొద్దనుండి యీ తేదీని కనుగొని వ్రాయవలయును. ఒకసారి వ్రాసిన తరువాత దానిలో మార్పులుండరాదు. మార్పు అవసరమైనచో ప్రధానోపాధ్యాయుని చేవ్రాలుతో మార్పులుండవలయును.
(3) ప్రతి బాలునిగుఱ్చిన పూర్తివివరములను వ్రాయవలయును. కొన్ని కలములను పూర్తిచేయక విడువరాదు.
(4) బాలుడు బడివిడిచినపుడు వెంటనేయీసంగతిని, బాలుడు బడివిడుచుటకు గల కారణమును పట్టీలో వ్రాయవలయును.
(5) ఒకసారి బడివిడిచిన బాలుడు రెండవసారి పాఠశాలలోఁ జేరినయెడల వాని ప్రాతప్రవేశపు సంఖ్యను క్రొత్తసంఖ్య క్రింద వ్రాయవలయును.
(6) క్రొత్త ప్రవేశపు రిజిష్టరు డిప్యూటీఇన్‌స్పెక్టరుగారి సెలవును పొందియే వ్రాయవలయును. ఆ వ్రాయునపుడు వరుస నెంబరుల నెంతమాత్రము మార్చరాదు.
(7) పట్టీలోని రెండువైపుల పుటలలోను వ్రాయువివరములు ఒక బాలునివి యింకొక బాలునితోఁ దారు మారు కాకుండునట్లు చూడవలయును.
(8) బాలుడుబడిలోఁ జేరునపు డే పేరుతో జేరునో యా పేరుతోనే రిజిష్టరు లన్నింటిలో వానిని వ్రాయవలయును.

విద్యార్థుల హాజరుపట్టీ:— ఈ పట్టీని వ్రాయుటలో గమనింప వలసిన సంగతు లేమనగా:—

(1) బాలికల పేరులను ఎఱ్ఱసిరాతో వ్రాయవలయును.

(2) పాఠము ప్రారంభింపక పూర్వమే ఉదయము సాయంకాలము బాలుర హాజరును వేయవలయును. ఆలస్యముగా వచ్చువారిని తెలుపుటకొరకు గుర్తుపెట్టవలయును. మొదటి గంట కాగానే బడికి రానివారిని వారు రాకపోవుటకుఁగల కారణములను తగు విధమున గుర్తించి హాజరుసంఖ్యను మొత్తముచేసి పట్టీలో వ్రాయవలయును.
అప్పటికి పట్టీలో ఖాళీస్థలము ఉండరాదు.

(3) ప్రతిదినపు మొత్తమును, నెల మొత్తములను, సరాసరి హాజరుల సంఖ్యలను శుభ్రముగ సిరాతో వ్రాయవలయును.

(4) హాజరుపట్టీలో, పాఠశాలపేరు, నెలపేరు వ్రాయవలయును. బాలురు హాజరులను జరుపుగఁ జెప్పునట్లు నేర్పవలయును.

(5) ఒకనెలకంటె నెక్కువకాలము బడికి రానివారి పేరులను పట్టీలోనుండి తొలగింపవలయును.

3. ఉపాధ్యాయుల హాజరుపట్టీ:— వరుస సంఖ్య కాలములో ఉపాధ్యాయుల వరుసనెంబరును 1, 2 వారీగా వేయవలయును. ఈ నెంబరులకు ఎదురుగా ఉపాధ్యాయునిపేరు వ్రాయవలయును. ఉదయము సాయంకాలము వారి పేరున కెదురుగా తారీఖువారీగా సంతకము చేయవలెను. ఉదయము సాయంకాలముకూడ ఉపాధ్యాయుడు తన క్లాసుపని మొదలుపెట్టక పూర్వమే తాను హాజరయినట్లు హాజరుపట్టీలో సంతకము చేయవలెను. ఉపాధ్యాయులు పొడి అక్షరములతో సంతకము చేయవలెను గాని, / \ అనుగుర్తులు పెట్టకూడదు.

పాఠశాల మూయబడు దినములన్నియు ఎఱ్ఱసిరాతో మూస ప్రారంభముననే హాజరుపట్టీలో గుర్తించవలెను. ఉపాధ్యాయుడు

సెలవు బెట్టిన దినములందు సెలవు పెట్టిన తారీఖున కెదురుగా పాఠశాల హెడ్ మాస్టరు సెలవుమార్కు చేయవలయును. మాసారంభముననే ఉపాధ్యాయుల హాజరు పట్టీలో నెంబరువారీగా ఉపాధ్యాయుల పేర్లన్నియు హెడ్ మాస్టరు వ్రాయవలయును.

4 ఉపాధ్యాయుల జీతములపట్టీ:— ఈ పట్టీని వ్రాయుటలో గమనింపవలసిన విషయములు:—

(1) జీతము పుచ్చుకొన్న యుపాధ్యాయుని చేవ్రాలును, పుచ్చుకొన్న తేదీయును గుర్తింపవలయును.

(2) ఈ పట్టీని పరీక్షసమయమున ఇన్‌స్పెక్టరు గారికిఁ జూపవలసియుండును. కానఁ బ్రతి పాఠశాలకు నొక ప్రత్యేకమైనపట్టీ యుండవలయును.

(3) సర్కారు ద్రవ్యసహాయమును బొందు పాఠశాలలలో నీ పట్టీలోనే ప్రతి యుపాధ్యాయునకు రావలసిన జీతము వివరములు తెలుపుటకు ప్రత్యేకముగ రసీదుల పట్టీగాని యుపాధ్యాయుల కింకను జెందవలసిన సొమ్మును జూపు పట్టీగాని యవసరము లేదు.

5. పరీక్షల పట్టీ:—పరీక్షాసమయమున ఇన్‌స్పెక్టర్లు వ్రాయగోరు విషయములను వ్రాయుట కొక పట్టి యుండవలయును. ఈ పట్టిని జూపకున్న యెడల గ్రాంటులు వేయరు. కాబట్టి దీనిని కడు జాగరూకతతో దాఁచవలయును. ఈ పట్టి చాలకాలము ఉండవలయును గనుక మంచికాగితములను వేసి గట్టియట్టలతో బైండు చేసినదై యుండవలయును.

6. దర్శకుల పట్టీ:— పాఠశాలను దర్శించుటకుఁ బెద్దలు సర్కారుద్యోగులు వచ్చినపుడు వారు పాఠశాలను గూర్చిన తమ యభిప్రాయములను వ్రాయవలయునని ప్రధానోపాధ్యాయుడు వారికి మనవి చేయుట మంచిది.

7. జరిమానాలపట్టీ:— జీతములపట్టీలో జరిమానాల క్రింద నుపాధ్యాయుని జీతములోనుండి సొమ్ము పట్టబట్టిన యెడల దాని వివరములను, కారణములను దగిన యాధారములతో నీ పట్టీలో వ్రాయవలయును. ఉపాధ్యాయుని నేరము, దాని కాతడిచ్చిన సమాధానము, శిక్ష మున్నగు వివరములన్నియు క్లుప్తముగ నీ పట్టీలో వ్రాసి యీ పట్టీని పాఠశాల మేనేజరునొద్ద నుంచవలయును.

8. బాలుర చరిత్రపత్రములపట్టీ:—దీనిలో రెండు భాగము లుండును. ఒక భాగమునందు చరిత్రపత్రములును, రెండవ భాగమునందు పాఠశాల విడిచిపోయిన బాలుర చరిత్రపత్రముల ప్రతులును నుండును.

ఈ పట్టీని వ్రాయుటలో గమనింపదగిన విషయములు.—

(1) ఇందులోఁ జూపిన "క్వార్టర్"ను (మూడు నెలల కాలము) జనవరి, ఏప్రిలు, జూలై, అక్టోబరు ఈ నెలల మొదటి తేదీల నుండి లెక్కింపవలయును.

(2) హాజరును గూర్చిన విషయములు ప్రతి క్వార్టరు ముగిసిన పిదప వ్రాయవలయును.

(3) ఏదేని యొక క్వార్టరులో బాలుడు రెండు తరగతులలోఁ జదివి యుండుట తటస్థించినయెడల నా క్వార్టరులో నా రెండు తరగతులును వ్రాయవలయును.

(4) ఒక క్వార్టరు మధ్యలో నొక బాలుఁడు బడిలో జేరిన యెడల వాఁడు చేరినప్పటినుండియే బడిదినములు లెక్కపెట్ట వలయును.

(5) బాలుని యభివృద్ధిని నడవడిని గూర్చి వ్రాయవలసిన స్థలమును మిక్కిలి జాగ్రత్తగ వాడుకొనవలయును.

(6) బాలుఁ డొక బడి విడిచి వేఱొకబడిలో జేరినపుడా బాలుని చరిత్ర పత్రము (రికార్డుషీటు)లో నన్ని స్థలములను పూర్తిచేసి

ప్రధానోపాధ్యాయుడు రిమార్కుల స్థలములో (షీటుక్రింద కాదు) చేవ్రాలు చేసి యియ్యవలయును.

(7) రికార్డుషీట్లను ఒక బడినుండి తిన్నగా నింకొక బడికిఁ బంపరాదు. డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారి సెలవుతోనో వారి ద్వారానో పంపవలయును.

(8) వేఱొక బడినుండి వచ్చు బాలుని పక్షమున క్రొత్తరికార్డు షీటును వ్రాయరాదు. బాలుఁడు ముందు చదువుచుండు బడిలోనుండిన రికార్డుషీటును దెప్పింపవలయును.

(9) రికార్డుషీటులకొఱకు డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారికి విన్నపము వ్రాసికొనవలయును; కాని యవి వచ్చువఱకు బాలుర ప్రవేశమునాపరాదు. రికార్డుషీటులు మొదట నిర్బంధముగ బాలురను బడికిఁ బంపవలసిన ప్రదేశముల యుపయోగార్థము విధింపబడెను గాని యిప్పుడన్ని ప్రాథమిక పాఠశాలలును వానిని వాడవలసియున్నది

9. బాలురను బడికిఁ బంపనివారి పట్టీ:—నిర్బంధ విద్యావిధానమములలో నున్న ప్రదేశమందలి పాఠశాలలే యీ పట్టీని వ్రాయవలయును.

10. పాఠశాలా చరిత్రపట్టీ:— (లాగ్ బుక్కు) ఈ పట్టీలో ప్రధానోపాధ్యాయుఁడు పాఠశాలకు సంబంధించిన ప్రధానసంభవములను గూర్చి క్లుప్తముగ వ్రాయవలయును.

క్రొత్తపాఠముల ప్రణాళికలు లేదా పాఠ్యగ్రంధములు ప్రవేశపెట్టిన తేదీలు, ఉపాధ్యాయులు బడికి హాజరుగాని విషయము, పాఠశాల యితర పాఠశాలలతోఁ బోటీచేసి సంపాదించిన సర్టిఫికేటులు మున్నగు విషయములను గుఱించి యీ పట్టీలో వ్రాసియుంచుట మంచిది.

రికార్డులు:—పైఁజూపిన రిజిష్టరులేగాక ప్రతిపాఠశాలయు వ్రాసియుంచవలసిన మఱికొన్ని రిజిష్టర్లు, రికార్డులు నున్నవి. వానిని గుఱించి కూడఁ దెలిసికొనవలయును.

పాఠశాలకు బోఁదగిన వయస్సుగల పిల్లల జనాభాపట్టీ:—

ఈ పట్టీయు మొదట నిర్బంధ విద్యావిధాన మున్న పాఠశాలలే యుంచఁదగినదని యేర్పఱచిరి. కాని యిప్పు డున్న ప్రాథమిక పాఠశాలలు నుంచవలసి నట్లేర్పఱచి యున్నారు. ఒక గ్రామములో బడికి రాఁదగిన వయస్సులోనున్న బాలబాలికలందఱి పేరుల నీ పట్టీలో వ్రాయవలయును. కాఁబట్టి యీ గ్రామములో నింకను బడికి రాకయున్న బాలబాలికలెందఱో కనుఁగొనుటకు వీలగుచున్నది. ఇట్లు తెలిసికొన్న పిదప బాలురను బడికిఁ బంపకుండనుండు తల్లిదండ్రుల నుపాధ్యాయులు దర్శించి (స్త్రీయుపాధ్యాయు లీ పని చేయరాదు.) వారు తమ బిడ్డలను బడికిఁ బంపకపోవుటకుఁ గారణములను తెలిసికొని వారిని బడికిఁ బంపునట్లు తల్లిదండ్రులను ప్రోత్సహించవలయును. బడివేళల ననుకూలముగ నుండుటచే కొందఱు బాలురు బడికి రాకుండ నుండిన యెడల వారినిగూర్చి బడివేళలలో గొంత మార్పు చేయవచ్చును.

ఈ పట్టీవలన నెంతమంది బాలురు చదువు ముగింపకయే బడి విడుచుచున్నదియుఁ దెలిసికొనవచ్చును.

బాలుర తల్లిదండ్రులు తమ బిడ్డల వయస్సునుగూర్చిన వివరములు తెలుప నిరాకరింతురు. కనుక నిది సులభమగుపని కాదని కొంద ఱుపాధ్యాయు లందురు కాని సామాన్యముగ నుపాధ్యాయులు సవినయముగ దల్లిదండ్రులను సమీపించినప్పు డిది యంత కష్టమగు పని కాదని యనుభవమువలనఁ దెలియుచున్నది. ఈ విషయములో నుపాధ్యాయుఁడు గ్రామ రెడ్డియొక్క స్నేహము సంపాదించుకొనుట మిక్కిలి ప్రయోజనకరముగ నుండును.

ఈ పట్టీని వ్రాయవలసిన విధమునందు గ్రామములోను, పట్టణములోను గొన్ని భేదములుండును. ఇందు వ్రాయు సంగతులు యథార్థముగ నుండవలయును.

మార్కులపట్టీలు, పైతరగతులకెక్కిన బాలుర పేర్లజాబితాలు విడిచిపెట్టబడిన విద్యార్థుల పట్టీలు:—ఈ మూడుపట్టీలును బాలుర విద్యాభివృద్ధిని జూపఁగల పట్టీలు. మార్కులను విడికాగితములమీఁద వ్రాసి యుంచరాదు. గట్టిగా బైండుచేసిన నోటుబుక్కులో వానిని వ్రాసి యుంచవలయును. తరగతి మార్కులును, దసరా క్రిస్మసు పండుగలప్పుడు జరుగుపరీక్షల మార్కులును, సంవత్సరాంతపు బరీక్ష మార్కులును, విశదముగ వ్రాసి యుంచవలయును. డిప్యూటీఇన్‌స్పెక్టరుగారు బడిపరీక్షకు వచ్చినపుడు వీనిని వారికిఁ జూపవలయును.

పైతరగతులకు బాలుర నెక్కించినవిధమును సూచించు జాబితాలు విడికాగితములమీఁద నుండవచ్చును. కాని యీ విడికాగితముల నొకటిగా జేర్చి గట్టిగా కుట్టించవలయును. ఈ పట్టీలను ప్రతి బాలుని విషయమునకుఁ గనీస మయిదేండ్లఁ పర్యంతము వ్రాసి యుంచవలయును. కనుక దగిన పట్టీలనే మార్కులు వ్రాయుట కుపయోగింప వలయును.

ఒక తరగతిలో విడిచిపెట్టఁబడిన విద్యార్థుల సంఖ్యను జూపు పట్టీమూలమున నెందఱు విద్యార్థులు పరీక్షలలో నెగ్గిరో యనియు, మధ్యలో నెంతమంది చదువు చాలించుకొనిరనియుఁ దెలిసికొనవచ్చును. ప్రతియుపాధ్యాయుఁడును దనతరగతిబాలురలో నెవ్వరెట్లు రెండవయేఁడు చదువుచున్నారో చూపు పట్టీని సంవత్సరారంభముననే వ్రాయించవలయును. సామాన్యముగ నొక బాలుఁడొక సంవత్సరముకంటె నెక్కువకాలమొక తరగతిలో గడపరాదు. ఒకొక్క విద్యార్థి యట్లెక్కువ కాలము గడుపుటకు వానిని బరీక్షలకుముందు బడిలోఁ జేర్చుకొనుటయే కారణమని కొందఱుపాధ్యాయులు చెప్పుదురు. అట్టిచో నా బాలుని పరీక్షలకు ముందుగఁ జేర్చికొనియుండరాదు.

ఒకొక్కప్పుడు బాలురు బడికిఁ గ్రమముగ రాకపోవుటవలనఁ బాఠములను నేర్చుకొనజాలక యొక సంవత్సరముకంటె నెక్కువ

శాల మొక్కటె తరగతిలోనే యుందురు. ఉపాధ్యాయుఁడట్టి బాలుర విషయము తల్లిదండ్రులతో మాటలాడి బాలుర విద్య భంగముకాని విధమున వాఁడు బడికివచ్చులాగునఁ జేయుచుండవలయును. బడికి క్రమముగా వచ్చు బాలురు రెండేండ్లొక తరగతిలోనున్న యెడల నది యుపాధ్యాయుని లోపముగా నెంచవలసియుండును.

చదువుముగింపకయే కొంతమంది బాలురు బడినివిడుచుట నుపాధ్యాయులు గమనింపవచ్చును. అందులకుఁ గారణము లేవియని యుపాధ్యాయులు తెలిసికొనవలయును. కొందఱుబాలురు వయస్సు మీరిన తర్వాత బడిలోఁ జేరినందున వారు మధ్యలోనే బడి విడుచుచుందురు. కావునఁ దగినవయస్సుననే బాలురను బడికిఁ బంపుడని యుపాధ్యాయులు తల్లిదండ్రులను హెచ్చరించుచుండ వలయును. బడికిఁ గ్రమముగ రాక, పాఠములను నేర్చుకొనక, యొక్కొక్క తరగతిలో రెండేండ్లుండుటవలన గొందరు బాలురు విసిగి బడిచాలించుకొందురు. బడివేళలు తమకు సరిపోనందున గొందఱును, ఇంటియొద్దఁ దమ తల్లిదండ్రులకు సాయము జేయుటకై కొందరును, బడి చాలించుకొనువారు గలరు. ఇట్లు బాలురు బడిచాలించుకొనుటవల్ల వారిని గుఱించి వ్యయముచేసిన డబ్బును, నుపాధ్యాయుల శ్రమయు వ్యర్థమై పోవును. కనుక నుపాధ్యాయుఁడు కారణముల నన్నింటిని గమనించి బాలుర తల్లిదండ్రులతో ముచ్చటించి తమ చేతనైనంతమట్టునకు బాలురు చదువు ముగింపకయే బడివిడువకుండునట్లు చూడవలయును.

విద్యావేతనముల రిజిష్టరు:—పాఠశాలలోఁ జదువుజాతులకు చెందిన కొంతమంది బాలురకు దొరతనము వారు ద్రవ్యసహాయము చేయుదురు. అట్టిసహాయము పొందుట కర్హులెవరని యుపాధ్యాయుఁడు గమనించి యట్టి బాలురపక్షమున ఇన్స్పెక్టరుగారికి దరఖాస్తుల నంపవలయును. వారిచ్చు సొమ్మును వారికందజేసినట్లు చూపుట కీపట్టీ నుంచవలయును.

బడిలోని సామానులు, పుస్తకములు, బోధనోపకరణములు వీనిని అనగా సర్కారుసహాయముతో గొనిన వానిని వ్రాసియుంచుట

కొక పట్టీ యుండవలయును. (అనుబంధము మూడున్ను) బడి బదిలీ కాలమున నిది డిప్యూటీ ఇన్స్పెక్టరుగారికిఁ జూపఁబడవలయును.

బడిలోని వస్తువులజాబితా యని వేఱొక పట్టీ యుండవలయును. దీనిలో బడియందలి వివిధములగు వస్తువులు నొక్కొక్క రకమున కెన్నియున్నదియు వ్రాసి యుంచవలయును.

ప్రకటనల పుస్తకము:— ప్రధానోపాధ్యాయుఁడు పాఠశాల లోనివారికిఁ బంపు ప్రకటన లన్నియు నిందులో నుండవలయును.

ఉత్తరప్రత్యుత్తరముల కట్ట:— ప్రధానోపాధ్యాయుఁడు బడి మేనేజరునకుఁ గాని డిప్యూటీ ఇన్స్పెక్టరునకుఁ గాని వ్రాయు లేఖల ప్రతులను, వారియొద్దనుండి వచ్చు నుత్తరములును; బడికి సంబంధించిన యితరములైన ఉత్తర ప్రత్యుత్తరములును నిందులో నుండవలయును.

ప్రావిడెంటుఫండు చందాలపట్టీ:— పాఠశాలలోని యుపాధ్యాయులు ప్రతినెలకుఁ దమతమ ప్రావిడెంటు ఫండునకుఁ జెల్లించు మొత్తములును, మేనేజిమెంటువారు చెల్లించు మొత్తములును తపాలాఫీసు బ్యాంకిలోఁ జెల్లింపబడినవని చూపు ముద్రగల పట్టిక లీపట్టిలో నుండవలయును. వీనినన్నింటిని భద్రముగాఁ గుట్టి యుంచవలయును. ప్రావిడెంటు ఫండునకుఁ జెందిన యితర పట్టీలుకూడఁ గొన్ని యున్నవి. ఇవి యన్నియు మేనేజరునొద్ద నుండును.

కాలనిర్ణయ పట్టికలు:— ఇవి ప్రతి పాఠశాలలో నుండవలయును. ప్రతి తరగతి గదిలోను నాతరగతి బడిదినములలో నేగంట నేపని చేయవలసినదియు నీ పట్టిక చూపును. అన్నితరగతులకుఁ జెందిన కాలనిర్ణయ పట్టికలు ప్రధానోపాధ్యాయుని యొద్ద నుండవలయును.

పాఠ్యగ్రంథములపట్టీ, పాఠ్యప్రణాళిక (సిలబసుల) పట్టీ:— పాఠశాలలో నొక్కొక్క తరగతి యొక్కొక్క పాఠమున కేయే

గ్రంథములు చదువుచున్నదియు మొదటివట్టి చూపును. ఒకొక్క పాఠములో నేయే విషయములను బోధింపవలసినదియు పాఠ్యప్రణాళిక తెలియఁ జేయును.

ఆదాయ వ్యయముల పట్టిక:— ఇది యన్ని పాఠశాలలలో నవసర ముండకపోవచ్చును. దీనిలోఁ బాఠశాలకు వచ్చు సొమ్మెంత యైనదియు, నది యేవిధముగ వ్యయమైనదియుఁ జూపు వివరము లుండును.

సంవత్సరము పొడుగునను బడిలెక్కలను జూపు పత్రములు (సంవత్సరపు రిటర్నులు) సామాన్యముగఁ బ్రతి బడినుండియు సిద్ధముచేసి ఉపాధ్యాయులు డిప్యూటీ ఇన్‌స్పెక్టరునకు బంపవలసియుండును. వారు సిద్ధముచేసిన ప్రతి పత్రికయొక్కయుఁ బ్రతి నొకదానిని దమ పాఠశాలలో తాముంచుకొనవలయును.

బడి రిజిష్టరు, రికార్డులు చాల ముఖ్యములగు గ్రంథములగుట చేత వాని నుపాధ్యాయులు బలమగు సినుపరేకు పెట్టెలోనుంచి భద్రము చేయవలయును. అట్లుంచినచో నవి చెదలు, చిమ్మెటలు మొదలగువాని కాహారము కాకుండును.

---

## ప్రశ్నలు

(1) పాఠశాలలలో రిజిష్టర్లు, రికార్డులు, వీని నెందుల కుంచవలయును?

(2) ప్రవేశము విడుదల పట్టియొక్క ప్రాముఖ్య మేమి? ఒక విద్యార్థియొక్క నిశ్చయమైన పట్టిక లేదని యుపాధ్యాయు డెట్లు సంపాదింప గలడు?

(3) ఇరువదిమంది బాలురుగల యొక తరగతికిఁ బ్రవేశము విడుదల పట్టిని సిద్ధము చేయుము.

(4) ఒక బడిలోని బాలుఁడు వేఱొక పాఠశాలలోఁ జేరఁదలచినప్పు డతఁడెట్టి పత్రికను దాను జేరఁగోరుచున్న పాఠశాలలో జూపవలయును? దానిని దెప్పించుకొనఁగల విధ మేది?

(5) ఇష్టీవయస్సులో నున్న పిల్లల జనాభా పట్టీవలని లాభము లెవ్వి?

(6) హాజర్ల పట్టీలవలని ప్రయోజనములను దెలుపుము?

# 13. విద్యావిషయిక శాసనములు

## మద్రాసురాజధానిలోని ప్రాథమికవిద్య

1. ప్రాథమిక పాఠశాలల యధికారులచేతను (మేనేజిమెంటు) 2. విద్యావిషయిక సలహా సంఘములచేతను (అడ్వైజరీ కమిటీలు) 3. విద్యాశాఖకుఁ జెందిన ఇన్స్పెక్టర్ల చేతను నిర్వహింపబడు చున్నది.

ఇట్లు ముత్తెఱంగులైన నిర్వాహకులును దొరతనమువారిచేతఁ జేయఁబడిన శాసనములు, నిబంధనలు, విధులు, చట్టములు వీని ననుసరించి ప్రాథమికవిద్యను నడుపవలసి యున్నారు. ఆశాసనములును, విధులును :

(1) మద్రాసు ఎడ్యుకేషనల్ రూల్సులోను,
(2) 1920 సంవత్సరపు మద్రాసు విద్యావిషయిక శాసనములోను,
(3) పై విద్యాశాసనమునకు సంబంధించిన చట్టములలోను,
(4) ప్రాథమిక పాఠశాలల 'రికగ్నిషన్ అండ్ ఎయిడ్' ను గురించి 1939 సంవత్సరపు ఆగష్టులో వెలువడిన ప్రభుత్వపు నిబంధన లోను,
(5) ద్రవ్యసహాయమును గూర్చిన నిబంధనావళిలోను,
(6) పాఠశాలల పరీక్షల నిబంధనావళిలోను నున్నవి. వీని నన్నింటిని గ్రంథమునఁ జర్చించుట కవకాశములేదు. కనుక వానిలోఁ బ్రధానములయిన చట్టములుమాత్ర మిచ్చుటఁ బేర్కొనబడి యవసరమయిన చోటులలో నట్టి చట్టముల యావశ్యకతను గుఱించి తెలియఁజేయ బడును.

### 1. సామాన్య శాస్త్రములు

1. మద్రాసురాజధానిలోని పాఠశాలలన్నియు 'పబ్లికు' పాఠశాలలనియు, 'ప్రయివేటు' పాఠశాలలనియు రెండు విధములు,

పబ్లికు పాఠశాలలనఁగా దొరతనమువారు విధించిన నియమముల ననుసరించి విద్యావిధానమును సాగించునవి దొరతనమువారి నియమముల ననుసరింపనివి ప్రయివేటు పాఠశాలలు. పబ్లికుపాఠశాలలు దొరతనమువారియొక్కగాని, స్థానికసంస్థలయొక్కగాని యాజమాన్యమున సాగుచున్నయెడల నవి పబ్లికు మేనేజిమెంటుక్రింద నున్నవనియు, నేదో యొక స్వతంత్రసంఘముగాని, వ్యక్తిగాని వానిని నడుపుచున్నయెడల నది ప్రయివేటు మేనేజిమెంటు క్రింద నున్నవనియుఁ జెప్పఁబడును.

2. రాజధానిలోని విద్యయంతయుఁ గళాశాల విద్యయనియు, ఉన్నత విద్యయనియుఁ, బ్రాథమిక విద్యయనియు మూఁడు భాగములు. మొదటిది కళాశాలలలోను, రెండవది యున్నత పాఠశాలలలోను, మూఁడవది ప్రాథమిక పాఠశాలలలోను నడుపబడుచున్నవి. ప్రాథమిక పాఠశాలలనఁగా బ్రాథమికవిద్యనుమాత్రము గఱపుచున్నవి. ఇట్టి పాఠశాలలలో నొకటినుండి తొమ్మిదివఱకుఁ దరగతు లుండవచ్చును.

3. ఈ పాఠశాలలలో విద్యాశాఖవారు నిర్ణయించిన ప్రణాళికల ననుసరించి విద్య నేర్పఁడవలయును.

4. పబ్లికు మేనేజిమెంటు క్రింద నున్న పాఠశాలలలో నేదో యొక మతమును మాత్రము బోధించు మతవిద్యను నేర్పరాదు. కాని కొన్ని నియమముల ననుసరించి యిట్టి విద్య సాగుట కేర్పాటు లున్నవి.

5 సామాన్యముగ ముప్పదిమంది విద్యార్థులు గల యొక్కొక్క తరగతి కొక్కొక్కరు చొప్పున నుపాధ్యాయు లుండవలయును. ముప్పదియైదుగురుకంటె నెక్కువమంది విద్యార్థులున్నచో నిద్దఱుపాధ్యాయు లుండుట మంచిది.

6. పబ్లికు మేనేజిమెంటు క్రింద నున్న ప్రాథమిక పాఠశాలలో నీ క్రింది బడిజీతములను వసూలుచేయవచ్చును.

| | నెలకు బాలురకు | బాలికలకు |
|---|---|---|
| మొదటితరగతి | 0-1-0 | |
| రెండవ ,, | 0-1-0 | 0-0-6 |
| మూడవ ,, | 0-2-0 | |
| నాల్గవ ,, | 0-3-0 | 0-1-0 |
| ఐదవ ,, | 0-4-0 | |
| ఆఱవ ,, | 0-6-0 | |
| ఏడవ ,, | 0-7-0 | 0-2-0 |
| ఎనిమిదవ ,, | 0-8-0 | |

జిల్లావిద్యాశాఖాధికారి యనుమతితో పై రేట్లను మార్చవచ్చును. మహమ్మదీయుల నుండియు, నిమ్నజాతుల నుండియు, పైనజూపిన రేట్లలో సగముమాత్రము వసూలుచేయవచ్చును.

7. టీకాలు వేయించుకొని యుండని విద్యార్థులను బడిలో జేర్చుకొనరాదు.

8. విద్యార్థులు రాజకీయములలోఁ బ్రవేశింపరాదు. విద్యార్థులను సద్వృత్తియందుఁ బెంచుటకుఁ బాఠశాలాధికారులు తగిన చట్టములను జేసి యములుజరుపవచ్చును. తప్పుచేసినవారిని దండించుటకు సైతము చట్టములను జేయవచ్చును. విద్యార్థులను తప్పుత్రోవలలో నడపించు యుపాధ్యాయులు దండనకుఁ బాత్రులగుదురు.

9. స్థానిక సంస్థలకుఁ బ్రాథమిక విద్యావిధి యొకటి యుండవలయును. దానికిఁ గొన్ని నియమముల ననుసరించి పన్నుల మూలమునను, బడిజీతముల మూలమునను, దొరతనము వారిచ్చు సొమ్ము మూలమునను ధనము లభించును. ఈ ధననిధినుండియే స్థానికసంస్థలు ప్రాథమిక విద్యను బోషింపవలయును.

10. ప్రయివేటు మేనేజిమెంటు క్రిందనుండు ప్రాథమిక పాఠశాలలకు సర్కారునుండి ద్రవ్యసహాయము కొన్ని చట్టముల ననుసరించి దొరకును. ఆ చట్టములు వేఱొకచోట జెప్పఁబడినవి.

11. తాలూకావిద్యావిషయికసలహా సంఘములు:—పాఠశాల లెచ్చట స్థాపింపవలయును. ఏపాఠశాల కెట్టి గ్రాంట్యుసహాయ మియ్యదగును. అను విషయము ను సర్కారు విద్యాశాఖాధికారులే నిశ్చయము చేయవలయును. కాని యీవిషయములలో వారికి సలహా నిచ్చుటకును, తాలూకాలోని ప్రాథమిక విద్యను వృద్ధిబొందించుట కును ప్రతితాలూకాలోను విద్యావిషయికములగు సలహాసంఘము లేర్పడియున్నవి. ఆ సలహాసంఘములకు తాలూకాలోని శాసన సభా సభ్యులును, జిల్లాబోర్డుప్రసిడెంటుగాని లేక వైస్ ప్రసిడెంటుగాని యొకరును, తహసీలుదారును, డిప్యూటీ ఇన్‌స్పెక్టరును, కలెక్టరు గారిచే నియమితులైన మఱికొందరును సభ్యులుగా నుందురు. డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారే దీనికిఁ గార్యదర్శిగా నుందురు.

12. ఒకపాఠశాలలో నొకదినము కనీస మయిదు గంటల కాలము పాఠశాలపని జరుగనిచో నాదిన మాపాఠశాలకు "సంపూర్ణ పాఠశాలాదినము" కాఁజాలదు. కాని, ఒక్కొక్కసారి రెండున్నర గంటలకాలము చొప్పున రెండుదినములు జరిగిన పని యొకసంపూర్ణ పాఠశాలాదినముగా నెంచబడును. చిన్నతరగతులలో బడికాలమందు దగిన విశ్రాంతియుండవలయును ప్రతిపాఠశాలయు సంవత్సరమునకు 220 దినములు బడిపని చేయవలయును. ఏదేని కారణముచేత బడి మూసివేసిన యెడల నాసంగతి ఇన్‌స్పెక్టరుగారికిఁ దెలుపవలయును.

13. పాఠశాలలో నొక్కొక్క విద్యార్థికి 9½ చదరపుటడుగుల చొప్పునఁ గూర్చుండుస్థల ముండవలయును. పాఠముల బోధనమునకు బడిలోఁ దగిన యుపకరణము లుండవలయును.

14. విద్యార్థుల బడివయస్సునుగూర్చిన నియమము:

మహమ్మదీయ బాలురకు 6 నుండి 13 ఏండ్లవరకుగాని 5 వ తరగతి దాటువఱకుగాని,

మహమ్మదీయేతరులకు 6 నుండి 12 ఏండ్లవరకుగాని, 5వ తరగతి దాటువరకుగాని,

మహమ్మదీయ బాలికలకు 6 నుండి 11 ఎండ్లవఱకుగాని, 5 వ తరగతి ముగించువఱకుగాని,

మహమ్మదీయేతర బాలికలకు 5 నుండి 10 ఏండ్ల వఱకుగాని 5 వ తరగతి ముగించువఱకుగాని యుండవలయును. విశేష సందర్భములలో విద్యాశాఖాధికారి యీవయస్సులను మార్పుచేయవచ్చును.

## 2. పాఠశాలల 'రికగ్నిషన్'కు సంబంధించిన చట్టములు

1. పాఠశాలలను నూతనముగ నొకచోట స్థాపించుటకుఁగాని ప్రాతపాఠశాలలలో నొకతరగతిని క్రొత్తగఁ జేర్చుటకుఁగాని యనుమతి నిచ్చుటకును, దానికి ద్రవ్యసహాయ మిచ్చుటకును నధికారము జిల్లాలోని విద్యాశాఖాధికారులకుండును. ఈవిషయమున తాలూకా విద్యావిషయిక సలహాసంఘములు విద్యాధికారులకు సలహా నియ్యవచ్చును. (వీని నిర్మాణము పైనఁ జెప్పబడినది.)

2. ఏదైన నొకప్రదేశమునఁ గావలసినన్ని ఎయిడెడ్ పాఠశాలలుండినయెడల పాఠశాలలను స్థాపించుటకు స్థానిక సంస్థల కనుమతి యియ్యఁబడదు. అట్లే యొకప్రదేశమునఁ గావలసినన్ని పాఠశాలలున్నప్పుడచ్చట నూతనముగ నొకపాఠశాలను స్థాపించుటకు ప్రైవేటు మేనేజిమెంటున కనుమతియియ్యఁబడదు. ఇన్‌స్పెక్టర్ల సెలవు పొందనిదే యొక పాఠశాలలో నదనముగఁ దరగతుల నేర్పఱుపరాదు.

3. నూతనముగఁ బాఠశాలను స్థాపింపఁగోరువారు జిల్లా విద్యాశాఖాధికారిగారికి డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారిగుండా తమ దరఖాస్తు నంపుకొనవలయును. ఆయన దానిని దనయభిప్రాయములతో సలహా సంఘకార్యదర్శి కంపును. ఆయన దానిని సలహా సంఘము నెదుటఁ బెట్టును. వారికిని డి. ఇ. ఓ. గారికిని నభిప్రాయభేదములు కలిగిన యెడల నది డైరెక్టరుగారిచేఁ బరిష్కారము చేయఁబడును.

4. పాఠశాలను స్థాపించిన నాఁటినుండియు దానికి రికగ్నిషను ఇయ్యబడును. కాని పాఠశాలను స్థాపించుటకుఁ బూర్వము విద్యాధికారుల యనుమతిఁ బొందకుండినను, లేదా కొన్ని జాతుల విద్యా

ర్థుల కందుబాటులో లేనిచోటున నీ పాఠశాలయున్నను దానికి రికగ్నిషన్ ఇయ్యఁబడదు.

5. తాత్కాలికముగ రికగ్నిషన్ పొందిన వారా తాత్కాలికపు రికగ్నిషన్ పరిమితి పూర్తికాకమునుపే మఱల రికగ్నిషన్ కొఱకు దరఖాస్తు చేయవలయును.

6. పోషక పాఠశాలలలోఁ (ఫీడిరుస్కూల్సు) దప్ప ప్రతి ప్రాథమిక పాఠశాలలోను కనీసము మొదటి యయిదు తరగతు లుండవలయును. అయిదవ తరగతికిఁ బైతరగతులలో నొక్కొక్క దానికిని ప్రత్యేకపు రికగ్నిషన్ ఉండవలయును.

7. రికగ్నిషన్ ఈక్రింది నియమముల ననుసరించియుండును.

ఉపాధ్యాయులు సామాన్యముగ బోధనాభ్యసన శిక్షణమును బొందినవారై యుండవలయును. అయిదవ తరగతి యున్నబడులలోఁ బ్రధానోపాధ్యాయుఁడును, 6, 7, 8 తరగతుల యుపాధ్యాయులును సెకండరీ ట్రెయినింగు పొందినవారై యుండవలయును. ఉపాధ్యాయ పదవికిఁ దగనివారిని బడిలో నుపాధ్యాయులుగ నుండనిచ్చిన యెడల నట్టి బడికి డైరెక్టరుగారు రికగ్నిషన్ యియ్యరు. లేదా ఉన్నచోట గొట్టివేయుదురు.

8. ప్రతి యుపాధ్యాయునకు నొక 'టీచర్సు సర్వీసు రిజిష్టరు' ఉండవలయును. దానిలో నతని యోగ్యతలు, పనిని గూర్చిన షరతులు, జీతముల వివరము ఇవి వ్రాసి యుంచఁబడవలయును. వీనిలో డిప్యూటీ యిన్స్పెక్టరుగారు సంతకము చేయవలయును. ప్రావిడెంటు ఫండునకును, జరిమానాలకును దప్ప మఱి దేనికిఁగాని యుపాధ్యాయుని జీతమును గోయరాదు.

9. పాఠ్యగ్రంథ నిర్ణాయక సంఘమువారి యనుమతిని బొందిన వానినే తప్ప నితర గ్రంథములను పాఠశాలలలోఁ పాఠ్యగ్రంథములుగ నుపయోగింపరాదు. మతబోధ కుపయోగించు గ్రంథముల నీ

నియమము బాధింపదు. పాఠశాలలో నేయే తరగతుల కేయేగ్రంథ ములను పయోగించు చున్నదియు డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారికి సంవత్సరారంభముననే తెలుపవలయును. పాఠ్యగ్రంథములను రెండేండ్లకు లోపుగ మార్చరాదు. మార్చవలయుచో జిల్లావిద్యాధికారి యనుమతి బొందవలయును.

10. పాఠశాలలో నుంచవలసిన రిజిష్టరులను గుఱించియు బాలురను బడిలోఁ జేర్చుకొనుటను గూర్చియు గల నియమములు వేఱొకచోట వివరింపబడియున్నవి.

11. అయిదవతరగతిగాని, యంతకంటె హైతరగతిగాని ముగించిన విద్యార్థి కోరినచో డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారు డైరెక్టరుగారి నియమముల ననుసరించి యట్టి విద్యార్థికి లీవింగు సర్టిఫికేటు నియ్యవచ్చును.

12. పాఠశాలలోఁ బాఠములు బోధన బాలుర మాతృభాష లోనే జరుగవలయును. పాఠశాలలో నేర్పు పాఠములు దొరతనము వారు ప్రచురించిన ప్రణాళిక ననుసరించి యుండవలయును.

13. కులమునుబట్టి కొందరు విద్యార్థులను జేర్చుకొన నొల్లని పాఠశాలలయొక్కయు, నిమ్నజాతులకుఁ జెందిన విద్యార్థులు లేని పాఠశాలలయొక్కయు, సర్కారు చట్టముల ప్రకార ముపాధ్యాయులకు ప్రావిడెంటుఫండు నేర్పఱుప నొల్లని పాఠశాలల యొక్కయు సర్వీసు రిజిష్టరులోఁజూపినప్రకార ముపాధ్యాయులకు జీతములియ్యని పాఠశాలలయొక్కయు రికగ్నిషను కొట్టివేయఁబడును.



## ద్రవ్యసహాయమును గూర్చిన చట్టము

1. గ్రాంటు వివరము:—

| | సంవత్సరమునకు రేటు | |
|---|---|---|
| | ఉపాధ్యాయ శిక్షణము పొందనివాఁడు | ఉపాధ్యాయ శిక్షణము పొందినవాఁడు |
| లోయర్ గ్రేడ్ ఉపాధ్యాయుఁడు | రు 6[illegible]-0-0 | రు 108-0-0 |
| హయ్యర్ గ్రేడ్ ,, | రు 108-0-0 | రు 15[illegible]-0-0 |
| సెంకండరీ గ్రేడ్ ,, | రు 114-0-0 | రు 212-0-0 |
| ఎల్. టి, గ్రేడ్ ,, | రు 212-0-0 | రు 272-0-0 |

ఉపాధ్యాయశిక్షణము పొందినవాఁడనగా దొరతనమువారి "ట్రెయినింగుస్కూలు లీవింగు సర్టిఫికెటుపరీక్ష"లోఁ గృతార్థుఁడైన వాఁడని యర్థము. లేదా యూనివర్సిటీవారి ఎల్. టి. పరీక్షలో, గృతార్థుఁడైనవాఁడని యర్థము. పైనఁజూపిన గ్రాంటులకు 'అసెస్మెంటు గ్రాంటు లనిపేరు.

2. ఏబడిలోఁగాని బాలుర మొత్తపు సరాసరి దిన సంఖ్య యిరువదికంటెఁ దక్కువైనచో నాబడికి గ్రాంటు లేదు.

ఒకరికంటె నెక్కువమంది యుపాధ్యాయులుండు బడిలో సరాసరి హాజరుసంఖ్యలోని ప్రతి ఇరువదిమంది విద్యార్థులకును నొక యుపాధ్యాయునికి గ్రాంటు ఇయ్యఁబడును.

ఒక్కరికంటె నెక్కువమంది యుపాధ్యాయు లుండుబడిలో సరాసరి హాజరుసంఖ్యలోని ప్రతి యిరువదిమందివిద్యార్థులకు నొక యుపాధ్యాయునికి గ్రాంటు ఇయ్యఁబడును. సరాసరి హాజరు సంఖ్య యిరువదియైనచో 1¼ ఉపాధ్యాయులకును, ముప్పదియైనచో 1½ ఉపాధ్యాయులకును ఈచొప్పున గ్రాంటు వేయఁబడును. ఈచట్టము ననుసరించి గ్రాంటును వేయునపుడు 4, 5 తరగతులలోని ప్రతియిద్దఱు బాలురను ముగ్గురుగా లెక్కింపఁ బడుదురు. కాని రెండేండ్ల కంటె

నెక్కువ కాల మొకేతరగతిలో నుండిన బాలురను, నయిదేండ్ల కంటె తక్కువ వయస్సుగల బాలురను ఈ లెక్కలో జేర్పబడరు.

3. గ్రాంటు పొందుట కర్హత యున్న సంఖ్యకంటె నెక్కువ మంది యుపాధ్యాయు లొకబడిలో నున్న యెడల వారి -నీ క్రింది వరుసప్రకారము గ్రాంటున కర్హత లేకుండ చేయవలయును.

(ఎ) ట్రెయినింగు పొందని లోయర్ గ్రేడ్ ఉపాధ్యాయుడు
(బి) „ „ హయ్యర్ గ్రేడ్ „
(సి) „ పొందిన లోయర్ గ్రేడ్ „
(డి) „ పొందని సెకండరీ గ్రేడ్ „
(ఇ) „ పొందిన హయ్యర్ గ్రేడ్ „
లేదా పట్టపరీక్షనిచ్చిన ట్రెయినింగు పొందని యుపాధ్యాయుడు.
(ఎఫ్) ట్రెయినింగు పొందిన సెకండరీ గ్రేడ్ ఉపాధ్యాయుడు.
(జి) ఎల్. టి. ట్రెయినింగు పొందిన యుపాధ్యాయుడు.

4. ఏదేని యొక పాఠశాలలో

(ఎ) ఏర్పాటులు, క్రమశిక్ష, పాఠముల బోధన, విద్యార్థులు కూర్చుండుస్థలము, బోధనోపకరణములు వీనియందు లోపములున్న యెడలను,
(బి) విద్య ముగింపకయే విద్యార్థులు బడి చాలించుకొనినను, లేదా యొకే తరగతిలో నొకటికంటె నెక్కువ సంవత్సరములు బాలు రున్నను,
(సి) బడిదినములు చాలకపోయినను,
(డి) టీకాలు వేయించుకొనని బాలురు బడిలోనున్నను,
(ఇ) రాజకీయసభలకు బడికట్టడముల నుపయోగించినను,
(ఎఫ్) పాఠ్య నిర్ణాయకసంఘమువారి యామోదమును బొందని గ్రంథములను బడిలో వాడుచుండినను,

(జి) బాలికాపాఠశాలలోఁ బురుషు లుపాధ్యాయులుగాఁ బనిచేయు చున్నను,

ఇట్టి పాఠశాలకు రావలసిన గ్రాంటులో నొక నాలుగవ వంతు వఱకు గ్రాంటును జిల్లా విద్యాశాఖాధికారిగారు తగ్గింపవచ్చును.

5. ఏదేని యొకపాఠశాలలోని రిజిష్టరులో నబద్ధమును వ్రాసినను, బాలుర హాజరును గుఱించిగాని, యుపాధ్యాయులను గుఱించి గాని యసత్యములను వ్రాసినను నట్టి పాఠశాలకు రావలసినగ్రాంటులో సగమువఱకు విద్యాశాఖాధికారిగారు తగ్గింపు చేయవచ్చును.

6. ఒక పాఠశాలలోని బోధనాపద్ధతులు మిగుల శ్రేష్ఠముగ నుండినను, శరీరవ్యాయామపు టేర్పాటులు చక్కనివైనను, బాలురను వారి భావిజీవితములకు సిద్ధముచేయు వృత్తిశిక్షణ ముండినను నట్టిపాఠశాలకు జిల్లా విద్యాశాఖాధికారి రావలసిన గ్రాంటులో నూటికి ఇరువదియైదు చొప్పున గ్రాంటును హెచ్చింప వచ్చును. కాని ఇట్టి హెచ్చింపు,

(1) ఒంటరి యుపాధ్యాయు డుండు పాఠశాలకుగాని.
(2) అయిదు తరగతులును లేని పాఠశాలకు గాని.
(3) మూఁడింట నొక పాలుకంటె నెక్కువమంది ట్రైయినింగు కాని యుపాధ్యాయులుండు పాఠశాలకుఁగానియుండదు.

7. గ్రాంటుపరీక్ష కాలమునను, తదితర సమయములలోను, డిప్యూటీ ఇన్స్పెక్టరుగారు దర్శించినప్పుడును ఉన్నతస్థితినిబట్టి యాయన యాబడికి గ్రాంటును సిఫారసుచేయుచుఁ బరీక్ష రిపోర్టును జిల్లా విద్యాశాఖాధికారిగారికిఁ బంపవలయును. ఆయన తాలూకా లోని పాఠశాలలలో నొక్కొక్కదాని కెంత గ్రాంటు నియ్యనగునో తెలుపుచు నొక పట్టీని సిద్ధముచేసి దానిని సలహాసంఘ కార్యదర్శికి బంపవలయును. సలహాసంఘము వారి యభిప్రాయములను గనుఁగొన్న

పిదప ఆయనగారే బడికెంత గ్రాంటు వేయవలసినదియు నిశ్చయము చేయుదురు. అట్లు నిశ్చయము చేసినపిదప సిద్ధముచేసిన పట్టికను డైరెక్టరుగారికి పంపుదురు. ఈ గ్రాంటులను "అసైన్డ్ గ్రాంట్లు" అందురు. పిదప సొమ్మున్నకొలఁది మొదట నుత్తమ శ్రేణిలోని పాఠశాలలకును, పిదప మధ్యశ్రేణిలోఁ జేరిన వానికిని, చివరను నధమశ్రేణికిఁ జెందినవానికిని గ్రాంటుల నియ్యవలయును.

8. సొమ్ము చాలనందున నొకసంవత్సర మియ్యని గ్రాంటులను విద్యాధికారులు డైరెక్టరు సెలవు లేకయే యే పాఠశాలకుఁగాని యియ్యరాదు.

9. ప్రైవేటుమేనేజిమెంటు క్రిందనుండు బడులలో బనిచేయు నుపాధ్యాయులకు వచ్చిన గ్రాంటులో నూటికి ఎనుబదియైదింటికిఁ దక్కువగాకుండ మేనేజిమెంటు వారియ్యవలయును. మిగిలినసొమ్మును మేనేజిమెంటు బడిలోని వ్యయముల కుపయోగించుకొనవచ్చును.

10. పాఠశాలకియ్యవలసినదిగా నేర్పబడిన గ్రాంటులనునయితముతగిన కారణమున్నచో జిల్లావిద్యాధికారిగారియ్యకపోవచ్చును. అట్టిగ్రాంటులను కోర్టుమూలముగా వసూలుచేయుటకు వీలుండదు.

11. నూతనముగ బాఠశాలను స్థాపించువారు తమబడులకు ద్రవ్యసహాయము నిమిత్తమయిన దరఖాస్తులను సెప్టెంబరు మొదటి తేదీలోపల డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారికిఁ బంపుకొనవలయును. అట్టి దరఖాస్తులను జిల్లావిద్యాధికారిగారు పరిశీలించి దేనికి ద్రవ్యసహాయ మియ్యవలసినదియు నిశ్చయింతురు.

12. ఇద్దఱు ట్రయినింగు పొందిన యుపాధ్యాయుల కొక్కఁడు చొప్పున ట్రెయినింగు పొందని యుపాధ్యాయులు పాఠశాలలలో నుండవచ్చును.

13. జిల్లావిద్యాధికారి గ్రాంటులను బడిమేనేజరునకుఁ బంపవచ్చును. లేదా నూటికెనుబదియైదు వంతుల చొప్పున నుపాధ్యాయునికే యిచ్చి మిగిలిన పదునైదువంతులు మేనేజిమెంటు వారికిఁ

కల్గింపవచ్చును. కాని గ్రామములో నన్నిజాతులకు సందుబాటులో లేని స్థలములలోనుండు పాఠశాలలకును, కులతత్వమును బట్టి కొందఱు బాలురను జేర్చుకొన నిరాకరించు పాఠశాలలకును, సర్వీసు రిజిష్టరులోనున్న షరతులప్రకారము జీతముల నియ్యని, లేదా తగిన కారణము లేకయే యుపాధ్యాయులను బనిలోనుండి తొలగించిన పాఠశాలలకును గ్రాంటు లియ్యబడవు.

14. ఉపాధ్యాయు లెవ్వరుగాని శాసనసభల యొక్కయు స్థానికసంస్థలయొక్కయు నెన్నికల కభ్యర్థులుగా నుండరాదు. తాము ఓటరులైనయెడల ఓటునిచ్చు విషయమునందప్ప మరేవిధముగగాని యెన్నికలలోఁ బాల్గొనరాదు. ఎన్నికలను జరుపుటకు ధనసహాయముఁగూడ జేయరాదు.

అనుబంధము 15 లో జూపినయట్టి విధమునఁ బ్రతి ప్రాథమిక పాఠశాల మేనేజరును నా పాఠశాల నెలసరి లెక్కల పత్రమును దర్వాతనెల పదునైదవ తేదీలోపల డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారికిఁ బంపవలయును.

పైని వివరించిన చట్టములు 'టీచింగు గ్రాంటు'లకుఁ జెందినవి. టీచింగుగ్రాంటు అనఁగా నుపాధ్యాయుల పోషణార్థమై సర్కారువా రిచ్చు ధనసహాయము.

టీచింగుగ్రాంటు లేక దొరతనమువారు బడిసామానులు, బోధనోపకరణములు, పుస్తకములు సయితము కొనుటకు బడులకు గ్రాంటుల నిత్తురు. వీనిని పొందగోరువారు మే నెల మొదటి తేదీ లోపలఁ దమ పాఠశాలలకుఁ గావలసిన సామానులు, పుస్తకములు మున్నగువానిని గూర్చిన వివరములను దమ దరఖాస్తులతోఁ గూడ జిల్లా విద్యాధికారిగారికిఁ బంపుకొనవలయును. వస్తువుల వెలలో నగమునకు మించకుండ జిల్లా విద్యాధికారిగారు ధనసహాయ మియ్యఁగలరు. అట్టి ధనముతో గొన్న వస్తువులపట్టికను విద్యాధికారులు గ్రాంటు పరీక్షకు వచ్చినపుడు వారికిఁ జూపవలయును. పాఠశాలల నిర్మాణమునకు సైతము దొరతనమువారు గ్రాంటులనిచ్చుటయు గలదు.

## ప్రశ్నలు

(1) 'పబ్లికు' పాఠశాలలకును 'ప్రైవేటు' పాఠశాలలకును, 'పబ్లికు మేనేజిమెంటు' నకును, 'ప్రైవేటు మేనేజిమెంటు' నకును భేదమేమి?

(2) ప్రాథమికవిద్య యనగా నేమి?

(3) నీ వొక గ్రామములో నొక పాఠశాలను స్థాపింపదలచిన నేమి చేయవలయును? దానికి 'రికగ్నిషన్' కొఱకు జిల్లావిద్యాధికారికి దరఖాస్తు వ్రాయుము.

(4) తాలూకా విద్యావిషయిక సలహాసంఘము యొక్క పనులను వివరింపుము.

(5) ఒక మంచి బడిలోని సరాసరి హాజరుసంఖ్య ఈ క్రిందివిధముగ నున్నది. ఒకటవ తరగతిలోని సంఖ్య 35. రెండవతరగతిలో సంఖ్య 20 మూడవతరగతిలోని సంఖ్య 21 నాలుగవతరగతిలోనిసంఖ్య 18. ఐదవతరగతిలోనిసంఖ్య 15. బడిలో నైదుగురుపాధ్యాయులు కలరు ప్రధానోపాధ్యాయుడు సెకండరీ గ్రేడు ట్రెయినింగును, తక్కిన నలుగురు హయ్యరుగ్రేడు ట్రయినింగును బొందినవారు. ఆ బడికి గ్రాంటును నిర్ణయముచేయుము.

(6) ఈక్రింది మాటలను విశదపఱచుము.

1. సంపూర్ణ పాఠశాలాదినము 2 అప్సెన్సు గ్రాంటు, అస్సైన్డుగ్రాంటు.
3. 'రికగ్నిషన్', 'ఎయిడు'.

(7) ఏయే సందర్భములలో నొక బడియొక్క రికగ్నిషన్ కొట్టివేయబడవచ్చును?

(8) ఉపాధ్యాయులు స్థానికసంస్థల యెన్నికలలోఁ బాల్గొనరాదనుటకుఁ గారణములను వ్రాయుము.

---

# 14. ఉపాధ్యాయ సంఘములు

గ్రామములలో ప్రాథమిక పాఠశాలలయందుఁ బనిచేయు నుపాధ్యాయులకుఁ దమవృత్తికి సంబంధించిన నూతనవిషయములను దెలిసికొను నదుపాయములు సామాన్యముగ నుండవు. బోధనాభ్యసనపాఠశాలలలో నేర్చుకొన్న విషయములను గాలక్రమమున మఱచి పోదురు. పిదప దుష్టములగు బోధనాపద్ధతులతో బేరునకు మాత్ర ముపకరణము లనదగు వస్తువుల నాశ్రయము చేసికొని బాలురకుఁ

బోధకులను నేర్పుచుందురు. బోధనాపద్ధతులకు సంబంధించిన నూతన విషయములను నేర్చుకొనుటకు ఉపాధ్యాయులకవకాశము లుండవలయును. ఒక్కొక్కప్పుడు విద్యాశాఖ డైరెక్టరుగారు విద్యకు సంబంధించిన సమస్యలపై నుపాధ్యాయుల యభిప్రాయమును తెలిసికొనఁగోరును. తమ యభిప్రాయమును తెలుపుట కట్టిసమయములందుపాధ్యాయ లోక సంఘముకూడ రావలసి యుండును. ఉపాధ్యాయులు తమకుఁగల కష్టములనుగూర్చి సమాలోచనలు జరిపి వానిని దొలగించుకొను మార్గముల నన్వేషించుటకు నుచిత మవకాశము లుండవలయును. అట్టి యవకాశము లుపాధ్యాయులకుఁ గలిగించు నుద్దేశముతోనే యుపాధ్యాయసంఘములు నెలకొల్పఁబడి యున్నవి.

ఒక్కొక్క తాలూకాలోఁగాని, లేక యొక్కొక్క రేంజిలోఁగాని యొకదాని కొకటి మిక్కిలి సమీపముగనుండు కొన్నిగ్రామములకొకటి చొప్పున నీయుపాధ్యాయసంఘము లేర్పడియున్నవి. ఏదైన నొక మ్యునిసిపాలిటి యున్నయెడల దానితోఁ గలసి రమారమి యేఁబదిపాఠశాలల కొక్కటి చొప్పున నీ సంఘము లున్నవి. ఈ సంఘముల కాయాతాలూకా ప్రాథమికోపాధ్యాయ సంఘము లనియు, లేదా రేంజి ప్రాథమికోపాధ్యాయ సంఘము లనియు పేరు.

అన్ని ప్రాథమిక పాఠశాలలలోను బనిచేయు నుపాధ్యాయులందఱు పురుషులుగాని, స్త్రీలుగాని యాయా ప్రదేశముల కేర్పడిన యుపాధ్యాయ సంఘములలోఁ జేరవలయును. పాఠశాల మేనేజరుగఁ బనిచేయు నుపాధ్యాయులు కూడ నీ సంఘములలోఁ జేరవలసినదే. ఉపాధ్యాయేతరు లీ సంఘములోఁ జేరరాదు.

ఈ సంఘమున కా ప్రదేశమునఁ గల సీనియరు డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగాని, జూనియరు డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగాని యధ్యక్షుడుగా నుండును. సభ్యులు తమలోనుండి యొక కార్యదర్శిని, కోశాధికారిని నెన్నుకొనవలయును. ఈ యుద్యోగుల నియామక మధ్యక్షుని యామోదమును బొందవలయును. సంఘసమావేశ చర్యలను గార్య

దర్శి యొక్క పట్టికలో వ్రాసియుంచవలయును. వీని నధ్యక్షుడు సరి చూచి సంతకము చేయువలయును. నెలకొక పర్యాయము మీా సంఘ మీా గ్రామము లన్నింటికి నట్టనడుమ నుండు గ్రామమునసమావేశము కావలయును. ఆసమావేశమున అంతకుఁ బూర్వపు సమావేశములోఁ గాని, లేక సంవత్సరారంభమున గాని యేర్పాటు చేసియున్న విధ మున గార్యక్రమము జరుపవలయును. తగిన కారణము లేక తమే వరు సగ రెండు సమావేశములకు రాని యుపాధ్యాయు లధికారుల దండ నకుఁ బాత్రులగుదురు. ప్రైవేటు మేనేజిమెంటు క్రింద నుండు పాఠ శాలలో పని చేయు నుపాధ్యాయుల నీవిషయమునుబట్టి దండించుటకు డిప్యూటీ ఇన్‌స్పెక్టరుగారి కధికారముగలదు. ఈ సంఘపుఁ బనిని గూర్చిన వార్షిక నివేదికను సంఘ కార్యదర్శి సంఘాధ్యక్షునిమూల మున జిల్లావిద్యాశాఖాధికారిగారికిఁ బంపవలయును. జిల్లా విద్యాధి కారిగా రట్టి నివేదికలను డైరెక్టరుగారికిఁ బంపుదురు. ఆయన వీనిని గూర్చి తన వార్షిక నివేదికలో వ్రాయును.

ఉపాధ్యాయ సంఘముల పని:- ఈ సంఘ సమావేశములలో ఇన్‌స్పెక్టర్లు, ఉపాధ్యాయులు తెలిసికొనవలసిన యనేక విషయము లనుగూర్చి వారికి బోధింతురు. ఒక్కొక్కప్పుడు వారు ప్రాథమిక విద్యాశాసనములోని కొన్ని భాగములను, వానికి సంబంధించిన నిబం ధనలను వివరింతురు. లేదా దొరతనమునుండియు డైరక్టరునుండియు, నితర విద్యాధికారుల నుండియు రిజిష్టర్లు, సాంవత్సరిక లెక్కలు మున్నగు వానిని సిద్ధపరుపవలసిన పద్ధతులను గూర్చియు వచ్చిన ఆజ్ఞా పత్రములను వివరింతురు. కాఁబట్టి యుపాధ్యాయులు పైని వివరించిన విషయములనుగూర్చి తమకు సందేహముగాని, చిక్కులు గానియున్న యెడల వానిని సమావేశమునకు ముందుగనే సంఘ కార్యదర్శిచేతి కిచ్చినచో నతఁడు వానిని ఇన్‌స్పెక్టరుగారి కందఁజేయును. ఆయన యీా విషయములనుగూర్చి యుపాధ్యాయు లందఱితోను ముచ్చ టించి సందేహములను దొలగించి చిక్కులను విడఁదీయును.

ఈ సమావేశములో నుపాధ్యాయులకు ముఖ్యముగ బోధనా పద్ధతులనుగూర్చిన సంగతులను నేర్చుకొనుట కవకాశములుండును. ప్రతి సమావేశములోను నేదో యొక బడిపాఠమును నేర్పు పద్ధతులను గూర్చి యుపన్యాస ముండును. దీనిని అనుభవజ్ఞులగు నుపాధ్యాయు లిత్తురు. ఉపన్యాసముతోఁ బాటు మాదిరి పాఠ మొకటి యుండును. దాని మూలమున నా పాఠమును నేర్పు పద్ధతు లుపాధ్యాయులకుఁ బ్రదర్శింపఁబడును. పాఠ మయినపిదప నా పాఠములోని పద్ధతి యందలి ముఖ్యభాగముల నుపాధ్యాయుఁడు సంఘసభ్యులకు వివరించి వారడుగఁగల ప్రశ్నలకు సమాధానముల నిచ్చును. కావున నుపాధ్యాయులు బోధనాపద్ధతులను నేర్చుకొనుట కుపాధ్యాయ సంఘము నమూల్యావకాశముల నొసఁగుచున్నవి.

సంఘ సమావేశములలో నుపాధ్యాయుడు చర్చల మూలమున నేర్చుకొనఁగల సంగతు లనేకములు కలవు. వానిలోఁ గొన్నింటి నిచ్చట పేర్కొనవలసి యున్నది. బడి జరుపవలసిన కాలము, సెలవు దినముల విషయములోఁ గొందఱు గ్రామస్థుల కోర్కెలను దృప్తి పరచలేక యుండవచ్చును. అట్టి కష్టము నితర పాఠశాలల వారెట్లు గడపిరో యని సంఘసమావేశములో తెలిసికొనవచ్చును. మఱియు నితరపాఠశాలలలో బడిపారిశుద్ధ్యము, విద్యార్థుల శుభ్రత, దుస్తుల శుభ్రత, బడి యలంకరణము మున్నగువాని కెట్టి యేర్పాటులు చేయుచున్నదియు నుపాధ్యాయు లొకరి కొకరు చెప్పుకొనవచ్చును. చదువుముగింపకయే బడి చాలించుకొను విద్యార్థులను బడిలో నిలుపుటకును, బాలుర తల్లిదండ్రుల సంఘముల నేర్పాటు చేయుటకును, నవి జయప్రదముగ జరుగుటకును, నొక్కొక్క యుపాధ్యాయుఁ డెట్టి యేర్పాటులు చేయుచున్నదియుఁ జెప్పుకొని యొక్కొక్కరి యనుభవమువలన నితరులు మేలు పొందవచ్చును. మఱియు సంపూర్ణ పాఠశాలలు, అసంపూర్ణ పాఠశాలలు, ఒంటరి యుపాధ్యాయుఁడుగల పాఠశాలలు—వీనియందు బడిపనిని నిర్విఘ్నముగ సాగించు పద్ధతులు, వానియందుపయోగింపఁదగు కాలనిర్ణయపట్టికలు మున్నగు విషయ

ముల నొకరివలన నొకరు నేర్చుకొనుటకును దమకు తమకు గల
చిక్కులకుఁ దగిన సమాధానము పొందుటకును ఉపాధ్యాయసంఘ
ములు గ్రామోపాధ్యాయులకుఁ జక్కని యవకాశముల నొసఁగు
చున్నవి. బడి తోటలను బెంచుటలో నొక్కొక్క గ్రామపాఠ
శాలలో నెట్టిపద్ధతు లవలంబింపఁ బడుచున్నవో యనియు, తోట
స్థలము, కంచె, ఎరువులు, విత్తనములు, నీటివసతులు, విద్యార్థు
లందు జేయవలసిన పని మున్నగు నంశముల నాయా పాఠశాలలలోని
సహోపాధ్యాయులెట్లు నిర్వహించుచున్నారో యనియు, నుపా
ధ్యాయసంఘ సమావేశముల మూలమునఁ దెలిసికొనుటకు సభ్యుల
కవకాశములున్నవి. అట్లే చేతిపనులకు సంబంధించిన యంశముల
నఁగా నా తాలూకాలోఁ జౌకగ లభించు ఆకులు, పీచులు, నారలు
మున్నగు ముడిపదార్థము లెవ్వియనియు, వానిని చేతిపనులకు సిద
పఱచు విధాన మెద్దియనియు, వానిలో నే పదార్థములతో నే తర
గతుల కెట్టి చేతిపనినిఁ జేయింప వలసినదియు నుపాధ్యాయులు తెలిసి
కొనఁగలరు. దీనినిబట్టి చూడ నుపాధ్యాయ సంఘము లుపాధ్యా
యుల కత్యంత ప్రయోజనకరములుగ నుండఁగలవని తెలియుచున్నది.

ఆశ్వాసకోపన్యాసతరగతులు:—అంతియగాక యీ యుపా
ధ్యాయసంఘము లాశ్వాసకోపన్యాస తరగతులు (రిఫ్రెషర్ కోర్సుల)
కేర్పాటులు చేసి యుపాధ్యాయులకు దోడ్పడగలవు. అట్టితరగతులు
సామాన్యముగ సంవత్సరాంతమున రెండువారముల పర్యంతముగాని
నాలుగువారముల పర్యంతముగాని జరుపవచ్చును. వీనిలో నుపన్యా
సముల నిచ్చుటకు జిల్లావిద్యాధికారులను, ననుభవజ్ఞులును, బండితులు
నగు నుపాధ్యాయులను రప్పించి ప్రాథమిక పాఠశాలలలోని బాలు
రకు వాచకము, లెక్కలు, ప్రకృతిపాఠములు, భూగోళము మున్నగు
వానిని నేర్పుటకుఁ గల యుత్తమ పద్ధతులను గూర్చిన యుపన్యాస
ముల నిప్పింపవలయును. ఈతరగతులలో నుపన్యాసములేగాక బాలు
రకు నేర్పవలసిన యొక్కొక్క పాఠము వారికి సుబోధ మగునట్లు
చేయుటకుఁ గావలసిన నానావిధములగు నుపకరణముల నుపాధ్యా

యులు తమకుఁ దాము సిద్ధము చేసికొనుట కేర్పాటులను జేయవలయును. ఇట్టి తరగతులకు వచ్చు నుపాధ్యాయులు సిద్ధము చేసికొనఁదగు నుపకరణములలోఁ గొన్ని యీ దిగువ నుదహరింపఁబడినవి.

వాచకము నేర్పుటకు.—చిత్రరూపులు వ్రాసిన కార్డులు, వానిపేరులు గల కార్డులుఁ మౌనపఠనమునం దుపయోగించదగు త్వరితపు టట్టలు (ఫ్లాష్ కార్డులు), ఉబ్బెత్తక్షరములు గల యట్టలు, అట్టలపై నిసుకపోసి సిద్ధముచేసిన పల్లపు అక్షరములు, ఆటలలో నుపయోగింపదగు మాటలుఁ గల యట్టలు మున్నగునవి, గణితము నేర్పుటకు అంకెలకు సరిపడిన చిత్రములుగల యట్టలు, నాలుగు సూత్రముల నుదహరించుట కనువగు నట్టలు, మట్టిపూసల చట్రము, పుల్లలకట్టలు, త్రాసు, మట్టితో చేసిన తూనిక రాళ్ళు, అట్టలతో జేసిన కొలత పాత్రలు, కొలఁత బద్దలు మున్నగునవి.

ప్రకృతిపాఠము నేర్పుటకు : సామాన్య జంతువుల అవయవములు అనఁగా కొమ్ములు, పాదములు, వీని చిత్రములు, పక్షుల ముక్కులు, కాళ్ళు మున్నగు వాని చిత్రములు, కీటకముల యవస్థలను జూపు చిత్రములు, విత్తనములు మొలకెత్తుట, ఆకుల యమరిక, ప్రకాండములోని భాగములు, పుష్పములోని భాగములు, వీనిఁ జూపు చిత్రములు.

భూగోళము, చరిత్ర నేర్పుటకు : ఋతువులనుగూర్చిన చిత్రములు, మైదానము, పీఠభూమి, కొండ, పర్వతము, ద్వీపము, ద్వీపకల్పము, నదీముఖము మున్నగువాని చిత్రములు, కాలచక్రము.

కథలు నేర్పునపుడు చూపవలసిన చిత్రములు: వీనినన్నింటిని జక్కఁగ సిద్ధముచేసికొనుట మిగులఁ బ్రయోజన కరముగ నుండును.

ఇట్టి తరగతులను సంవత్సరాంతమున నేర్పాటుచేయుట వలన నుపాధ్యాయులు నూతన సంవత్సరములోఁ దమ తమ పనుల నుత్సాహముతోను, నేర్పుతోను జేయఁ గల్గుదురు.

పఠనసంఘములు:—ఇవియు నుపాధ్యాయసంఘముల యాజమాన్యముననే జరుపఁబడవచ్చును. వీని యుద్దేశమును ప్రయోజనమును నీ క్రిందివిధమున నుండును. ఉపాధ్యాయసంఘములోఁ జేరిన యుపాధ్యాయులు నలుగురో యైదుగురో యొక్క పఠన సంఘముగా నేర్పఱుపఁబడవలయును. ఈ సంఘము ప్రాథమిక విద్యకు సంబంధించిన సమస్యలలో నొక్కొక్క మాసమునకుఁగాని లేక మూఁడు మాసములకుఁగాని యొకదానిచొప్పున నేర్పరచుకొని దానిని గూర్చిన వివరముల నన్నింటిని సేకరించి వానిని సాకల్యముగ జర్చించి తాము చేసిన కృషివిధానమును, దానిఫలితము నొక్కొక్క నివేదికయందుఁ బొందుపరచి నియమిత దినమున దాని నుపాధ్యాయసంఘ సమావేశమున కర్పింపవలయును. సమావేశమైన యుపాధ్యాయులును దానిని జదివి, యందలి విషయములను చర్చించి తాము వెంటనే యాచరణములోఁ బెట్టఁగల యంశములపై తీర్మానములఁ జేసికొని యాచొప్పున నడుచుకొనవచ్చును. లేదా విద్యాధికారులకు విన్నపము లంపుకొనవలసిన యవసరములు కలిగినయెడల నా చొప్పునఁ జేయవచ్చును. జిల్లాలోని విద్యావ్యాప్తి, దానికిఁగల యవకాశములు, ఆటంకము, ప్రాథమిక పాఠశాలలలో నేర్పవలసిన పాఠములలో నొక్కొక్కదానికిఁ గావలసిన యుత్తమోపకరణములు, బడి ఆటస్థలములు, విద్యార్థుల తల్లిదండ్రుల సంఘములు, జిల్లాలోని ప్రాథమిక పాఠశాలలకుఁ దగిన చేతిపనులు, చదువు ముగింపకయే బడివిడుచు బాలురు, పెద్దల విద్య మున్నగునవి యీ పఠనసంఘములు విచారింపఁదగిన యంశములలో జేర్చుకొనవచ్చును.

విద్యావిషయిక ప్రదర్శనములు:— ఇవియు నుపాధ్యాయ సంఘములచేత నేర్పరుప బడవచ్చును. ప్రతి గ్రామములోని పాఠశాలయు నా గ్రామములోని విద్యార్థుల తల్లిదండ్రులును తిలకించునటుల జూచి యానందించుటకై పాఠశాలయందే ప్రదర్శనములు జరుపవచ్చును. కాని యుపాధ్యాయ సంఘముచే నేర్పఱుపఁబడు విద్యా

ప్రదర్శనములు తాలూకా కంతటికో లేదా జిల్లా కంతటికో చెంది
నవై యుండవలయును.

ఇట్టి ప్రదర్శనముల నేర్పాటుపఱచు నుపాధ్యాయసంఘము సకాలముననే తన యత్నమునుగూర్చి విద్యాధికారులకును, జిల్లాలోని పాఠశాలల యధికారులకును దెలిపి ప్రదర్శనమున కెట్టివస్తువులు సిద్ధముచేసి పంపవలయునో తెలుప వలయును. నిర్ణీత కాలమునకుముందే ప్రదర్శనమునకుఁ బంపబడు వస్తువుల నన్నిటిని భద్రము చేసి యుంచవలయును. ప్రదర్శనమును దమసంఘమునకుఁ జెందియున్నట్టియు ప్రదర్శనమునకు వలయు గృహావసతి గలిగినట్టియు కేంద్రమునందు జరుపవలయును. అట్టి ప్రదర్శనమును దెఱచుటకును, విద్యావిధానమున దమకు గల యనుభవముచే నితరుల నుత్సాహవంతులుగఁ జేయుటకునుఁ దగిన విద్యావేత్తలను రప్పింప వలయును. అట్టి ప్రదర్శనమునకు వచ్చు ఉపాధ్యాయుల కందరకు నది నూతనాభిప్రాయములను గలిగించి నూతనోత్సాహమును బుట్టించునదియై యుండవలయును. మఱియు నా ప్రదర్శనము జిల్లాలోని యుపాధ్యాయులు విద్యకొఱకు చేయుచున్నకృషిని బ్రకటించునదియై యుండవలయును.

ఈ ప్రదర్శనములలో నుపాధ్యాయులేమి, బాలురేమి సిద్ధము చేసిన నానావిధవస్తువులను గొన్ని తరగతులుగ భాగించి చూపవచ్చును. పాఠశాలలలో బాలురకు నేర్పు వాచకము, గణితము, ప్రకృతిశాస్త్రము మున్నగు పాఠములను నేర్పునప్పు డుపయోగింపఁదగు నుపకరణము లొక్కొక్క పాఠమునకుఁ జెందినది వేర్వేఱుగ నుంచనగును. చేతిపనులలో బంకమట్టిపని, గ్రఱపని, నారలును, పీచులును మున్నగువానితోఁ జేసినపని—వీని నన్నింటిని బ్రత్యేకముగ ప్రదర్శనము చేయవచ్చును. ప్రదర్శనమునకుఁ దేబడిన వస్తువులలో నుత్తమమయిన పని పెద్దలచే నంగీకరింపఁబడిన వానిని సిద్ధముచేసిన పాఠశాలలకును, లేదా వ్యక్తులకును యోగ్యతా పత్రములనో, పారితోషికములనో యివ్వవలయును. ఇట్టి ప్రదర్శనములు ప్రతిజిల్లాలోను సంవత్సరమున కొకతూరి యైనను జరుగుట యాజిల్లాలోని విద్యకు మిగులఁ బ్రోత్సాహకరముగ నుండుననుటకు సందియము లేదు.

ఇతర ప్రదర్శనములు:—వస్తుప్రదర్శనము లేగాక యితర విధములైన ప్రదర్శనములను సయితముపాధ్యాయ సంఘము లేర్పఱుపవచ్చును. అట్టివానిలో నాటకములు, వ్యాయామము, బాలభటోద్యమము, బడిలో సిద్ధపఱచు వస్తువులు- ఇట్టివానిని జేర్పవచ్చును.

ఉపాధ్యాయసంఘము పనిచేయు ప్రదేశమునందలి పాఠశాలలలోని విద్యార్థులు నాటకములను సిద్ధముచేసికొని వచ్చి సంఘకేంద్రమున వానిని బ్రదర్శింపవచ్చును. ఇట్టి నాటక ప్రదర్శనముల మూలమునఁ బాఠశాలలో సంగీతము, నాట్యకళ సజీవములై వెలయఁగలవు.

అప్పుడప్పుడు సంఘసమావేశ సమయమున నేదేని యొక పాఠశాలలోని విద్యార్థులు డ్రిల్లు, పాటల్డ్రిల్లు, నానావిధములైన ఆటలు, ప్రాణాయామ పరిశ్రమలు మున్నగువాని నుపాధ్యాయ సంఘమెదుట బ్రదర్శించుటచే నా సంఘమునకుఁ జెందిన యుపాధ్యాయు లందఱును నిట్టి వ్యాయామములో నంతకుముందు తమకు దెలియని విషయములను నేర్చుకొనగలరు.

బాలభటోద్యమ మిప్పుడే మన గ్రామపాఠశాలకుఁ బ్రాకుచున్నది. శరీరవ్యాయామ ప్రదర్శనములవలెనే బాలభటోద్యమము గల యొక పాఠశాలలోని తోఁడేలు కూనల (వుల్ఫ్‌కబ్స్) గుంపు చేయుగల నానావిధములయిన పనులను ప్రదర్శింప గలిగినచో నితర ఉపాధ్యాయులలో నిట్టి శిక్షణమును బాలుర కొసగుటకు త్సాహము తప్పక కలుగగలదు. అట్లే యాప్రదేశములోని పాఠశాలలో నున్న ప్రతి తరగతిలోను; విద్యార్థులు చేతిపని తరగతులలో జేయుచున్న నానావిధ వస్తువుల నుపాధ్యాయ కేంద్రమునందు బ్రదర్శింప గలిగిన యెడల నుపాధ్యాయు లొకరివలన నొకరు నూతన విషయములను దప్పక నేర్చుకొనఁగలరు.

పాఠశాల లొకదాని కొకటి తోడ్పడుట:—గ్రామములోని ప్రాథమికపాఠశాల లొకదానితో నొకటి సహకారము సల్పుటవలన

ళానికి బల మధికమై యవి జాతీయజీవితమున నొక సంస్థగా నుండఁ గలవు. ఈసహాకారము పలువిధములుగ నుండవచ్చును. గ్రామ పాఠశాలలు సామాన్యముగ నార్థిక దుస్థితికి లోనైన పాఠముల బోధనమునకుఁ గావలసిన యుపకరణములలోఁ గొన్నింటిని వెల యధికమైనందున గొనలేక యుండును. అట్టి యుపకరణములలో భూగోళపాఠములను నేర్పుటకుఁ బనికివచ్చు 'టెల్యూరియన్' 'అరెరీ' యనునవియు, శరీరశాస్త్రమును బోధించుట కుపయోగించు చిత్రపటములును, నస్థిపంజరమును జేరియున్నవి. ఒక యుపాధ్యాయ సంఘము పనిచేయు ప్రదేశమునందున్న పాఠశాలఁ లన్నియుఁ గలసి యిట్టి యుపకరణములను దెప్పించుకొనవచ్చును.

అంతియగాక ప్రాథమిక పాఠశాలలోని బాలుర దేహములను దూఁచుటకు గావలసిన తూకపుయంత్రమును, బాలుర శ్వాసశక్తిని గొలువగల యంత్రమును, విద్యార్థులు నాటకములను ప్రదర్శించుటకుఁ గావలసిన తెరలు, దుస్తులు, నితర సామానులును పాఠశాల లన్నియు నుమ్మడిగఁ దెప్పించి యుపాధ్యాయసంఘ కార్యదర్శి యొద్ద నుంచుకొని వంతులప్రకారమును, అవసరమును బట్టియు వానిని వాడుకొనుచుండవచ్చును.

విలువగల పుస్తకములు, పత్రికలు మున్నగువానిని గొనుట విషయములోఁ గూడ నిట్లే పాఠశాల లొకదానితో నొకటి కలసి పనిచేయవచ్చును. అంతియగాక పాఠశాలలు పటముల పుస్తకములను (ఆల్బములు) సిద్ధముచేసి, తమపుస్తకము నితర పాఠశాలలకు బంపి యచ్చటి పుస్తకములను దాము దెప్పించుకొని నూతన విషయములను నేర్చుకొనవచ్చును. వ్యాసరచనయందేమి, యుపన్యాసముల నిచ్చుటయందేమి పాఠశాలకంటె నితరములయిన పాఠశాలలను గూర్చి నేర్చుకొనవచ్చును.

తమ తాలూకాలో నారోగ్యప్రచారమును జయప్రదముగ జరుపుటకు వలయు నాటకప్రదర్శనములు చేయుటయందును, ఆరోగ్య

సూత్రములను గ్రామస్థులకుఁ దెలియఁజేయుటయందును, పాటలు పాడుచు, నూరేగింపులు సల్పుటయందును పాఠశాల లొకదానితో నొకటి సహకారము సలుపఁగలవు.

అక్షరజ్ఞానము ప్రాథమికవిద్యయొక్క యుద్దేశములలో ప్రధానమైనది కనుక "విద్యావారము" నాచరించుటకు తాలూకాలోని ప్రాథమిక పాఠశాల లన్నియుఁ గలసి యీ వారము నెట్లుజయప్రదముగ నాచరింపవలయునో యని సమాలోచనలుజరిపి యీవారము పొడుగునను విద్యావిషయిక నాట్యప్రదర్శనములు, ఊరేగింపులు, ఉపన్యాసములు, పాటలు మున్నగు వానిమూలమున గ్రామములోని విద్యను గూర్చియాసక్తిని బుట్టించుట కెంతయుఁ గృషి చేయఁగలవు. మఱియు పెద్దలకు సైత మిప్పుడు త్వరితముగఁ జదువు నేర్చుకొనుట కుండెడి పద్ధతులను ప్రచారమూలమున వారికి దెలియ జేయవచ్చును.

పాఠశాలలో రెడ్ క్రాసు సంఘములను స్థాపించియున్నచో, సంవత్సరములో నప్పుడప్పు డొక కేంద్రమునఁగూడి తత్సంబంధమైన శిక్షణము పొందవచ్చును. లేదా ప్రపంచములో నెచ్చటనైన నాపద తటస్థించి యున్నయెడల నచ్చటి జనులకుఁ దమ సానుభూతిని దెలుపుచు సందేశమును బంపుటకును, లేదా తమ శక్తికొలఁది సొమ్మును బంపుటకును పాఠశాల లొకదానితో నొకటి గలిసి పని చేయవచ్చును. అట్లే బాలభటోద్యమశాఖ లున్నయెడల నా యుద్యమమునకుఁ జెందిన విద్యార్థులెల్లరు రెండుమూఁడు మాసముల కొకసారి యొక కేంద్రస్థానమునఁ గూడి తమ తమ నాయకులక్రింద దమ తమ శిక్షణ విధానమును బ్రకటింపవచ్చును. ఆటలు పాటలు మున్నగువానిని బ్రదర్శించుటయందును వారందఱు నేకమైన పని చేయవచ్చును.

వ్యాయామపు పోటీపందెములు:— గ్రామ పాఠశాలలలోని విద్యార్థులకు బాహ్యప్రపంచముఁ జూపుటను, పాఠశాల లొండొరటితోఁ బోటీలు చేసి తమ బలాబలములు తెలిసి కొనుటకును ఇతర బాలురతోఁ బందెములు వేసి పెద్దల మెప్పుఁ బొందుటకును శరీర

వ్యాయామమునం దుత్సాహము కలిగించుటకును వ్యాయామపు పోటీలు చక్కని యవకాశముల నొసంగగలవు. అట్టి వ్యాయామపు పోటీల నిరువది పాఠశాలలు మొదలు ముప్పది పాఠశాలలవఱ కొక్కటి చొప్పున నేర్పఱుపవలయును. అట్టి పోటీ పందెములలో గెలుపొందినవారికి పారితోషికములను సైతమిమ్యవలయును. ఇవి మిగుల విలువగలవిగా నుండనక్కఱలేదు. వీనినిఁ గొనుటకగు వ్యయము నిమిత్తము మా గ్రామములో నుండు ధార్మికులగు పెద్దలయొద్దఁ గొంత సొమ్ము ప్రోగుచేయవలయును. అట్టి పోటీల నాయా తాలూకాల లోని ప్రాథమికవిద్యా సలహాసంఘ సభ్యులయొక్కగాని, డిప్యూటీ ఇన్‌స్పెక్టరుయొక్క గాని యాజమాన్యమున జరుపవలయును.

## ప్రశ్నలు

(1) ఉపాధ్యాయ సంఘము వలన నేమి ప్రయోజనము ?

(2) నీవు హాజరైన యొక యుపాధ్యాయసంఘ సమావేశములో నేమి జరిగినదో వివరింపుము ?

(3) పునరాభ్యాసకోపన్యాస తరగతి నొకదాని నేర్పాటు చేయుచున్నారనుకొనుము దానికిఁ బ్రతిగిన కార్యక్రమ మొకటి సిద్ధము చేయుము.

(4) ఒక గ్రామములో నొక బోర్డు పాఠశాలయు, నొక హిందూ ఎయిడెడ్ పాఠశాలయు, నొక క్రైస్తవ పాఠశాలయు, నొక మహమ్మదీయ పాఠశాలయు నున్నవి, అవి యొండొంటితో సహాకారము సలుపఁగల విషయములను చేరొక్కటి, పద్ధతులను సూచింపుము.

(5) జిల్లాలో జరుగఁగల యొక విద్యావిషయిక ప్రదర్శనమునకు రావలయున నీవు కోరు వంద్రెండు వస్తువుల పేర్లను వ్రాసి యవి రావలయునని కోరుటకు గారణములను వ్రాయుము.

(6) శరీరవ్యాయామ ప్రదర్శనమునకు నీ వొక పాఠశాలలోని విద్యార్థులను దీసికొని పోవుటకు ముందు వారి కేమేమి నేర్పుదవో యొకపట్టీ వ్రాయుము.

# 15. విద్యార్థుల తెలివికనుగొనుటకుపరీక్షలు

పాఠశాలలోని విద్యార్థులు తాము నేర్చుకొన్న పాఠముల నెంతవఱకు గ్రహించినదియు, నెంతవఱకు జ్ఞాపకముంచుకొన్నదియు తెలిసికొనుట కుపాధ్యాయులు పరీక్షలు చేయుచుందురు. వీనినిగూర్చి యేడవపాఠమునఁ జదివితిమి. మనదేశములో నీ పరీక్షల ప్రాముఖ్య మంతవరకు హెచ్చి విద్యావిధానమంతయుఁ బరీక్షల ననుసరించియే నడచుచున్నది.

ఇందుమూలమున విద్య తప్పుమార్గమునఁబడి విద్యార్థుల మానసికాభివృద్ధి కంతగాఁ దోడ్పడజాలకున్నది. ప్రాథమికవిద్యను జాతీయపద్ధతుల కనుగుణముగాఁ బునర్నిర్మాణ మొనరించుటకుఁ గొంతకాలముక్రిందట నేర్పడిన జకీరు హుస్సేన్ సంఘమువారు మనదేశములోని పరీక్షలనుగూర్చి యిట్లువ్రాసిరి.

“హిందూదేశములోని పరీక్షల విధానము విద్యను మిగుల బాధించుచున్నది. ప్రస్తుత విద్యావిధానమే లోపభూయిష్ఠమైనది. కాని యట్టి విధానములో బరీక్షల కత్యంత ప్రాధాన్య మిచ్చుటవలన విద్యావిధానము మఱింత చెడినది” అని. పాఠశాలలోఁ బరీక్షలు లేకుండ మనవిద్య ముందునకు సాగనేరదనియే చెప్పవచ్చును. కాని, పరీక్షలవలనఁ గలుగుచున్న దుష్ఫలితములను మాత్రము తొలగించుటకుఁ బ్రయాసపడఁగలము. పాశ్చాత్యదేశస్థులు పరీక్షలవలన నేర్పడఁగల చెడుగులను గుర్తించియున్నారు. కావున వారు విద్యార్థుల సామర్థ్యమును తెలిసికొనుటకుఁ బరీక్షలను బ్రధానముగా నెంచుట లేదు. మఱియు వారు విద్యార్థుల తెలివితేటలను గనుఁగొనుట కితర సాధనములు సైతము బ్రయోగించుచున్నారు. ఆసాధనములే విద్యార్థుల తెలివిని గనుఁగొనుట కుపయోగింపఁబడుచున్న నూతన పరీక్షలు.

తెలివియనఁగా నేమి? :—ఒక కుటుంబములో నైదాఱుగురు బిడ్డ లున్నయెడల వా రందఱు సమానమైన తెలివిగల వారుగా

నుండ రనునది యనుభవమూలమున నెవ్వరికిఁగాని తెలియఁగలదు. ఆ బిడ్డలలో నొకఁడు విశేషముగా మాటలాడక యుండును. మఱొకఁడు తనచుట్టునున్న వస్తువులను సరిగా గమనింపకయు, మాటలను సరిగా వినకయు నుండును. వేఱొకఁడు తనచుట్టునున్న వస్తువులను బాగుగ గమనించుటయేకాక వానినిగూర్చి తల్లిదండ్రుల ననేక ప్రశ్నలడుగుచుండును. తనకైతానే యాటలను గల్పించుకొని యాడుచుండును. ఇట్టిబాలుఁడు సామాన్యముగా నితరబాలురకంటె నెక్కువ తెలివి కలిగినవాఁడుగ నుండును.

పాఠశాలలోని యుపాధ్యాయులుసైతము తమ తరగతులలోని బాలురలో నిట్టి భేదములనే గమనించుచుందురు. కొందరు బాలు రుపాధ్యాయులు చెప్పు పాఠముల నతిత్వరితముగను, సులభముగను గ్రహింతురు. బాగుగ జ్ఞాపకముంచుకొందురు. తాము జ్ఞాపకముంచుకొన్న సంగతుల నవసరము వచ్చినపు డుపయోగింతురు. మఱికొందఱు ఉపాధ్యాయుఁడు బోధించు పాఠములకు త్వరితముగ గ్రహింపలేరు. గ్రహించిన దానిని చాలకాలము జ్ఞాపక ముంచుకొనలేరు. జ్ఞాపకముంచుకొనలేనివారు తరగతిలో నేర్పిన విషయములను సమయము వచ్చినప్పు డుపయోగింపజాలరని వేఱుగఁ జెప్పనవసరము లేదు. కొందరు బాలురు గణితమునందు గొప్పప్రజ్ఞను గనఁబరతురు. కాని భాష, చరిత్ర మున్నగు పాఠములలో మందముగ నుందురు. అట్లే మరికొందరు భాష, చరిత్ర మున్నగు పాఠములలోఁ దెలివిగ నుందురు, కాని గణితమునందు మిగుల జబ్బుగ నుందురు. మరియుఁ దరగతిలోఁ గొందరు పాఠములలో మిగుల చుఱుకుగ నుందురు. కాని, చేతిపనులయందును ఆటలయందును వెనుకఁబడి యుందురు. అట్లే చేతిపనులయందు ప్రజ్ఞగల బాలురు తరగతిలోని పాఠములలో నంత చుఱుకుగ నుండరు. ఒక తరగతిలోని బాలురకందరకు నొకే విధమైన యవకాశములు సాధారణముగ నుండవు. కొందర న్నవస్త్రములకుఁ దక్కువలేని ధనికుల యిండ్లనుండి బడికివత్తురు. మరికొందరు మిక్కిలి పేదకుటుంబములనుండి వత్తురు. యింటివసతులు సమాన

ముగా లేకపోవుటవలన బాలురు తరగతిలో కనపరచు నభివృద్ధిలోను, తెలివిలోను భేదము లుండుననుట కొంతవరకు సత్యమే. కాని, బాలురందరకును సమానావకాశము లున్నను దరగతిలోఁ గొందరు బాలురు తక్కిన బాలురకంటె నధములుగ నుండుటయుఁ గొందరు విద్యావసతులు తక్కువగ నున్నను దరగతిలో నెప్పుడును బ్రథములుగనే యుండుటయు, నుపాధ్యాయుల యనుభవము. ఇందులకుఁ గారణము వారి తెలివిలోని భేదము లేయని యనుచున్నాము.

‘తెలివియనఁగా నేమి?’ యని నిశ్చయము చేయుటకు పాశ్చాత్యపండితులు వాదోపవాదములను జేసి, నేటికిని నిశ్చితాభిప్రాయమునకు రాజాలకున్నారు తెలివియనఁగా నొకచిక్కును గ్రహించి, దానిని విడదీయుటకై మనస్సును దానిపై కేంద్రీకరింప జేయుటయని కొందరును, నూతనపరిస్థితుల కనుగుణముగ నడచుకొనుట యని కొందఱు నందురు. కాని తెలివియనఁగా నొక చిక్కును గ్రహించి దానిని విడదీయు శక్తియని యనవచ్చును. ఇదియే తరగతిలోని బాలురయందుఁ గొంత భేదములతో నున్నట్లు మనము గమనించుచున్నాము. ఆభేదము లెంతవరకున్నవో యని మనము నిశ్చయముగా దెలిసికొనఁగలిగిన యెడల తెలివినిబట్టి బాలురను భాగింపవచ్చును. అనఁగా విద్యార్థులలో నొక్కొక్కనియందు సహజముగా నెంత తెలివి యున్నదని మనము తూఁకము వేయఁగలిగిన యెడల, వారిలో మేధావంతు లెవరైనదియు, సామాన్యపుఁ దెలివితేటలు గలవారెవరైనదియు, మందమతు లెవరైనదియు దెలిసికొనగలము. అట్లు తెలిసికొన్నప్పుడు మందమతులుగా నున్నవా రున్నత పరీక్షలలో నుత్తీర్ణులగునట్లు చేయుటకు వారి మీద ధనము వ్యయము చేయక తెలివిగల బాలు రున్నతవిద్య పొందుటకును, నితరబాలుర కితరమగు విద్య చెప్పించుటకును నేర్పాటులు చేయవచ్చును.

విద్యార్థుల తెలివిని తూఁకము చేయుటకుఁ బ్రయత్నము చేసినవారిలోఁ బ్రథముఁడు ‘ఆల్‌ఫ్రెడ్ బైనెట్’ అను నతఁడు. ఇతడు ఫ్రెంచివాడు. ఫ్రాన్సుదేశములో మందబుద్ధులగు బాలుర విద్య

కొరకు గొన్ని పాఠశాల లేర్పడియుండెను. ఆ పాఠశాలలను నడపుచుండిన సంఘములో బైనెటు సభ్యుడుగ నుండెను. ఈపాఠశాలలో జేరు బాలురు వయస్సులో పెద్దవారయ్యు తెలివియందు జిన్నవారుగ నుండిరి. అనఁగా వయస్సునుబట్టి యొక బాలుడు పెద్దతరగతిలో నుండవలసినవాఁ డయ్యును తెలివినిబట్టి చిన్నతరగతిలో నుండవలసి వచ్చుచుండెడిది. కాని యిట్టి బాలురలో నొక్కొక్కఁ డేతరగతికి సరిపోవునో యని బాలుఁడు బడికి రాఁగనే నిశ్చయము చేయవలసి యుండెను. ఆ నిశ్చయము చేయుటకు బైనెట్ మిగుల నాలోచన చేసి చివరకు సామాన్యమైన తెలివిగల బాలురొక్కొక్క వయస్సులో నేమేమిమాట లాడుదురో, యేయే పనులను జేయుదురో, యేయే యాటలాడుదురో యను కనిపెట్టి యిట్టి పరిశోధనలయొక్క ఫలితముల మూలమున మందబుద్ధులగు బాలుర తెలివిని నిశ్చయింప నెంచెను. ఈపనిలో నతనికి డాక్టరు 'సైమను' అను నాతఁడు మిగుల దోడ్పడెను. బైనెట్ పండితుఁడు కొన్ని యేండ్లు శ్రమపడి సామాన్యమైన తెలివిగల బాలురాయా వయస్సులోఁ జేయు పనులను దెలుపు పట్టీ నొకదానిని సిద్ధము చేసెను. ఈపట్టీలో మూఁడేండ్లనుండి పదునైదేండ్లవరకును నుండు బాలు రొక్కొక్కని బరీక్షచేయు విధానము వివరింపఁబడినది.

దృష్టాంతముగ బైనెట్ పట్టీలోనుండి యెనిమిదేండ్ల వయస్సులోనున్న బాలురను బరీక్షించుట కుపయోగింప వలసిన కొన్ని ప్రశ్నల నిచటఁ జూతము.

1. ఈఁగకును శీతాకోకచిలుకకును గల భేద మేమి? అట్లే రాతికిని, అద్దమునకును, అట్టకును గలభేద మేమి?

2. ఇరువదినుండి యొకటివరకుఁ గల యంకెల నన్నింటిని వెనుకకు లెక్కించుము.

3. (అసంపూర్ణముగ నుండు పటమును జూపి) దీనిలో నేమి కొదువగా నున్నదో చెప్పుము.

ఇట్టి ప్రశ్నలను విద్యార్థి కిచ్చునపు డుపాధ్యాయుఁడు గమనింపవలసిన విధులు కొన్ని గలవు. వాని ననుసరించియే యీ పరీక్షలను జేయవలయును. ఈపరీక్షలో నెనిమిదేండ్ల వయస్సుగల బాలుఁడు కృతార్థుఁ డైనయెడల నతఁడు సామాన్యబాలుఁ డనిపించుకొనును. అట్లు కృతార్థుఁడుకాక యేడేండ్ల బాలుఁడు చేయఁగల పనులనే చేసి, యేడేండ్ల బాలుని కుండవలసిన తెలివినే యాగపఱచిన యెడలఁ బరీక్షింపఁబడిన బాలునివయ స్సెనిమి దేండ్లయినను వాని మానసిక వయ స్సేడేండ్లే యగును. అదేబాలుఁ డొకవేళఁ దొమ్మి దేండ్ల వయస్సుగల బాలుఁడు చేయఁగల పనులను జేసినయెడల వాని మానసిక వయస్సు తొమ్మిదేండ్లు అగును. ఈపట్టిఁబట్టి యెనిమిదేండ్ల బాలుని మానసిక వయస్సుకూడ నెనిమిదేండ్లే యయిన యెడల నట్టిబాలుఁడు సామాన్యబాలుఁ డనఁబడును.

ఒక బాలుని మానసిక వయస్సును సహజవయస్సుతో భాగించి నూటితో గుణించినయెడల నాబాలుని 'తెలివి పరిమితి'ని దెలిసికొనవచ్చును.

ఈ తెలివిపరిమితి యెవరికిఁగాని పదునాలేండ్ల వయస్సుదనుక హెచ్చును. పిదప హెచ్చదు. బైనెట్ యొక్క సిద్ధాంతములను బరిశీలించి తెలివి పరిమితిని గనుఁగొను పద్ధతిని "టర్మన్" అను పండితుఁడు కనిపెట్టెను. ఈ తెలివిపరిమితి జీవితాంతపర్యంతము మారక యేకరీతిగా నుండును.

బైనెట్ పరీక్షల నున్నవి యున్నట్లు యిప్పుడంతగా నెవ్వరుగాని వాడుటలేదు. ఈపరీక్షలలోఁ గావలసినమార్పులను జేసి యుపయోగించు విధము నిగ్లండు దేశములో బర్టు అను పండితుఁడును, బాలర్డు అను పండితుఁడును గనిపెట్టిరి. అమెరికా దేశములో వీని నుపయోగించు విధమును టర్మన్ అను పండితుఁడు కనిపెట్టెను.

బైనెట్ విధానము ననుసరించి యొక్కొక్కబాలుని బ్రత్యేకముగఁ బరీక్షింపవలయును. అట్టి పరీక్షచేయుట కొక్కొక్క బాలునికిఁ గనీసపక్ష మిరువది నిమిషములుగాని, ముప్పది నిమిషములుగాని

కాలము పట్టును. కనుక జాలమంది విద్యార్థులను పరీక్షింపవలసినపుడీ పద్ధతిప్రకారము కొన్ని దినముల కాలము కావలసియుండును. కనుక పండితులు బాలురను గుంపులుగఁ బరీక్షచేసి వారి తెలివిని గనుగొనుట కేర్పాటులు చేసియున్నారు.

విద్యార్థుల తెలివిని తూకము వేయుటకీ పరీక్షల నెంతవఱకు సాధారముగఁ గొనవచ్చునని కొందఱడుగుదురు. ఇది యడుగఁదగిన ప్రశ్నయే. ఏలయన: పాఠశాలలోఁ గొందఱు బాలురు మిక్కిలి మందముగ నున్నట్లగపడినను వారు పెరిగి పెద్దవారైన పిదపఁ జక్కని తెలివితేటల నగపఱచినారనుటకు నిదర్శనము లున్నవి. మన రాజధానిలో ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలోఁగాని, ఇంటర్మీడియటు పరీక్షలోఁగాని కృతార్థులు కాఁజాలనివారెందఱింగ్లండు మొదలయిన పాశ్చాత్యదేశములకుఁబోయి, యున్నతవిద్యను బొంది మంచి పట్టములను సంపాదించుకొని రాలేదు? అట్లని, యీ తెలివి పరీక్షలవలనఁ బ్రయోజనము లేదని చెప్పఁజాలము. చిన్నతనములో మొద్దుగనుండి తరువాత గొప్ప తెలివితేటలగపఱచు బాలురు మిక్కిలి యరుదు. అట్టివారికీ తెలివి పరీక్షలువర్తించవు. కాని సామాన్యముగఁ జెప్పిన యెడల నీ తెలివి పరీక్షలమూలమున నించుమించు నికరముగ విద్యార్థుల తెలివిని తూకముగ చేయవచ్చునని చెప్పగలము.

తెలివి పరీక్షవలన మేలులు:— మన దేశములో ననేక మిషనరీ పాఠశాలలు గలవు. వానిలో బడిస్థలములును, ఉచితవిద్యావేతనములును గొన్నిమాత్రమే యుండును. కాని, ఆ కొన్నె యుచిత విద్యావేతనములకు దరఖాస్తుచేయువా రనేకులుందురు. అప్పుడు వారిలో నెవ్వరిని బడిలోనికిఁ జేర్చుకొనవలయు ననుప్రశ్న యుదయించును. అట్టి తరుణములలో సామాన్యముగఁ జేయు పరీక్షలను విడిచి, యీ తెలివి పరీక్షలమూలమున బాలుర నేర్పఱచుకొన్నయెడల నట్టి మిషనరీసంఘములవా రుచితవిద్యార్థి వేతనములకై వెచ్చపెట్టుచున్న ధన మర్హులగు బాలురకొఱకై వ్యయము కాఁగలదు. కొన్ని

పాఠశాలలలో బాలుర తెలివినిబట్టి తరగతుల నేర్పఱచి పాఠముల నేర్పఱచి పాఠములను జెప్పుట కేర్పాటులున్నవి. అట్టి పాఠశాలలలోని బాలురను దరగతులుగ విభజింపవలసినపు డీ పరీక్షలు మిగులఁ బ్రయోజనకరములుగ నుండును. అంతియకాక యీ పరీక్షలమూలమున విద్య నేర్పుట కవకాశములను గల్పింపవచ్చును.

కాని యీ మానసిక పరీక్ష విధానమునఁ బ్రత్యేక శిక్షణము పొందినవారే వీనిని జరుపవలయును. అందఱును వీని నుపయోగింపజాలరు. ఈ పరీక్షలను జరుపుట కెక్కువ కాలము పట్టును. పరీక్షకులు మిగుల నోర్పుగలవారై యుండవలయును. ఈ పరీక్షలమూలమున నొక బాలుని తెలివి యిట్టిదని దృఢముగఁ జెప్పలేము. ఇవి యీ పరీక్షల విధానములోని లోపములు. మన దేశములో నీపరీక్షలంతవిరివిగా వ్యాప్తిలో లేవు. ఇప్పుడిప్పుడే మన దేశములోని విద్యావేత్తలు వీని ప్రయోజనమును గ్రహించుచున్నారు. ఇట్టి మానసిక పరీక్షలు వ్యాప్తిలోకి వచ్చినపుడే యిచ్చటి బాలుర తెలివితేటలను నిశ్చయించి, వీరి పురోభివృద్ధికి దగిన విధమున శిక్షణము నిచ్చుటకు వీలగును.

## ప్రశ్నలు

(1) తెలివి యనఁగా నేమి?

(2) బాలుర తెలివిని కనుగొనుటకు బడిపరీక్షలు తగిన సాధనము లేవా? కారణములను వ్రాయుము.

(3) మానసిక వయస్సు అనగా నేమి? దానిని నీ వెట్లు నిశ్చయము చేయుదువు?

(4) మానసిక పరీక్షలవలని మేలు లెవ్వి?

(5) బైనెట్ పండితుని జీవితచరిత్రను సంపాదించి చదువుము.

# 16. తల్లిదండ్రుల తోడ్పాటు

ఒక బాలుఁడు బడిలోఁ బ్రవేశించినప్పుడే యతని విద్య ప్రారంభమైన దని దలంచుట గొప్ప పొరబాటు. బాలుఁడు పుట్టిన దినము నుండియు నతని విద్య ప్రారంభమగుచున్నది. పుట్టినప్పుడు బాలుఁడు నిస్సహాయుఁడై యుయ్యాలలో నుండినపుడే తన చుట్టుప్రక్కలనున్న మనుష్యులను, వస్తువులను గమనించుచుండును. ధ్వనులను విని వాని భేదములను, నర్థములను దెలిసికొనుచుండును. కొన్ని వస్తువులను దాఁకి చూచియుఁ గొన్నింటిని రుచిచూచియు వాని వానికిఁ గల భేదములను గ్రహించుచుండును. కొంచెమెదిగి నడువ గలిగినప్పటినుండియు మాటలాడఁగలిగి నప్పటి నుండియు బాలుఁడు నూతన విషయములను దెలిసికొనుట కవకాశము లనేకము లభించును. వానిమూలముననే బాలుని జ్ఞాన మతిత్వరితముగ వృద్ధి పొందును. ఈ జ్ఞానాభివృద్ధియే విద్య.

ఈ విద్యను బొందుట కవకాశముల నిచ్చునది గృహమును, అందలి కుటుంబము నని చెప్పవలయును. కుటుంబములోఁ దల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు కలిసి జీవింతురు. కావున బాలుఁడు వారినుండి దేహశుభ్రత, దుస్తులశుభ్రత, పెద్దలయెడ గౌరవము, పిన్నలయెడ దయ, తల్లిదండ్రులకు విధేయుఁడై మెలఁగుట అన్యోన్యముగఁ బ్రవర్తించుట మున్నగు వానిని దన యింటికడనే నేర్చుకొనుచున్నాఁడు; కావుననే ప్రతిబాలునికిని వానియిల్లు ప్రథమ పాఠశాల యని యనవచ్చును.

బాలుఁడు బడిలోఁ బ్రవేశించిన పిదప సైతము జరుగునదేమి? దినమున కైదారుగంటలు మాత్రమే బడిలో నుపాధ్యాయులకడ నుండును. తక్కిన కాలమంతయు నింటనే యుండునుగదా! ఇంటిలోఁ దగిన వసతులుగాని క్రమశిక్షణముగాని లేకున్నయెడల బడిలో నుపాధ్యాయులు బాలుని యభివృద్ధికై చేసిన కృషి యంతయు వ్యర్థము కాఁగలదు. కుటుంబములో తల్లిదండ్రులు జ్ఞానవంతులై తమబిడ్డలను

నీతిమార్గమునఁ బెంచుటకు యత్నించినచో నట్టి తల్లిదండ్రులు ఉపాధ్యాయుల కృషి కెంతయు దోహద మొసగినవారగుదురు. ఈసందర్భమున నారాయణచంద్రవర్కరుగారు చెప్పినమాటలు గమనింపదగి యున్నవి. అవి యేవన: "మన దేశములోని విద్యావిషయిక సమస్యలను గూర్చిన చర్చలలో మన పూర్వుల విద్యాశయములను, పద్ధతులను నీ కాలపు ప్రజలు ఖండించుట మనము వినుచున్నాము. ప్రస్తుతపు యువకులలో నున్న చట్టతిరస్కార భావము, ఆత్మనిగ్రహ శూన్యత, వినయభావ రాహిత్యమున కిప్పటి విద్యావిధానమును, నుపాధ్యాయులే కారణమని యాచర్చలయందు గొందర నుచుందురు. కాని విద్యార్థులు పాఠశాలల, కళాశాలల యందే తమ కాలము నంతను గడపుట లేదనియు, వారెక్కువకాల మెచ్చట గడుపుచున్నారో యట్టి గృహములును మానవసంఘమునుగూడఁ బాఠశాలలే యనియు నట్టివారు గమనింపవలసియున్నది. ఈ సంస్థలును యువకుల యభివృద్ధికిఁ దోడ్పడవలసియున్నవి కనుక నిప్పటికాలమున నున్నయువకుల నైతిక ప్రవర్తనము క్షీణించుటకుఁ బాఠశాలలు కళాశాలల కంటె బాలుర కుటుంబములును, మానవసంఘమునే కారణములని చెప్పవలసియున్నది." బాలుర శిక్షణమునకును కుటుంబమునకును నింతయవినాభావసంబంధ ముండుటవలననే యుపాధ్యాయులకుఁ దమ విద్యార్థులయొక్క తల్లిదండ్రుల తోడ్పాటవసర మగుచున్నది.

కనుక నుపాధ్యాయులు తమ విద్యార్థులయొక్క తల్లిదండ్రులను వారి వారి యిండ్లయొద్ద దర్శించి, వారితో సంభాషణల జరిపి వారి పరిచయము కలుగజేసికొనవలయును. ఈ విధముగఁ జాలమంది తల్లిదండ్రులతోఁ బరిచయము కుదిరినపిమ్మట నుపాధ్యాయుడు వారి నందఱ నొక్కసంఘముగా నేర్పరచుటకుఁ బ్రయత్నింపవలయును. దీనికే తల్లిదండ్రుల సంఘమని పేరు.

తల్లిదండ్రుల సంఘము: ఉద్దేశములు:— తల్లిదండ్రుల సంఘముయొక్క యుద్దేశములను వివరింపవలసియున్నది. తల్లిదండ్రులు

గ్రామపాఠశాలయందు శ్రద్ధఁ బూనునట్లు చేయుట యీ సంఘముయొక్క మొదటియుద్దేశము. సామాన్యముగా నిక్కాలమున గ్రామములోనిజనుల కచ్చటి పాఠశాలయం దభిమానము కొంచమైన నుండుటలేదు. పాఠశాల తమబాలుర మానసిక నైతికాభివృద్ధుంకొఱ కేర్పడినదనియు, తామెల్లరు శ్రద్ధఁబూని యది జయప్రదముగఁ బనిచేయునట్లుతోడ్పడ వలసియున్నదనియు నిట్టి భావము ప్రస్తుతము గ్రామస్తులలో లేదు. ఇట్టిభావము కలుగజేయుట తల్లిదండ్రుల సంఘముయొక్క ప్రధానోద్దేశమని చెప్పనక్కరలేదు. కొన్ని గ్రామములలోఁ బాఠశాల మిక్కిలి చిన్నదగు నింటిలోనుండి, బాలురకు స్థలము చాలకమిగుల గష్టపడుచుందురు. లేదా బడికిఁ గావలసిన తోటస్థలముగాని, ఆట స్థలముగాని లేక యవస్థలు పడుచుందురు. అట్టిపరిస్థితులలో బాలుర తల్లిదండ్రులు పాఠశాలకు వలయు స్థలమును సంపాదించుటకుఁ దోడ్పడుట వారి విధియైయున్నది. మరియు నూతనపాఠశాలానిర్మాణ మవసరమైనచో నందఱును గలసి దానికిఁ గావలసిన రాళ్ళు, కట్టె సామానులు కొనుటకుఁ జందాలనిచ్చియు, నుచితముగఁ బాఠశాలా స్థలమునకు ఆ వస్తువులఁ దెచ్చిపెట్టియు సాయము చేయవలయును. గ్రామపాఠశాలలు వృద్ధిపొందవలయునన్న డిస్ట్రిక్టుబోర్డువారు, లేదా మిషనుయిలాకావారు బడికట్టించి కాపాడవలయును. అది మాపని కాదను భావ మంతరింపవలయును. "మాగ్రామములో నున్న పాఠశాల మా పాఠశాల, దానిని మేము వృద్ధిపొందింపవలసియున్న" దను భావము గ్రామస్థులలో గలుగవలయును. ఇట్టి భావముల గలిగించుటయును, తల్లిదండ్రులు పాఠశాలాభివృద్ధికొఱకు పనిచేయునట్లు చేయుటయును, తల్లిదండ్రుల సంఘముయొక్క ప్రధానోద్దేశము.

తల్లిదండ్రులు బడివయస్సులో నున్న తమబిడ్డల నందరినిఁ బాఠశాలకు బంపునట్లు చేయుట యీ సంఘముయొక్క రెండవ యుద్దేశము. విద్యార్థులు లేనిదే పాఠశాల యుండఁజాలదు. గ్రామములో నున్నవారిలోఁ గొందరకుఁ దమ బిడ్డలను బడికిఁ బంపు నుద్దేశమే యుండదు. తల్లిదండ్రుల సంఘ మట్టివారినిగూర్చి యాలో

చించి వారును దమ బిడ్డలను బడికిఁ బంపునట్లు చేయువలయును. ప్రస్తుత పరిస్థితులను జూడ నుపాధ్యాయుఁడు తన బ్రతుకు దెరువు నిమిత్తము బాలురను బడికిరమ్మని బ్రతిమాలుకొనుచున్నట్లున్నది. తమ బిడ్డలు విద్య నేర్చుకొనుటవలన జ్ఞానవంతులు కాఁగలరను తలంపేమాత్రము తల్లిదండ్రులలో నున్నను వారు తమ బిడ్డలను బడికి తప్పక బంపుదురు గ్రామములోని తల్లిదండ్రులందరు తమతమ బిడ్డలను బడికి బంపునట్లు చూచుటకొరకై యుపసంఘ మవసరమైనచో తల్లిదండ్రుల సంఘమట్టి యుపసంఘమును దనలోనుండి యేర్పరుపవలయును. బాలురు బడికిఁ గ్రమముగఁ బోవునట్లు చేయుట మూలమునఁ దల్లిదండ్రుల సంఘము పాఠశాల కెనలేని యుపకార మొనర్చించిన దగును.

బడిలో బాఠముల బోధనకుఁ గావలసిన వసతులను గల్పించుట మూఁడవ యుద్దేశము. పాఠశాల మేనేజమెంటు వారి ధనాభావము చేతనో, యశ్రద్ధవలననో ప్రస్తుతముండు పాఠశాలలలో నాసనములు, పటములు, ఉపకరణములు మున్నగున వెన్నియో కొరతగానున్నవి. ఉపాధ్యాయులు తమ దారిద్ర్యము మూలమున వానిని గొనలేక యున్నారు. పాఠశాలలోని యుపాధ్యాయుల మూలమున నట్టికొరతలను గూర్చి తెలిసికొని తల్లితండ్రుల సంఘములు వానిని సేకరించుటకుఁ బ్రయత్నింపవలయును. ఇట్టి యుపకరణములు తెచ్చి యిచ్చినందువలన మాకేమియు రాదు గదా యని వారు తలంపరాదు. మరియుఁ బ్రకృతి పాఠముల బోధనసందర్భమున విద్యార్థులు జంతువులనుగాని తోటలోని మొక్కలనుగాని, మొరువులుచేయు పద్ధతులను గాని గమనింపఁ గోరినచో వారి కట్టివసతులను గల్పింపవలయును. విద్యార్థులు చరిత్రమున్నగు పాఠములను నేర్చుకొనునపుడు దగ్గరనున్న గ్రామములకో లేదా వనములకో వెళ్ళుట యవసరమైనపుడు సాధ్యమైనంతవరకు వాహనముల నేర్పర్చియు నితరవిధములగు సౌకర్యములను గల్పించియు బాలురకుఁ దోడ్పడుట యీ సంఘముల యుద్దేశము. పాఠశాలలోని గ్రంథాలయమునకు గ్రంథముల నిచ్చియు, బాలురు బాలభటోద్యమమునఁ గాని రెడ్ క్రాస్

సంఘములోఁగాని చేరి తమ యవసరవ్యయములకు సొమ్ము నడిగి
నపుడు వారికి దానిచ్చియుఁ దల్లిదండ్రులు పాఠశాలలకుఁ దోడ్పడ
వలసియున్నారు.

పాఠశాలయొక్క యుద్దేశములు నెరవేరుటకుఁ దోడ్పడుట
నాలుగవ యుద్దేశము. బాలునియొక్క శారీర మానసిక నైతిక
శక్తులను వృద్ధిపొందించుటకుఁ బాఠశాల పాటుపడును. ఈ యుద్దే
శములను తల్లిదండ్రుల సంఘము గమనించి యా యుద్దేశములు నెర
వేరుటకుఁ దాముచేయవలసిన పనిని వారు సమ్యక్కముగఁ జేయవలసి
యున్నారు. బాలుర దేహములు వృద్ధిపొందుటకుఁ దల్లిదండ్రులు
దమకుగల యాహారములలో నుత్తమములగు వానిని బడిలోఁజదువు
చున్న తమ బాలుర కియ్యవలయును. మరియుఁ బాఠశాలకు వేళకు
సరిగాఁ బోగలుగున ట్లన్నమును దగినవేళకుఁ జేసిపెట్టవలయును.
శుభ్రత యవసరముగనుకఁ బాఠశాలకు బోవునపుడు ధరించుటకని
బాలురకు శుభ్రమగు దుస్తులను తల్లిదండ్రులు ప్రత్యేకముగ నుంచ
వలయును. ఇట్లు చేయుటవలన దల్లిదండ్రులు పాఠశాలయొక్క పనిలో
నుపాధ్యాయునకి దోడ్పడినవా రగుదురు. ఉపాధ్యాయుఁడింటియొద్దఁ
జరుపవలసిన పాఠముల నిచ్చి యున్నయెడల బాలుఁడు వాని నింటి
దగ్గఱ సిద్ధముచేసికొనునట్లు హెచ్చరికచేసి ఆ సిద్ధముచేసికొనుటకుఁ
గావలసిన వసతులను గల్పించి తల్లిదండ్రులు తోడ్పడవలయును.
మఱియు బాలురకుఁ గావలసిన పుస్తకములు, కాగితములు,
పెన్సిళ్ళు మున్నగువస్తువులను వారికిఁ గొనిపెట్టియు, వారిని సంవత్స
రము పొడుగున బడికిఁ గ్రమముగఁ బంపియు తల్లిదండ్రులు పాఠ
శాలతో సహకారము సలుపవలసియున్నారు. బాలురింటియొద్ద
నున్నపుడు తమయింటిలో నన్నదమ్ములతోఁగాని, యిరుగు పొరుగు
బాలురతోఁగాని కలహించి బూతులాడుటయు, దొంగతనము, అబ
ద్ధము మొదలగువానికిఁ జోటియ్యకయ యుండునట్లు చూడవల
యును. లేకున్నచో బడిలో నుపాధ్యాయుఁడు నేర్పిన నైతిక ప్రవ
ర్తనమునకు భంగము వాటిల్లును.

కాని తల్లితండ్రుల సంఘములు పైనఁ జెప్పినవిధమున బ్రవర్తింపఁగలుగుటకుఁ దల్లిదండ్రులును విద్యావంతులై యుండవలయును. కాని మనదేశములోఁ బ్రస్తుతము విద్యావంతులగు తల్లిదండ్రులు మిక్కిలి యరుదుగా నున్నారు. కనుక నుపాధ్యాయుల పని కష్టతరముగా నుండును. అయినను నుపాధ్యాయులు ధైర్యమువదలక తల్లిదండ్రుల సంఘముల నేర్పరచి వారికిఁ దమచేతనైన కొలఁది విద్యావిషయములను బోధించి పనిచేయవలయును. తల్లిదండ్రులు విద్యావంతులు కారని యే ప్రయత్నమును జేయకుండుట, యుత్తమోపాధ్యాయుని లక్షణము కాదు.

పై యుద్దేశములు నెఱవేరుటకుగల మార్గములు :—తల్లిదండ్రుల సంఘముల యుద్దేశము లెట్టివై యుండవలసినదియుఁ బైన వివరించితిమి. ఆ యుద్దేశములు నెఱవేరుటకుగల మార్గముల నిప్పుడు విచారింపవలసియున్నది. ఆ యుద్దేశములు నెఱవేరుటకు బాలుర తల్లిదండ్రులకును నుపాధ్యాయునికిని గల స్నేహము ముఖ్యసాధనమని చెప్పవలయును. ఈస్నేహ మెట్లేర్పడును? ఉపాధ్యాయుఁడు తల్లిదండ్రులను వారివారి గృహములయందు దనకుఁగల విశ్రామకాలమున దర్శించి, వారితో స్నేహము చేసికొనవలయును. పాఠశాలకు వచ్చిన బాలురకు నేను పాఠములను బోధింతునుగాని మిగత బాలురతో నాకుఁ బనిలేదను నుపాధ్యాయుఁడు తన కర్తవ్యమును సరిగా గ్రహింపలేదని చెప్పవచ్చును. బాలుని తలిదండ్రులు వాని విద్యయందు శ్రద్ధవహించునట్లు చేయు నుపాధ్యాయునిపని నూటికి లేబదిరెట్లు సులువగునని యతఁడు గ్రహింపవలయును. బాలుని బడిపనియందుఁ దల్లిదండ్రులేమియు శ్రద్ధ చూపనియెడల నుపాధ్యాయుని కృషి యంతగా ఫలింపదు. ఈవిషయము నుపాధ్యాయులు బాగుగా గుర్తింపవలయును. బడివయస్సులోనున్న బాలబాలికలు గల తలిదండ్రులతో నుపాధ్యాయుఁడు వారిని బడికిబంపు విషయము మాటలాడవలయును. మఱియు తల్లిదండ్రులే తమ బిడ్డలను, కుమారుని లేదా కుమార్తెను బడికి తీసికొనివచ్చి విడుచుట మంచిది. ఇట్లు

చేసినచో నప్పు డుపాధ్యాయుఁడు వారితో మాటలాడుటకు మఱి యొక తరుణము లభించును. తమ బిడ్డలను దామే బడికిఁ బిలుచుకొని వచ్చు తలిదండ్రులు వారి విద్యా విషయమునను, బడి విషయమునను శ్రద్ధవహింతురని నమ్మవచ్చును.

సంవత్సరమున కొక పర్యాయము పాఠశాలయొక్క సాంవత్సరికోత్సవమును జరిపి దానికి విద్యార్థుల తల్లిదండ్రుల నందఱ నాహ్వానింపవలయును. ఆయుత్సవమునాటికి తల్లిదండ్రుల నానందింప జేయఁగల కార్యక్రమము నొకదాని నేర్పరచి దానిని బాలురు చక్కఁగా నిర్వహించుట కేర్పాటులు చేయవలయును. కార్యక్రమము నందొక చిన్న నాటకము నయిత ముంచుట మంచిది. ఉత్సవమును జూచుటకు వచ్చిన తల్లిదండ్రులు తమ తమ బిడ్డలు విద్యయందెంతవరకు వృద్ధిపొందిరనియు వారి యాటపాటల మూలమునను, సంభాషణ మూలమునను, నుపాధ్యాయుల మాటల మూలమునను, బాలురు పొందఁగల పారితోషికముల మూలమునను దెలిసికొందురు.

అప్పుడప్పు డుపాధ్యాయులు పాఠశాలలోని విద్యార్థులకు వ్యాయామపుఁ బోటీపందెముల నేర్పఱచి వానికిఁగూడ బాలుర తల్లిదండ్రుల నాహ్వానింపవలయును. తమతమ కుమారులు పోటీపందెములలో గెలుపొందుట చూచునప్పుడు తల్లిదండ్రుల హృదయము లానందముతో నుప్పొంగును. పాఠశాలలో సంవత్సరమున కొక్కటియైనను నాటకమును బాలురకు నేర్పి దానిని బాలుర తల్లిదండ్రుల యెదుట వారు ప్రదర్శించునట్లు చేయవలయును. ఇదియు దల్లిదండ్రుల కుత్సాహమును గలిగించును. లేదా, విద్యావిషయికము లయిన లాంతరుబొమ్మలను జూపుట కేర్పాటుచేసి యుక్తసమయమునఁ దల్లిదండ్రులకు జక్కని యుపన్యాసముల నిచ్చుటవలన బ్రయోజన ముండకపోదు.

'తల్లిదండ్రుల దిన'మను పేర నొకదినము నేర్పరచి నాఁడుబడిలో జరుగు పనిని దల్లిదండ్రులు వచ్చి చూచిపోవలయునని వారికి విన్నపములంపవలయును. ఆనాఁడు బడి నలంకరించుటకుగాని, శాలనిర్ణయ

పట్టికలో లేనిపనులు చేయుటగాని యుండరాదు. బాలురు తామా దినము చదువునట్లు విధించియుండు పాఠములను జదువుచుండ వలయును. ఉపాధ్యాయుఁడు నేర్పుచు నుండవలయును. తల్లిదండ్రులు వచ్చినప్పుడు ప్రధానోపాధ్యాయుఁడు వారిని గొన్ని చిన్నగుంపులుగ భాగించి వారు వెళ్ళి యొక్కొక్క తరగతిలో జరుగు పనిని మౌనముగఁ జూచివచ్చుట కేర్పాటు చేయవలయును. సాధారణముగఁ దల్లిదండ్రులు తమపిల్లలెట్లు చదువుచున్నారో తెలిసికొనుట కాశింతురు. అవసరమయినయెడల నాదినము సాధారణముగఁ జేయుదాని కంటె నొకగంట ముందుగనే బాలుర నిండ్లకుఁ బంపి యుపాధ్యాయులు తల్లిదండ్రులతో వారి వారి బిడ్డల విద్యాభివృద్ధిని గుఱించి వారితో సంభాషింప వచ్చును.

కొన్ని పాఠశాలలలో విద్యార్థియొక్క యభివృద్ధిని జూపు చీటిని ప్రతిబాలునకు సంవత్సరమునకు రెండు మూఁడు పర్యాయములు పరీక్ష లయినతోడనే యిత్తురు. ఆ చీటిలో నా బాలుని వయస్సు, పరీక్షలోవచ్చిన మార్కులు, నడవడినిగూర్చి యుపాధ్యాయుల యభిప్రాయము మున్నగు విషయములను వ్రాయుదురు. బాలు రా చీటీల నిండ్లకుఁగొనిపోయి తమ తల్లిదండ్రులకు వానిని జూపి వారిచే సంతకములు చేయించుకొని వత్తురు. ఈ పద్ధతివలనఁ దమ బాలురు బడిలో నెట్లు చదువుచున్నదియు తల్లిదండ్రులకుఁ దెలియ గలదు.

తల్లిదండ్రుల సంఘము పనిచేయు విధము:— గ్రామములో నేర్పడిన తల్లిదండ్రుల సంఘమునకు ఆ గ్రామములోని విద్యావంతులలో నుత్తముఁడును గౌరవనీయుఁడును నగు నొక పెద్దను అధ్యక్షునిగా నేర్పఱుపవలయును. అతఁడే సంఘమునకుఁ జెందిన సొమ్మును భద్రము చేయువాఁడుగఁ గూడ నుండవలయును. పాఠశాలోపాధ్యాయులలో నొకరు సంఘకార్యదర్శిగఁ బనిచేయవలయును. ఈ సంఘము కనీసము మూఁడునెలల కొకతూరియైనను సమావేశము కావలయును. ఆ సమావేశమునకు సామాన్యముగ నొక చిన్న ప్రదర్శనము

నేర్పఱచి దానిలో విద్యార్థులు పాటలు, పద్యములు మున్నగు వానిని రాగయుక్తముగఁ జదువునట్లును, తల్లిదండ్రులను సంతోషపెట్టునట్లును నేర్పాటుచేయవలయును. అదియైన తరువాత విద్యార్థు లింట్లకుఁబోగా నుపాధ్యాయులును దల్లిదండ్రులును పాఠశాలకుఁ జెందిన సమస్యలనుగుఱించి చర్చ చేయవలయును. ఆ సమయమునఁ దల్లిదండ్రు లుపాధ్యాయులను బ్రశ్న లడుగవచ్చును. లేదా యుపాధ్యాయులు బాలురలోఁ గొందరు క్రమముగ బడికి రాకుండినను, పాఠములను జదువకయుండినను నట్టిబాలుర తల్లిదండ్రులతో వారినిగూర్చి సంప్రతింపవచ్చును. లేదా, పాఠశాలలోనేదో యొక క్రొత్త చేతిపని నేర్పనై యున్నను లేదా, పాఠముల ప్రణాళికలోని పనులను బాలుర చేతఁ జేయింపదలచియున్నను, లేదా, పాఠశాలయంతయు విహారమునకు వెళ్ళదలఁచియున్నను ఆయా విషయములనుగూర్చి యుపాధ్యాయులును దల్లిదండ్రులును గలిసి యాలోచించుట కది యుత్తమమగు తరుణముగా నుండఁగలదు. మఱియుఁ బాఠశాలలోని గ్రంథాలయావసరములను గూర్చియు నితర అక్కఱనుగూర్చియు బ్రధానోపాధ్యాయుఁడు తల్లిదండ్రులతో ముచ్చటింప వచ్చును.

**పాఠశాలనుగూర్చి ప్రచారము:**—ఉపాధ్యాయులు గ్రామములో విద్యవలని లాభములనుగూర్చియు, బాలురను జిన్నతనముననే బడికిఁ బంపుటనుగూర్చియు విరివిగఁ బ్రచారము చేయవలయును. తా మే గ్రామములో బనిచేయుచున్నారో యా గ్రామములోనుండి నిరక్షరత్వమును బాఱద్రోలుటకు ఉపాధ్యాయులు కృతనిశ్చయులు కావలయును. ఆయుద్దేశముతో నుపాధ్యాయులు గ్రామములోని జనాభానువ్రాసి చదువు వచ్చినవారియొక్కయు, చదువు రానివారియొక్కయు లెక్కలను సిద్ధముచేసి యుంచుకొనవలయును.

అట్లే గ్రామములోనున్న బాల బాలికలలో బడివయస్సులోనున్నవా రెవరని తెలిసికొనుట కొక పట్టీని సిద్ధము చేయవలయును. ఈ విధముగా సిద్ధముచేసికొని గ్రామములోని విద్యను గూర్చిన విషయములన్నియు సమగ్రముగ గ్రహించినపిదప నుపాధ్యాయులు

గ్రామములోని నిరక్షరత్వముతో నెడతెగని పోరు సలుపవలయును. ఆ పోరు జయప్రదముగ సాగుట కుపాధ్యాయులు బడివయస్సులో నున్న బిడ్డలందఱును బడికి వచ్చులాగునఁ జేయవలయును. అట్లు చేయఁగలనను నమ్మక ముపాధ్యాయున కుండవలయును. తన యత్నము శ్లాఘ్యమైనదనియు, నది తప్పక సఫలమగుననియు నతఁడు పూర్ణముగ నమ్మవలయును అట్టి నమ్మకము లేనివాఁడు బడిపక్షమున ప్రచారమును సాగింపఁజాలఁడు. ఆప్రచారము సాగించుటలో నా గ్రామమందలి విద్యకు సంబంధించిన లెక్కలను బాగుగ నెఱిగి యుండి వాని నెత్తిచూపుచు గ్రామస్థులకు దన మాటలయందు విశ్వాసము కలుగఁ జేయవలయును.

పిల్లల తల్లిదండ్రులు తమ బిడ్డలను బడికిఁ బంపుటకు జెప్పగల యాటంకములను సావధానముగ విని వానిని దన చేతనైనంతమట్టు నకు నివారణచేయవలయును. తల్లిదండ్రులు పేదలగుటచేత నుదయముననే బాలురు పనికిఁ బోవలసి యుండినయెడల వారు బడికి రాఁగల సమయమున బడిపనిని జరుపుట కేర్పాటుచుకొనవచ్చును. గ్రామములోని జనులందఱకు ముమ్మరముగఁ బనియుండు కాలమునను బండుగుల సమయమునను బడికి సెలవు లేర్పాటుచేసి తల్లిదండ్రుల యభ్యంతరములను దీర్పవలయును. బడిని బాలుర కాకర్షణీయముగఁ జేసియు నుత్తమ బోధనాపద్ధతుల నవలంబించియు గ్రామ జీవితములో బడికిఁ బ్రధానస్థానమును సంపాదింప వలయును.

పాఠశాలనుగూర్చిన ప్రచారమును జేయుట కుపాధ్యాయుడు తల్లిదండ్రులతో వారివారి యిండ్లయొద్ద మాటలాడవలసి యుండును. ఆ మాటలాడునపుడు తల్లిదండ్రుల సందేహములను దీర్చుటకును, విద్యయెడల వారికి సద్భావము గలుగఁ జేయుటకును నుపాధ్యాయుఁడు సిద్ధపడి యుండవలయును, 'పాఠశాలాదినము'న విద్యాధనమునుగూర్చిన యారోక్తులను పెద్దపెద్ద యట్టలమీాద వ్రాసి వానిని బాలురచేఁ బట్టించుకొని గ్రామ వీధులలో నూరేగింపు చేయుచు నక్కడక్కడ విద్యవలన లాభములనుగూర్చి చిన్నచిన్న ప్రసంగము

లను జేయవలయును. అంతేగాక సంవత్సరమునకు రెండుమూడు పర్యాయములు బాలుర చేతిపనుల ప్రదర్శనముల నేర్పఱచి వానికి గ్రామస్థుల నాహ్వానించి పాఠశాలలోని బాలు రెట్టి చేతిపనులను చేయఁగలుగుచున్నదియు వారికిఁ జూపవలయును. డిప్యూటీఇన్‌స్పెక్టరుగారు బడిని బరీక్షించుటకు వచ్చిన కాలమున నాయనచే గ్రామస్థులకు విద్యనుగూర్చిన యుపన్యాస మిప్పించుటయుఁ దగినవిధే.

పైని వివరించిన విధములన్నిటి మూలమునను గ్రామ పాఠశాలలోని యుపాధ్యాయులు కృషిచేసి తల్లిదండ్రుల తోడ్పాటును బొంది గ్రామపాఠశాల మూలమున నచ్చటి యవిద్యను బోఁగొట్టి గ్రామమంతటికిని సేవజేయవలసియున్నది.

### ప్రశ్నలు

(1) ఒక గ్రామములో తల్లిదండ్రుల సంఘమును నీవు ఎట్లేర్పాటు చేయుదువో వ్రాయుము.

(2) నీవొక తల్లిదండ్రుల సంఘ సమావేశములో నున్నట్లూహించుకొని యా సమావేశములో జరిగినపని నంతను వివరింపుము.

(3) గ్రామములోని జనులు తమ యూరిలోని బడియెడలఁ బ్రస్తుతము చూపుచున్న నిరాదరణమునకుఁ గొన్ని కారణములను వ్రాయుము.

(4) ఒక కుటుంబములోని తల్లిదండ్రులు తమ కుమారులను బడికిఁ బంపుట కిష్టముగ లేరు. ఆ బాలురను బడిలోనికి రప్పించుటకు నీ వేమిజేయుదువు ?

---

## 17. పాఠశాల, గ్రామసేవ

ఒక గ్రామములోని పెద్ద లొకచోటఁగూడి వార్తలను జెప్పుకొనుటకు సాధారణముగాఁ బ్రతి గ్రామములోను నొక కేంద్ర ముండును. పాశ్చాత్యదేశములలో నిట్టి కేంద్రములు తేనీటిపానీయపు టంగళ్ళవద్ద నుండును. పాశ్చాత్యదేశములు మిగులఁ జలిదేశములు

కనుక నా యంగళ్ళలో నొకమూల నొకటి రెండు నిప్పళుంపట్లను, వానిచుట్టును బల్లలను నుంచుదురు. సామాన్యముగా గ్రామములోని పెద్దలు సాయంసమయములం దట్టియంగళ్ళయొద్ద జేరి, తేనీటి పానీయమును సేవించుచు, కబుర్లు చెప్పుకొనుచు గంటలకొలఁది కాలము గడుపుచుందురు. మన దేశములోని యిట్టి యంగళ్ళుగాని, తేనీటివంటి నిరపాయమగు పానీయమును సేవించుటగాని లేవు. కాని ఉష్ణదేశమగు మన హిందూదేశమున గ్రామములోని పెద్దలు నీడస్థలమును గోరి మిట్టమధ్యాహ్నమునను సాయంతనమునను నొక చావడిలోనో రచ్చకొట్టములోనో కూర్చుండి వార్తలు చెప్పుకొనుచుఁ గాలయాపనము చేయుదురు. చావడులుగాని, రచ్చకొట్టములుగాని, లేని గ్రామములలో నొక చెట్టునీడను బెద్దబండమీఁద గూర్చుండి మాటలాడుకొనుచుందురు. దీనినిబట్టి చూడఁ బ్రతిగ్రామములోను బెద్దలు గలసి మాటలాడుకొనుట కొక తగిన కేంద్రము గ్రామములో నుండు టవసరమని తెలియుచున్నది.

అట్టి కేంద్రములలోఁ గూడినప్పుడు పలువిధములగు విషయములను గూర్చి జనులు మాటలాడుకొనుచుందురు. అట్టి కేంద్రములను యోగ్యులైనవారు నడిపించినచో నవి గ్రామస్థుల కత్యంతోపయోగములుగ నుండఁగలవని మనము గ్రహింపవచ్చును. గ్రామోపాధ్యాయులు తమ విద్యవలనను సత్ప్రవర్తనమువలనను నిట్టికేంద్రములను నడిపించుటకుఁ గావలసిన యోగ్యతలను సంపాదించుకొన్నవారై యుండవలయును. అప్పుడు వారు గ్రామపాఠశాలను గ్రామకేంద్రముగ మార్చి బాహ్యప్రపంచపువార్తలను, ఆరోగ్యము, వ్యవసాయము మున్నగువానిని గూర్చిన యుపన్యాసములను గ్రామస్థులకు వినిపింపగలరు. గ్రామాభివృద్ధిని గూర్చి గ్రామములోని పెద్దలతో నాలోచనలు చేయుటకును, వివాదములకు బరిష్కారము చేసికొనుటకును నిట్టి కేంద్ర ముపయోగింపఁగలదు. గ్రామపాఠశాలతోఁ జేరి యట్టి కేంద్ర మున్నచో నచ్చట గ్రామాభివృద్ధికిఁ దోడ్పడు నితర విధములయిన కార్యములు నయితము జరుగగలవు. వానిమూలమున గ్రామసేవ చేయుటకు గ్రామపాఠశాలల కవకాశము లుండును.

పఠన మందిరము:—పాఠశాల గ్రామకేంద్రముగ నేర్పడుటకుఁ దోడ్పడునది పఠనమందిరము. ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులు తమ పాఠశాలలలో పఠనమందిరములను స్థాపించుటకు కొంత శ్రమపడవలసి యున్నది. ప్రస్తుత పరిస్థితులలో గ్రామములలో విద్యావంతులు లేరు. కనుక గ్రంథములుగాని, వార్తాపత్రికలుగాని చదువువారుండరు. ఉన్న కొలఁదిమందియు నిరుత్సాహముఁ జెంది గ్రంథపఠనమునం దాశ లేనివారై యుందురు. కావున మొదట నుపాధ్యాయులు తామే ప్రాంతవార్తాపత్రికలు సంపాదించియుఁ, దమయొద్దనున్న గ్రంథములతో మరికొన్ని చౌకగ్రంథములను జేర్చియు నుంచుకొని, గ్రామములోని విద్యావంతులకు వానిని జదువుటకై యిచ్చి గ్రంథములను జదువుటయం దాసక్తిని వారిలోఁ గలిగింపవలయును. పిదపఁ బాఠశాలలో నొక పఠన మందిరమును వారి సాయముతో స్థాపింపవలయును. ఆరంభముననే అనేకులు సభ్యులుగా వలెనని కోరరాదు. గ్రంథములను పత్రికలను నాశతోఁ జదివి మేలుపొందు సభ్యులయిదారుగురు చేర్పడినను జాలును. వారితోనే పఠనమందిరమును సాగింపవచ్చును. ఈ నైదారుగురు మఱియొక నైదారుగురను జేర్చినపుడు పఠన మందిరమునకు గ్రంథములు, పత్రికలు కొనుటకు సంవత్సరపు జందా నేర్పఱుపవలయును. అటుపిమ్మట సభ్యులలో నొకరిని నధ్యక్షుడుగను వేఱొకరిని కార్యదర్శిగను నేర్పఱుపవలయును. పఠన మందిరములోని గ్రంథములు, పత్రికలు మున్నగువానిని ఉపయోగింపవలసిన పద్ధతులను దెలుపుటకుఁ గొన్ని చట్టములను జేసియుంచుకొనవలయును. ఈచట్టములు పఠనమందిరము తెఱవబడు గంటలు, గ్రంథములను దీసికొనుటలో గమనింపవలసిన నియమములు, మందిరములోని గ్రంథములకేనియు సామానులకేనియు నష్టము గలిగించినచో దానిని సరిపెట్టు పద్ధతులును వివరముగఁ దెలుపునవియై యుండవలయును.

పఠనమందిరములవలని లాభములు:—గ్రామస్థులకు పఠన మందిరములవలన ననేకలాభములు కలుగగలవు. గ్రామస్థులు సద్గ్రం

ధములను జదువుటవలన వారికి జ్ఞానవికాసము గలుగును. నూతన విషయము లనేకము నేర్చుకొందురు. ప్రపంచవార్తలను దెలిసికొందురు. అంతేకాక మునుపు వ్యర్థపుచ్చుచున్న కాలమును సద్వినియోగము జేయుటకు జక్కని యవకాశములు పఠనమందిరమువలన దొరకును. ఒక్కొక్కప్పుడు త్రాగుడు మొదలగు దురభ్యాసములకులోనైనవారిని బాగుచేయుటకును, వ్యర్థప్రసంగములతోఁ గాలము గడపక గ్రంథములను జదివి మేలుపొందుటకు వసతు లేర్పడును. గ్రామములోనున్న వారందఱును నొక్కచోటికి జేరి గ్రామాభివృద్ధికి దోడ్పడు విషయములనుగుఱించి చర్చించుట కవకాశ మిచ్చుటయే గాక గ్రామస్థులలో నైక్యభావము వృద్ధిచేయును.)

(పెద్దలవిద్య:— మనదేశమున నూటికి తొంబదిమంది నిరక్షరులుగా నున్నారని దొరతనమువారి లెక్కలవలన దెలియబడుచున్నది. మనరాజధానిలో బ్రతిసంవత్సరము లక్షలకొలఁది రూపాయలు ప్రాథమిక విద్యకై వ్యయమగుచున్నను నక్షరాస్యులసంఖ్య హెచ్చకుండుట మిగుల విచారకరము. ఇట్టి పరిస్థితికిగల కారణముల నిదివఱకే తెలిసికొనియున్నాము. పాఠశాలలో బ్రవేశించి చదువు ముగింపకయే బాలురు పాఠశాలను విడుచుట యట్టి కారణములలో నొక ముఖ్యకారణమని గమనించితిమి. గ్రామములలో నేఁడట్టివారు వేలకొలది గలరు. (ఏ పాఠశాలకును పోకయే పెరిగి పెద్దవారైనవారును గలరు. వీరిని వారి యజ్ఞానమునందే విడువక జ్ఞానము కలిగింపవలసి యున్నది. వారికి జ్ఞానోపదేశము చేయు విధానమునకే పెద్దలవిద్యయని పేరు.) పెద్దలవిద్య యొక గొప్పసమస్య. సామాన్యముగ బెద్దలందఱును తమతమ జీవనమును సంపాదించుకొనుటకై పగలంతయుఁ బనులకుఁ బోవుదురు. వీరికి జ్ఞానోపార్జనమునకు సమయమేది? వారిలో ననేకులకుఁ బుస్తకముల మూలమున విద్య అబ్బదు అబ్బినను చిన్నబిడ్డవలె వారికి విద్య చెప్పలేము. వారికి విద్య నేర్పవలసిన పద్ధతులు వేరుగ నుండవలయును. ఆపద్ధతులను దెలిసినవారెచ్చట నున్నారు? పెద్దల విద్యావిధానమున కగు వ్యయమును భరించువా

రెవ్వరు? ఇట్టి చిక్కులనేకములు పెద్దలవిద్యయను సంగము నాలోచించువారెదుర్కొనవలసి యుండును.

కాని, ఈచిక్కులన్నిటినిగూర్చియుఁ గొంతవఱకు నాలోచించి గతకాలములో బెద్దలకు విద్య నేర్పుటకుఁ గొందఱు ప్రయత్నములు చేసియున్నారు (ఆ ప్రయత్నములు రాత్రి పాఠశాలల రూపమున మన రాజధాని యంతటఁ గొంతకాలము వ్యాపించెను.) కాని రాత్రిపాఠశాలలు ఫలదాయకములు గాని దొరతనమువారు వానిని ప్రోత్సహించుట మానివేసి యున్నారు. అట్లయ్యును గ్రామస్థులకు జ్ఞానమును బోధించి వారి మనస్సులను వికసింపఁజేయుటకు రాత్రులలోఁ దప్ప దక్కినవేళలు వారి కనుకూలముగ నున్నట్లు తోఁచదు. కాఁబట్టి గ్రామములోని యువకులను, నలుబదియేండ్లకు మించని పెద్దల నందఱను పాఠశాల కాహ్వానించి, వారికి రాత్రితరగతుల నేర్పఱచి, వారిలోఁ గొంచెముగఁ జదువగలిగినవారికి సులభశైలిలో వ్రాయబడిన గ్రంథముల నిచ్చి వారిచే జదివించియు, చదువు బొత్తిగా రానివారిని వేఱొక తరగతిగ నేర్పఱచి వారికి నూతనపద్ధతుల ననుసరించి బోధించియు చదువు నేర్పుట మిగులఁ బ్రయోజనకరముగ నుండగలదు.

ఆ నూతన పద్ధతులను గుఱించి కొన్ని మాటలను చెప్పవలసి యున్నది. ఇటీవల నమెరికా దేశములోఁ జేసిన కొన్ని పరిశోధనల మూలమున పెద్దలు చిన్నపిల్లలకంటె నధికత్వరితము విద్య నేర్చుకొనగలరనియు, చిన్నబిడ్డల కుపయోగించు పద్ధతులు గాని, గ్రంథములు గాని పెద్దలకు పనికిరావనియు, వారికి విద్య నేర్పువారు వారిలో నిరుత్సాహము కలుగఁ జేయక వారిని మెచ్చుకొనుచుఁ జదువు నేర్పవలయు ననియుఁ దెలిసికొని యున్నారు. ఈ విషయములను మనస్సునం దుంచుకొని ఫిలిప్పైన్ దీవులలోఁ బెద్దల విద్య సత్ఫలప్రదముగ సాగించిన శ్రీ లాబాక్ దొరగారు ఇండియాకు వచ్చి, తాను గనిపెట్టిన నూతనపద్ధతులను మన దేశ భాషలోఁ బ్రవేశపెట్టి యున్నారు. ఆ పద్ధతుల ననుసరించి మన రాజధానిలో నాంధ్రము

నవ్య, సజీవమునను పెద్దల చదువును త్వరితముగ నేర్పుటకు దగిన గ్రంథములు వెలువడినవి. ఆనూతన పద్ధతి చాల సులభమైనది. ఆ పద్ధతి ననుసరించి యెవరైనను దినమున కొకగంట చొప్పున జదివినయెడల మూడు నెలలలో బుస్తకమును ధారాళముగ జదువగలరు. ఆ గ్రంథముల వెలయు మిగుల స్వల్పము గనుక బోధనాభ్యసన పాఠశాలలలో నుండు విద్యార్థులును, ఆ శ్యాసకోపన్యాసక సమావేశములకు బోవు నుపాధ్యాయులును నాపద్ధతులను నేర్చుకొనుట మిక్కిలి కోరదగినయున్నది. ఈవిధముగ జదువు నేర్చుకొను వారు ప్రాతఃపూట నొక గంటసేపు చదువు నేర్చుకొనవచ్చును. పిదప నొక గంటకాల ముపాధ్యాయులు వారికి నానావిషయములనుగూర్చి యుపన్యాసములిచ్చి వారికి జ్ఞానాభివృద్ధి కలిగింపవచ్చును. ఆ యుపన్యాసములు—ఆరోగ్యము, వ్యవసాయము పద్ధతులు, ఆహార పదార్థములు, కుటీర పరిశ్రమలు మున్నగు విషయములను గూర్చినవై యుండవచ్చును.

కుటీర పరిశ్రమలలో నూలువడుకుట, కోళ్ళపెంపకము ముఖ్యముగ నెన్నదగియున్నవి. నూలువడుకు పరిశ్రమ మన దేశములో మిగుల బురాతన పరిశ్రమయైనను కారణాంతరముల వలన అది దేశములో నంతరించుచుండెను. శ్రీగాంధిమహాత్ముని యుద్బోధముల మూలమున నది మరల దేశములో దలయెత్తినది. జనులు తమ విరామకాలములో నీ నూలువడుకు పరిశ్రమను సాగించిన యెడల దమకుటుంబములకు సంవత్సరమునకు గావలసిన బట్టలకగు నూలు వడుకవచ్చును. లేదా వడికిన నూలును అమ్మకము చేసి పేదలు డబ్బు సంపాదించుకొనవచ్చును.

అట్లే కోళ్ళపెంపకముకూడ లాభదాయకమైన పరిశ్రమయే. ఆస్ట్రేలియా, అమెరికా మున్నగు దేశములనుండి ఇప్పుడు మన దేశమునకు గ్రొత్తరకముల కోళ్ళు దిగుమతి యగుచున్నవి.

అవి సంవత్సరముపొడుగునను గ్రుడ్లను పెట్టునవిగనుక వానిని పెంచుకొనువాని కధికలాభము కలుగగలదు. ఉపాధ్యాయుని కీవిష

యములు సరిగాఁ దెలియని యెడల వ్యవసాయశాఖకుఁ జెందిన యుద్యోగులు తమ గ్రామమునకు వచ్చినప్పుడు వారిమూలమున గ్రామస్థులకీ కోళ్ళ పెంపకమును గూర్చి యుపన్యాసముల నిప్పింప వలయును.

లాంతరు పటములు,—సామాన్యముగ వింత లాంతరు గ్రామ పాఠశాలలలో నుండదు. కాని గ్రామసేవఁ జేయగోరువారికిది మిగులఁ బ్రయోజనకరమగు యంత్రము. కనుక సాధ్యమగుచో నుపాధ్యాయులు మేనేజిమెంటువారి మూలముననో, యుపాధ్యాయుల సంఘముల మూలముననో యొక్కొక్క ప్రదేశములోనుండు కొన్ని పాఠశాలల యుపయోగార్థమై యొక వింతలాంతరు (మ్యాజిక్ లాంతరు)ను దెప్పించుకొని దాని ప్రదేశములోని పాఠశాలలన్నియు వంతుల ప్రకారము వాడుకొనుట యుక్తముగ నుండును. ఇప్పుడు నానావిషయములను గూర్చిన పటములు సిద్ధముచేయఁబడి యుండుటచే వానిని బాడుగ కెవరైనను దెప్పించుకొనవచ్చును. కాఁబట్టి యుపాధ్యాయసంఘమువారు సంఘముపక్షమున లాంతరును సంపాదించి బాడుగకు పటములను దెప్పించి యొక్కొక్క పాఠశాలకు బదిపదునైదు దినములు లాంతరు నుపయోగించుకొని గ్రామస్థుల కుపన్యాసము లిప్పించినపిదప లాంతరును బటములను మరల నుపాధ్యాయ కేంద్రమునకుఁ బంపుట కేర్పాట్లు చేసికొనవచ్చును.

ఆరోగ్యము, శిశురక్షణ, కలరా, క్షయవ్యాధి, మలేరియా, ప్లేగు మున్నగు నారోగ్యవిషయములను గూర్చియు, కోళ్ళపెంపకము మున్నగు కొన్నిపరిశ్రమలను గూర్చియు లాంతరుపటముల మూలమున గ్రామస్థుల కుపన్యాసముల నిప్పింపవచ్చును.

సినిమా (చలనచిత్రపటము):—ఉపాధ్యాయులు సినిమాను సంపాదింపలేరు. కాని ఈ కాలమున నారోగ్యశాఖవారేమి, వ్యవసాయశాఖవారేమి సినిమాను దగ్గఱ పెట్టుకొని యే గ్రామమువా రాహ్వానించినను నటకుఁబోయి పటములను జూపి జనులకు సంతోష

మును జ్ఞానాభివృద్ధియుఁ గలిగించుటకు సిద్ధముగ గనిపెట్టుకొనియు న్నారు. గ్రామస్థుల కీ సంగతి తెలియఁజేయవచ్చును. కాని యుపా ధ్యాయులు తమతమ యుపాధ్యాయ సంఘముపక్షముననో, లేదా, స్వాంతముగనో యీశాఖకుఁ జెందిన యుద్యోగులకుఁ దమగ్రామము లోని యక్కఱలను గుఱించి విన్నవించుకొని, వారిమూలమున సినీ మాను దమగ్రామములకుఁ దెప్పించి, యారోగ్య విషయములను గుఱించియుఁ పరిశ్రమలను గుఱించియుఁ జలనచ్చిత్ర పటముల మూల మున జనులకు నూతనవిషయములను దెలిపి వారికి సేవచేయవచ్చును.

రేడియో:—జనసామాన్యమునకుఁ బ్రపంచజ్ఞానమును గలి గించుటకుఁగల సాధనములలో నిప్పటికి రేడియోను మించినది లేదన వచ్చును. రేడియోమూలమున బ్రపంచవార్తలను వినవచ్చును. చక్కని సంగీతమును వినవచ్చును. నాట్యవాద్యములను, నాటకము లను వినవచ్చును. పాఠశాలలలోని పాఠములు మహోపాధ్యా యులవలనఁ బాఠములను వినవచ్చును. అనేకవిధములైన పరిశ్రమ లను గూర్చియు నాయాపరిశ్రమలలో నారితేఱిన నిపుణులు ప్రసంగిం చుచుండఁగ వినవచ్చును.

దీనిమూలమున గ్రామములలోని జనులకు నత్యంతత్వరితముగ జ్ఞానము పెంపొందవచ్చును, కనుకనే దొరతనమువారు సాధ్యమైనంత త్వరలోఁ బ్రతిగ్రామములోను నొక రేడియో సెట్టును స్థాపింపదలం చియున్నారు. కాని యిట్టిది సంభవించుట కింక నెన్నియో యేండ్లు పట్టును. ఇప్పుడుమాత్రము ప్రతిజిల్లాలోను గొన్ని పెద్దగ్రామముల నేర్పఱచుకొని వానిలో రేడియోలను బెట్టించి వానిమూలమున జను లలోఁ గలుగుమార్పులను గనుఁగొనఁ బ్రయత్నించుచున్నారు. ప్రతి గ్రామమున నొక రేడియో స్థాపితమగు కాలము వచ్చినప్పు డుపా ధ్యాయులు తప్పక వాని గ్రామస్థులకు వినిపించుటలోఁ దోడ్పడ వలసియుండును. అప్పు డుపాధ్యాయు గ్రామస్థులకు సేవజేయుటకుఁ దరుణము లుండును.

(బడిలోని వినోద ప్రదర్శనములు:—వీనినిగూర్చి సంక్షేపముగా నింతకుమునుపే వ్రాసియున్నాము. (గ్రామములో సామాన్యముగ ప్రతిదినము నాటకములుగాని, సినీమాలుగాని యుండవు. కాబట్టి గ్రామస్థులు వింతప్రదర్శనములు చూచుటకు మిక్కిలి యాశపడుచుందురు. అట్టి వింతప్రదర్శనములను పాఠశాలల మూలమున నేర్పరచి యుపాధ్యాయులును, విద్యార్థులును గ్రామస్థులకు సేవజేయవలసి యున్నది.)

(అట్టి ప్రదర్శనములకుఁ గావలసిన కథలు బాలురు పాఠశాలలోఁ జదువు పాఠ్యగ్రంథములనుండిగాని యితర గ్రంథములనుండిగాని లభింపఁగలవు పాఠ్యగ్రంథములలోని కథల నుపాధ్యాయులు చిన్న నాటకములుగ వ్రాసి, విద్యార్థులకు నేర్పింపవలయును. నాటకములతోఁబాటు హాస్యప్రదర్శనములు వింత విశేషములు మున్నగునవి యుండవలయును.

ప్రదర్శనముల నేర్పఱచుట కుపాధ్యాయులు ధనమును వ్యయముచేయరాదు. దుస్తులవిషయములో సామాన్యమైన దుస్తులనే యుపయోగించుకొని, యవసరమైనయెడల జలతారు, కాకిబేగడ, చౌకరకము పూసలు, సుద్ద విశేషముగ నుపయోగింపవచ్చును. బాలురీ వింతప్రదర్శనములలో భావప్రకటనము, శబ్దోచ్చారణము, పాత్రకుఁ దగిన వేషము, వీనిని గమనించునట్లు చేయవలెను.

గ్రామములోని ప్రాథమిక పాఠశాలలు సంవత్సరమునకుఁ గనీసము మూఁడునాలుగు వింతప్రదర్శనము లయినఁ జేయునట్లుపాధ్యాయులు చూడవలయును.)

(గ్రామములోని వృత్తులు, పాఠశాల:—ప్రాథమిక పాఠశాలలోఁ జేతిపనులు ముఖ్యముగ నేర్పవలయునని) దొరతనము వారి ప్రణాళిక వలనఁ దెలియబడుచున్నది. ఆయా చేతిపనుల నెల్లను బాలురకు నేర్పుతో బోధించుటకుఁ గావలసినశక్తి యుపాధ్యాయులకు లేకపోవచ్చును. అట్టిసమయములలో వారు (గ్రామములో నాయావృత్తుల

ననుసరించు వారిని జేరి పాఠశాలలో నావృత్తులను బాలురకు నేర్పుటకుఁ దమకుఁ దోడ్పడునట్లుగ నేర్పఱచుకొనవలయును.) ఈ పని చేయుటకుఁ గొన్ని వేళల నా వృత్తిదారుని యానుకూల్యము ననుసరించియు, వృత్తిననుసరించియు బడివేళలు మార్చవలసిన యవసరము వచ్చును. అట్టిచో నవసరములగు మార్పులనుపాధ్యాయుఁడు చేయవలసియే యుండును.

(ఇట్టి యేర్పాటువలన వృత్తిదారులకుఁ దాము నుపాధ్యాయుల వలె బడిపాఠములను బోధించుచున్నామను సంతోషము కలుగఁగలదు. వారు బడియందు శ్రద్ధబూని తమ బాలురను బడికి గ్రమముగఁ బంపుటయేగాక, దాని యభివృద్ధికై పాటుపడఁగలరు.) గ్రామములో సాధారణ వృత్తులలో నుండువారుకూడఁ గొన్నివిషయములలోఁ దమకంటె నెక్కువ జ్ఞానమును నేర్పును గలవారని గ్రహించి యుపాధ్యాయులు వారియెడల సానుభూతితో మెలగగలరు.

## ప్రశ్నలు

(1) గ్రామపాఠశాలకు సంబంధించిన పఠనమందిరమును నీవు ఎట్లేర్పఱుతువు?

(2) గ్రామములో పఠనమందిరము నేర్పఱచుటవలనఁ గలుగఁగల మేలులను వివరించుము.

(3) పెద్దల చదువును గుఱించి గ్రామోపాధ్యాయునకును, చదువురాని రైతు యువకునకును జరిగిన సంభాషణ నూహించి వ్రాయుము.

(4) గ్రామస్థుల యుపయోగార్థము ఒక సంవత్సరములో నీ వేర్పఱుపఁగల యుపన్యాసముల పట్టిక సిద్ధము చేయుము.

(5) లాంతరుపటములు, సినిమా ప్రదర్శనలు వీనిలో నేది గ్రామస్థుల విద్యకెక్కువ ప్రయోజనకరమగునో సంపూర్ణ కారణములతో వ్రాయుము.

(6) తాము చూచి వచ్చిన యొక పాఠశాలలోని నాటకప్రదర్శనమును గూర్చి యిద్దఱు గ్రామస్థులు మాట్లాడుకొన్నట్లూహించి వారి సంభాషణను వ్రాయుము.

(7) క్రింది వానిని వివరింపుము:—

1 లాంకాస్ పద్ధతి

2 రేడియో

3 పఠనమందిరము

4 లాంతరుపటములు

(8) గ్రామములో నాయా వృత్తుల నవలంబించెడు ప్ర. మన పాఠశాలలోని పాఠముల బోధనలో దోడ్పడుట కెట్టి యేర్పాటులను జేసెదవు?

---

# 18. శిశుపాఠశాలలు—టెక్నికల్ పాఠశాలలు—మిశ్రమ పాఠశాలలు

ప్రస్తుతకాలములో జిన్నబిడ్డలయొక్క యారోగ్యము నెడలను, విద్యయెడలను పెద్దలు కనబఱచుచున్న శ్రద్ధ యింతకుముందెన్నడును జనులు కనబఱచియుండలేదు. బిడ్డలను బరీక్షించి వారి యారోగ్యమును గూర్చి తల్లిదండ్రులకు సలహాల నిచ్చుటకు శిశుసంరక్షణాలయములు నేడు ప్రతి దేశమునందును నెలకొల్పబడియున్నవి. బిడ్డలకుఁ జిన్నతనమునుండియే విద్యాబుద్ధులు నేర్పుటకుఁ బ్రత్యేక పాఠశాల లన్ని దేశములయందును స్థాపితము లగుచున్నవి. ఇట్టి పాఠశాలలు నర్సరీపాఠశాలలు, శిశుపాఠశాలలు అని రెండు విధములు.

(నర్సరీపాఠశాలలు:—అయిదేండ్లకంటె దక్కువ వయస్సుగల బిడ్డలనుమాత్రమే యివి చేర్చుకొనును. అట్టిబిడ్డల కివి;

1 ఆరోగ్యసాధకములగు సూర్యరశ్మి, వెలుతురు, శుభ్రమగు గాలి మున్నగువసతులను గల్పించును.

2 ఆరోగ్యకరములగు సదభ్యాసములను నేర్పి, యా బిడ్డల జీవితముల కానందమును గూర్చును.

3. ఇతర శిశువులతోఁ గలిసి సౌఖ్యముగ జీవించువిధములను నేర్పును

విద్యార్థుల నారోగ్యముగఁ బెంచుటయే వీనియొక్క ప్రధానోద్దేశము. కనుక, నివి బిడ్డలకు మధ్యాహ్నభోజనమునిచ్చి ప్రతిదిన మనేక గంటలకాలము బిడ్డలను బడిలోనే యుంచుకొని వారికి సదభ్యాసములను నేర్పును. పాఠములంతగా నుండవు కథలు, పాటలు, నాట్యము, ప్రకృతిపఠనము, చేతిపనులు, సంభాషణ-వీనిని ముఖ్యముగా నిచ్చటనేర్పుదురు. ఇట్టిపాఠశాలలలోఁ బెరిగిన బిడ్డలు మిక్కిలి చిన్నవయస్సుననే మంచి మర్యాదలను నేర్చుకొందురు.)

శిశుపాఠశాలలు:—శిశుపాఠశాలలో నయిదునుండి యేడేండ్లవఱకు వయస్సుగల బాలురను జేర్చుకొందురు. ఈపాఠశాలలు ప్రాథమిక పాఠశాలలో నొక భాగమని చెప్పవచ్చును. గాని వీని నిప్పుడు ప్రత్యేకముగ నడుపుచున్నారు. నర్సరీపాఠశాలలలో వలె వీనియందును బిడ్డల దేహారోగ్యమే ప్రధానముగ నెంచబడుచున్నది. బడిసమయములోనే బిడ్డలు కొంతసేపు నిద్రపోవలసిన యేర్పాటు లుండును. దేహశుభ్రతను, ఆరోగ్యాభ్యాసములను బిడ్డలు నేర్చుకొందురు. ఈ పాఠశాలలలో విద్యార్థుల శిక్షణము రెండు విధములుగ నుండును

బడివెలుపల మంచిగాలిలో బాలురుచేయు పనులమూలమున లభించునది మొదటివిధము. చిన్నబాలురు సంచరించుటకు దగిన పరిసరములను ప్రకృతి ప్రసాదించి యున్నది. ప్రకృతిలో జంతువులు, పక్షులు, చెట్లు, పువ్వులు, గడ్డి, నదులు, వాగులు మొదలైనవాని నన్నిటిని బాలురు చూచి ప్రకృతినిగూర్చి నేర్చుకొనవలయును. కనుక నీ తరగతిలో బాలు రెక్కువకాల మారుబైటనే గడుపుదురు.

ఈ వయస్సులో బాలుర కాటలయం దాసక్తి యధికము. కనుక నుపాధ్యాయులు వారిచే నానావిధములయిన యాటల నాడింతురు. పరుగెత్తుట, ఎగురుట, దుముకుట, గంతులు వేయుట, చెట్ల

కుట్టుట మొదలగువానిని బిడ్డలు చేయుట కేర్పాటులుండును. శిశువుల తరగతిలో నాటలమూలమున ననేక సంగతులను బాలురు నేర్చుకొనఁగలరు. కనుక వారికి నిండ్లుకట్టుట, బిడ్డలను పెంచుట మొదలగు పెద్దవారిపనుల నాటలమూలముననే నేర్పుదురు. చరిత్ర, భూగోళములకు సంబంధించిన సంగతులనుగూర్చియు బాలురీ వయస్సులో వర్షము, ఋతువులమార్పులు, వాగులు, విహారములు, పోలీసులు, మోటారుబండ్లు, రైలుమార్గములు, యంత్రములు, దీపస్తంభములు మొదలగువాని మూలమున నేర్చుకొందురు. చిన్న జంతువులను, పక్షులను పెంచియు, పువ్వులను, కీటకములను గమనించియు భూతదయను నేర్చుకొందురు.

బడిలోపల నుపాధ్యాయుని మూలమున లభించు శిక్షణము రెండవవిధము. బడిలో బాలురకు నానావిధములయిన యాటవస్తువులిచ్చి వాని యుపయోగమువలన కన్నును, చెవిని, స్పర్శశక్తిని విరివిగ నుపయోగించునట్లు చేయుదురు. బిడ్డలకు భాష నేర్పుటకూడ పాఠశాలలోపలనే జరుగును. బాలుఁడు తన యనుభవములను గూర్చియు పటములను గూర్చియు ధారాళముగ మాట్లాడునట్లు చేయుటయు, బాలుని పదజాలము వృద్ధియగునట్లును, తప్పులు లేకుండ మాటలాడునట్లును జేయుటయు ముఖ్యముగ గమనింపఁదగినవి. ఇందులకు కథలు, పాటలు బాగుగ దోడ్పడును. నాటకప్రదర్శనములును నుండును.

చేతిపనులును, చిత్రలేఖనమును బాలుర కిష్టమగు పనులు. ఈ పనులు చేయవలయునని గాని, ఈ పటములు గీయవలయుననిగాని యుపాధ్యాయులు బాలురను నిర్బంధింపక వారి కిష్టము వచ్చిన వానిని జేయనియ్యవలయును. చదువుట, వ్రాయుట, లెక్కలు వేయుట యను నీ మూఁడింటిని బాలురు సిద్ధముగ నున్న సమయమున మొదలుపెట్టి నేర్పుదురు. బాలుఁడు శిశుపాఠశాల విడిచిపోవు నప్పటికిఁ జక్కని యారోగ్యము కలిగి, సదభ్యాసములను నేర్చుకొని తన చుట్టుప్రక్కలను శ్రద్ధగ గమనించుటకును, తోడివిద్యార్థులతోఁ

గలసిమెలసి యుండుటకును, ఇక్కుగ వినుటకును, మాటలాడుటకును శక్తిగలవాడుగా నుండవలయును. స్పష్టముగ జదువుటయును, విశదముగ వ్రాయుటయును దెలిసి యుండవలయును.

మిశ్రమ పాఠశాలలు:—ప్రాథమిక పాఠశాలలలో బాలబాలికలు కలిసియే విద్యనభ్యసింతురు. కాని ప్రాథమిక విద్య ముగియునప్పటికే కొందరు బాలబాలికలు ప్రారంభ యౌవనములో ప్రవేశించుదురు. అట్టితఱి వారు కలిసి చదువుట యుక్తముకాదని కొందఱు వాదింతురు. అట్టివారు చెప్పు కారణము లేవన:—

1. ప్రారంభయౌవనమున బాలబాలికలకు శరీరములలో మార్పులు కలుగుచుండును. అప్పుడు వారికొకవిధమైన పరస్పరాకర్షణము కలుగును.

2. బాలురున్న తరగతిలో బాలికలున్నపుడు వారు సహజమైన సిగ్గుచేత దమకు దెలియని విషయములనైనను ఉపాధ్యాయుల నడుగకుండనుందురు. అందువలన వారివిద్య కాటంకము కలుగును.

3. బాలుర పాఠశాలలో జదువు బాలికలు సామాన్యముగ బాలికలు నేర్చుకొనవలసిన కుటుంబశాస్త్రము, కుట్టుపని మొదలగు వానిని నేర్చుకొనుట కవకాశము లుండవు.

4 ఆట పాటల విషయములో బాలికలకు దగిన వసతులు లేకుండును.

5. బాలికలకు స్త్రీయుపాధ్యాయులుండిన, వారు నిర్భయముగ వారిని జేరి తమ కష్టములను గూర్చి చెప్పుకొనగలరు. బాలుర పాఠశాలలో నుపాధ్యాయులు పురుషులై యుండుటవలన నట్టివసతు లుండవు అనునవి.

ఇంక బాలబాలికలు కలిసి చదువుటయే మంచిదనువారు చెప్పు కారణము లేవన:—

1. కుటుంబములలోను, బయటను, స్త్రీపురుషులును, బాలబాలికలును కలిసియే యుందురుగాని ప్రత్యేకముగ నుండరు. కనుక వారు కలసి చదువుటయే సహజమగు పద్ధతి.

2. బాలికలయెదుటఁ బాఠములు చెప్ప లేకున్న సిగ్గుగానుండు నని బాలురు పాఠములను శ్రద్ధగాఁ జదువుదురు. బాలికలును నట్లే శ్రద్ధగా చదువుదురు.

3 బాలిక లున్నప్పుడు మర్యాదగా నడచుకొనవలయునని వారు జాగ్రత్తగఁ బ్రవర్తించుటవలనఁ గ్రమశిక్ష బాగుగ నుండును.

4. బాలికలకుఁ బ్రత్యేకముగఁ బాఠశాలలు పెట్టినయెడల నెక్కువద్రవ్యము కావలసియుండును. బాలుర పాఠశాలలలో జదువుటవలన సొమ్ము మిగులును.

బాలబాలికలు కలసి చదువవలసినప్పు డట్టి పాఠశాలలో సగముమంది యుపాధ్యాయులు స్త్రీలై యుండుట మంచిది. అంతియు కాక బాలికలకు గృహశాస్త్రము, కుట్టుపని, ప్రత్యేకమగు నాటలు మున్నగునవి ఏర్పాటు చేయవలయును. మఱియు వారు విశ్రమించుట కొక గది ప్రత్యేకముగ నుండవలయును.

హిందూదేశము, మిశ్రమపాఠశాలలు:—ఇంగ్లండులో స్త్రీలయెడఁ బురుషులకు గౌరవ మధికము. మఱియు నది చలిదేశము కనుక కామక్రోధాది గుణములు త్వరితముగ ప్రకోపము చెందవందురు. అట్టి ఇంగ్లండుదేశములోనే కొందరు విద్యావేత్తలు ప్రాథమిక పాఠశాలాదశ దాటినపిదప బాల బాలికలు కలిసి చదువుకొనుట మంచిదని వాదించుచున్నారు. అట్లగుచో నిండియాదేశములోని శీతోష్ణస్థితినిబట్టియు, జనుల యభిప్రాయములను బట్టియు జూడఁ బ్రాథమికవిద్య ముగిసిన పిమ్మట మిశ్రమపాఠశాలలు లేకుండుటయే యుత్తమమని చెప్పవచ్చును.

గ్రామపాఠశాలలు:—పెద్ద పెద్ద గ్రామములలో సామాన్యముగ బాలురకును బాలికలకును ప్రత్యేకముగఁ బాఠశాల లుం

డును. కాని చిన్నగ్రామములలో బాలికలకుఁ బ్రత్యేకపాఠశాలలుండవు. అట్టిగ్రామములలో నుపాధ్యాయులు తగువిధముగఁ గృషిసల్పి గ్రామములో బడివయస్సుగల నున్న బాలిక లందఱును బడికి వచ్చునట్లు చేయుటకుఁ బ్రయత్నపడవలయును. బాలికలసంఖ్య బాలురసంఖ్యలో సగమునకైన లేకున్న విద్యాశాఖవారు గ్రాంటులను తగ్గింతురు. పాఠశాలలో, పదిమంది బాలిక లుండిన యా పాఠశాలలో నొకరికంటె నెక్కువమంది యుపాధ్యాయు లుండుట కవకాశమున్నపు డా పాఠశాలలో నొక స్త్రీని యుపాధ్యాయురాలిగా నియమించుట బాలికలు బడికి వచ్చుటకుఁ బ్రోత్సాహకరముగ నుండును. అట్లే నలుగురుపాధ్యాయులున్న బడిలో సగము స్త్రీ లుపాధ్యాయినులుగ నేర్పఱుపఁబడవలయును. తల్లిదండ్రుల సంఘసమావేశములలోను బయటను ఉపాధ్యాయులు బాలికల తల్లిదండ్రులతో బాలికల విద్యను గుఱించి ముచ్చటించి వారిని బడికిఁ బంపునట్లు ప్రోత్సహింపవలయును.

టెక్నికల్ పాఠశాలలు:—టెక్నికల్ విద్య యనగా నేదేని యొక వృత్తిని నిపుణతతో సాగించుటకుఁ గావలసిన శక్తిసామర్థ్యములను గలిగించువిద్య. ఇట్టి విద్య సామాన్యముగా నున్నత విద్య పొందిన విద్యార్థులే యభ్యసింతురు. కాని ప్రాథమికవిద్య నేర్చిన వారికి సైతము కొన్ని వృత్తులను నేర్పుటకుఁ గొన్ని పాఠశాలలు నెలకొల్పబడినవి. వీనికే వృత్తిపాఠశాలలు (వొకేషనల్ స్కూల్సు) అని పేరు. వీనియందు సామాన్యముగ గ్రామములలోని జను లవలంబించు వ్యవసాయము, నేత, వడ్రంగము, కమ్మరిపని, కుమ్మరిపని మున్నగు వృత్తులను నేర్పుదురు.

ఈ పాఠశాలలలో నేదో యొక్క వృత్తిని నేర్పుట కొక్కొక్క నిపుణుఁ డుండును. విద్యార్థులకు గరపు విద్యలో వృత్తికిఁ జెందిన విద్యయే ప్రధానభాగముగ నుండును. కాని, దినమున కొకటిరెండు గంటలకాలము అక్షరాస్యతగూడ నుండును. పాఠశాలలోఁ బ్రవేశించిన విద్యార్థుల కందఱికిని మాతృభాషలోఁ జదువుట, వ్రాయుట, లెక్కవేయుట తెలిసియుండవలయును. సామాన్యముగా నైదవతరగతి

మైనను దాటినవారే యీపాఠశాలలలో విద్యార్థులుగఁ జేర్చుకొనఁబడుదురు. పాఠశాలలో విద్య ముగియునప్పటికి ప్రతివిద్యార్థియు నేదో యొక వృత్తి చక్కఁగ నేర్చిగి యుండవలయును. కావున నొక్కొక్క విద్యార్థియుఁ బాఠశాలలో నాలుగైను సంవత్సరముల పర్యంతము విద్య నభ్యసించవలయును. ఈ పాఠశాలలలో విద్య నేర్చినవారు తమతమ గ్రామములకు బోయి యితర గ్రామస్థులతో గలసి జీవించుచు నాయావృత్తుల నవలంబించి జీవనము సంపాదించుకొనుచు గ్రామాభివృద్ధికిఁ దోడ్పడవలయును.

### ప్రశ్నలు

(1) నర్సరీ పాఠశాలలకును, శిశుపాఠశాలలకును భేద మేమి?

(2) శిశుపాఠశాలలో బడివెలుపల బాలురకు దొరకవలసిన శిక్షణమును వివరించుము.

(3) శిశుతరగతికి విద్యార్థులను నీ వొక జంతుప్రదర్శనశాలకు విహారమునకుఁ గొనిపోయితి వనుకొనుము. అప్పుడు నీవు వారి కేమి నేర్పెదువో తెలియఁజేయుము.

(4) ప్రాథమిక పాఠశాలలలో బాలికల సంఖ్యను వృద్ధిచేయుటకు మూఁడు మార్గములను సూచించుము.

---

## 19. నవీన బోధనాపద్ధతులు

కొన్ని శతాబ్దములక్రిందట మన దేశమున గొప్ప విద్యాసంస్థలనేకములుండలేదు. అగ్రవర్ణములజనలు తమ కుమారులను గొన్ని గురుకులాశ్రమములకుఁ బంపి యచ్చటి పండితులచే వారికి విద్య చెప్పించుచుండిరి. అట్టి యాశ్రమములలో విద్యార్థులు తమ తమ మేధాశక్తి ననుసరించి వేద వేదాంగములను బఠించుచుండిరి. జన సామాన్యమునకు విద్య వీథిబడుల మూలమున లభించెడిది. ఆశ్రమములలోనేమి, వీథిబడులలోనేమి, గ్రంథములను గంఠస్థము చేయించు పద్ధతులు వాడుకలో నుండెను. బాలురకు విద్యగఱపుట కవలంబింపదగు నుత్తమబోధనాపద్ధతు లెవ్వి యని తెలిసికొనుటకు మన దేశ

స్థులు పరిశోధనలు చేసినట్లుగపడదు. మన దేశములో నుపాధ్యాయులు బాలుర చిత్తవృత్తులను గ్రహింపక దండనము మూలమునం గాని బాలురకు ఉత్తమవిద్య యబ్బదని మొన్న మొన్నటివఱకుం దండించెడివారు. పాశ్చాత్య దేశములలో సైతము బాలురవిద్యను గూర్చి యిట్టి యభిప్రాయములే యుండెను.

కాని పందొమ్మిదవ శతాబ్దములో దయార్ద్రహృదయులగు విద్యావేత్తలు కొందఱు బయలుదేఱి బాలుర చిత్తవృత్తినెఱిఁగి వారి కుల్లాసము గలుగు పద్ధతుల మూలమున విద్య నేర్పవలయు నని బోధించిరి. అట్టివారిలో జర్మనీ దేశస్థుఁడగు ఫ్రెడరిక్ ఫ్రొబెలు అను నతఁడు ముఖ్యుఁడు. అతడు చిన్నవయస్సులో నున్న బాలుర స్వభావమును బాగుగ గుర్తించి, యాటవస్తువుల మూలమున వారికి విద్యనేర్పుటకు 'కిండర్‌గార్టనుపద్ధతి' యనుపేర నొక నూతనపద్ధతిని గనిపెట్టెను. ఫ్రొబెలు గతించిన పిదప నితరులు బయలుదేఱి 'మాంటిసోరీ పద్ధతి', 'డాల్టనుపద్ధతి', 'ప్రోజెక్టుపద్ధతి' యను పేరులు గల యితర విద్యాపద్ధతులను గనిపెట్టిరి. విద్యార్థి స్వభావమును గుర్తెఱిఁగి వానికిఁ బాఠములను బోధింపవలయు ననునదియే వీని యన్నిటియొక్క మూలసూత్రము. ఈపద్ధతులలో నొక్కొక్కదాని గుఱించి మనము కొంతమట్టునకు నేర్చుకొనవలసి యున్నది. మొదట కిండర్‌గార్టను పద్ధతినిగూర్చి నేర్చుకొందము.

కిండర్‌గార్టను పద్ధతి:—కిండర్‌గార్టను అనుమాటకు "పిల్లల తోఁట" యని అర్థము. ఆఱేండ్లకంటెఁ దక్కువ వయస్సుగల బిడ్డలకుఁ జదువు నేర్పు బడి యొక తోఁటవలె నుండవలయును. బిడ్డలును తోఁటలోని మొక్కలవలెను, పుష్పములవలెను సహజముగ నెదుగ వలయును. ఆ వయస్సులో బిడ్డలు తమ తల్లులయొద్ద నుండవలసిన వారు. కనుక వారి నొకబడిలోఁ జేర్చినయెడల వారిస్వభావమునకు దగినట్లుగ నచ్చట వారి కాటపాటల మూలముననను, జిన్నచిన్నపనుల మూలముననను విద్య నేర్పవలయును. ఇంద్రియ శిక్షణ మీవిద్యలోఁ బ్రధానముగనుండ వలయును. ఇవియే ఫ్రొబెలు సిద్ధాంతములు.

కనుక కిండర్ గార్టనుబడిలో నుపాధ్యాయుఁడు బాలురనైజ గుణము లెవ్వియైనదియు దెలిసికొని యానియమానుసారముననే బాలుర యింద్రియశక్తులను వృద్ధిపొందింపవలయును. ఆ నైజగుణములలో నాటలాడుకొనుటయందలి యాశ ప్రధానమైనది. కాబట్టి కిండర్ గార్టను బడిలో నానావిధములగు నాటల నేకము లుండవలయును. వస్తువులను నిర్మింపవలయునను గుణము స్థితము బాలురలో నున్నది. కనుక బంకమట్టితో నానావిధములగు బొమ్మలను బాలురచేఁ జేయింపవలయును. చిత్రములను గీయింపవలయును. కఱ్ఱముక్కలతోను, ఇసుకతోను నిండ్లు మొదలగునవి కట్టింపవలయును. చిన్న బాలురు ఊహా ప్రపంచములో మెలఁగుచుందురు. కనుక వారి యూహాశక్తిని వృద్ధిపొందించుటకుఁ గథలను జెప్పవలయును. పటములను జూపవలయును. బాలురకు నటనముందుండెడి యాశను తృప్తి పఱచుటకు వారు కథలను నాటకములుగఁ బ్రదర్శించునట్లు చేయవలయును. చలనమునందు వారికిఁగల ప్రీతిని గమనించి పాటలతోఁ గూడిన యాటల నాడింప వలయును.

ఈ పద్ధతిలో సామాన్యముగఁ దక్కిన తరగతుల బాలురకుఁ జెప్పునట్టి "పాఠము" లనునవి యంతగా నుండరాదు. సంభాషణ, కథలు, పటములను గుఱించి మాటలాడుట, చిత్రలేఖనము, బంకమట్టిపని, నానావిధాకారములతో, బూసలు, విత్తనములు, పుల్లలు, దారము—వీనిని బెట్టుట, కఱ్ఱముక్కలతో నాటలు, ఇసుకలో నాటలు, నాట్యము, పాటలు, గంతులువేసి యాడుట—ఇవి ముఖ్యమైన పాఠములుగనుండవలయును. పిల్లలు దేనిమీఁదగాని యెక్కువ కాలము మనస్సుంచలేరు. కనుక పాఠము లేదిగాని యిరువది, యిరువదియైదు నిమిషములకంటె మించియుండరాదు. కాలనిర్ణయ పట్టికలో లెక్కలు, భాషమున్నగునవి బడిపని ప్రారంభించినప్పుడే నేర్పవలయును. క్రమశిక్షను నేర్పవలయును గదా! యని బాలుర స్వేచ్ఛను నిరోధింపక, యుదయ సాయంతనములయందుఁ గొన్ని నిమిషములు మాత్రమే వరుసలలో నిలుచుట, నడచుట, మొదలైన యభ్యాసములను జేయించినఁ జాలును.

కిండర్ గార్టెను ఉపాధ్యాయుడు బాలురలో బాలుడై మెలగు వాడుగ నుండవలయును. బడిలో నెత్తయిన పీఠము మీద కూర్చుండక బాలురతో సమానముగ ప్రవర్తింపవలయును. చదువు నందును ఆటలయందును బాలుర యుత్సాహమునకు దన్ను తాను దగ్గించుకొనవలయును. అప్పుడే బాలు రతనియొద్ద నిర్భయముగ నుండి చదువు నేర్చుకొందురు.

మన దేశములో నున్న ప్రాథమిక పాఠశాలలలో నుపాధ్యాయులు బాలురయెడ దయాళువులగ పాఠములను నేర్పవలయు ననుట ఈ కిండర్ గార్టెను పద్ధతివలననే యని చెప్పవలసి యున్నది.

## మాంటెసరి పద్ధతి

'డాక్టరు మేరియామాంటిస్సోరి' యను నామె ఇటలీ దేశస్థురాలు. మూడేండ్లు మొదలేడేండ్లవఱకు వయస్సుగల బిడ్డలకు విద్య నేర్పుట కామె యొక్క పద్ధతిని గనిపెట్టియున్నది. చిన్న బిడ్డల విద్య కనుకూలమగు పరికరముల నేర్పఱచి వారి నందులో సహజముగ నెదుగనియ్యవలయునని మాంటిసరిగారి సిద్ధాంతము. ఈసిద్ధాంతము ననుసరించి ఈమె ఇటలీ దేశములో దాదాపు ముప్పది సంవత్సరములనుండి తన పద్ధతుల ననుసరించి పాఠశాలలను నడుపుచున్నది. ఈమె సిద్ధాంతములు త్వరలో యూరపు, అమెరికా ఖండములలో వ్యాపించెను. నేడా రెండు ఖండములలోను మాంటిసరిపద్ధతుల ననుసరించు పాఠశాలలు పెక్కు గలవు.

బిడ్డల యిల్లు:—మాంటిసరిపద్ధతి ననుసరించి విద్య నేర్చుకొను బిడ్డలకొక యిల్లుండవలయును. దానిలో సామాన్యముగ నితర గృహములలో నున్నట్లొక పెద్దగదియు, దుస్తులు ధరించుగది, స్నానపు గది మున్నగు గదులుండవలయును. ఇంటికనంటుకొని యొక తోట యుండవలయును. ఇంటిలోని సామాగ్రియంతయు ననగా బల్లలు, కుర్చీలు, పాత్రలు, గరిటెలు, వానిని భద్రముచేయు అల్మారాలు మున్నగునవన్నియుఁ జిన్నబిడ్డలు వాడుకొనుటకుఁ దగినవిగ నుండ

వలయును. పెద్దగదిలో నొక పెద్దయల్మారా యుండవలయును. ఇదియు బిడ్డలయెత్తుకు దగినదిగ నుండవలయును. దీనిలో విద్యార్థులు పాఠముల సమయమున వాడుకొను సామగ్రి యంతయు నుండును.

ఇదికాక వేఱొకయల్మారా యుండవలయును. దానిలోనొక్కొక్క విద్యార్థికొక్కొక్క పెట్టె యుండవలయును. ఆ పెట్టెలో విద్యార్థి తన వస్తువులన్నింటిని పెట్టుకొనవచ్చును. ఆ గదిలో నన్నివైపుల గోడలకు నల్లబల్లలు తగిలించి యుండును. పనిచేయునప్పుడు గదిలోని నేలమీఁద బఱచుకొనుటకు ప్రతి విద్యార్థి కొక రంగులతివాసీ యుండును. ఒక్కొక్కవిద్యార్థికొక్కొక్క పూలతోటకూడ నుండును. వానిలో విద్యార్థులు పువ్వులబెంచవలయును. పిల్లలు నేర్చుకొనుట కొక పియానో వాయిద్యముకూడ నుండును. స్నానపుగదిలోఁ బాత్రలు, తువాళ్ళు, సబ్బులు, దువ్వెనలు, మున్నగున వన్నియు నుండును. వంటతప్ప దక్కిన పనులన్నిటిని అనగా భోజనపదార్థములను వడ్డించుట, పాత్రలు కడుగుట, గదులను, అందలి వస్తువులను శుభ్రముచేయుట యిట్టివను లన్నియు విద్యార్థులు తామే చేసికొనవలయును. ఈ విధముగ వా రొకరితో నొకరు కలసి మెలసి యుందురు.

విద్యాపద్ధతి:—మాంటిసరి పద్ధతి ననుసరించి విద్య మూఁడు భాగములుగా చేయుబడినది. అవి:—

(1) చలననాడుల విద్య, (2) ఇంద్రియముల విద్య, (3) భాషా జ్ఞానము అనునవి.

1. చలననాడుల విద్య:—కూర్చుండుట, లేచుట, నడచుట, వసుగెత్తుట, తోటపని, ఆటలు — వీనిమూలముగను, ఇంటిలో వస్తువులను శుభ్రముచేయుట, భోజనములు వడ్డించుట మొదలగు పనుల మూలమునను సాగును.

2. ఇంద్రియములవిద్య:—ప్రత్యేకముగ నా పనికై సిద్ధము చేసియుంచిన వస్తువులమూలమున సాగును. ఈ వస్తుసామగ్రి విస్తా

రముగ నుంచును. నానావిధాకారములుగల కఱ్ఱముక్కలు, పుల్లలు, సంగీతవాయిద్యపు గంటలు, అట్టలమీద నిసుకతో వ్రాసిన యక్షరములు, రంగుపెన్సిళ్ళు—ఇట్టివెన్నియో యీ సామగ్రిలో జేరియుండును.

పిల్లలెవరికిష్టమువచ్చిన వస్తువులను వారు తీసికొనఁగా నుపాధ్యాయిని వారిలో నొక్కొక్కరేమి చేయవలసినదియు నవసరమయినచోఁ జూపును విద్యార్థులలో ననేకు లితరులను జూచి వారేమి చేయవలసినదియు నేర్చుకొందురు. కనుక నుపాధ్యాయిని నేర్పించవలసిన యవసరమే యుండకపోవచ్చును. కాని యుపాధ్యాయిని గదిలో నొకమూలను గూర్చుండి విద్యార్థులను గమనించుచుండును. ఎవరికైనను సాయము గావలసి యుండెనేని సాయము చేయును. తక్కినప్పు డూరకే యుండును.

భాష నేర్పునప్పుడును బాలురయొక్క యాటవస్తువులనే యాధారముగఁగొని వాని పేరులతోఁ బ్రారంభించి క్రమక్రమముగ మాటలను జదువుటయు, వ్రాయుటయును నేర్పుదురు.

ఈ పాఠశాలలు గొప్ప వ్యయముతోఁ గూడినవి కనుక మన దేశములో నెచ్చటగాని యీపద్ధతి వాడుకలో నున్నట్లు దెలియబడ లేదు.

## డాల్టను పద్ధతి

పాఠశాలలలో బాలురను తరగతులుగ భాగించి ముప్పది నలుబదిమంది బాలురకొక్క యుపాధ్యాయుఁడు పాఠములను నేర్పు పద్ధతినే మన మెఱిఁగియున్నాము. ఈ పద్ధతిలో నొక గొప్ప లోపమున్నది గొప్ప తెలివితేటలుగల బాలుఁడు ఉపాధ్యాయుఁడు చెప్పు విషయముల నత్యల్పకాలములో గ్రహించి నేర్చుకొని మందబుద్ధులుగా నున్నవారి కుపాధ్యాయుఁ డదే పాఠములను మరలఁ మరలఁ జెప్పుచుండఁగా కాలము నూరక వెళ్ళబుచ్చవలసి యుండును.

ఈ లోపమును దొలగించి బాలురు తమతమ శక్తిసామర్థ్యములకొలఁది ముందునకుఁబోవుట కవకాశముల నియ్యగల పద్ధతి నొకదాని నమెరికాదేశస్థురాలగు శ్రీమతి పార్క్‌హార్‌స్టు కన్య కని పెట్టెను. దాని నామె ప్రప్రథమముగా 1912 లో న్యూయార్కు పట్టణమందు డాల్టను ఉన్నతపాఠశాలలో నుపయోగించెను. ఆ పద్ధతికే డాల్టనుపద్ధతి యనిపేరు. ఆ పద్ధతి నిప్పు డింగ్లండులో ననేక పాఠశాలలయందు నుపయోగించుచున్నారు.

డాల్టనుపద్ధతి వివరము :—శ్రీమతి పార్క్‌హార్‌స్టు కన్యయే డాల్టనుపద్ధతి నిట్లు వివరించియున్నది. "పాఠశాలలోని విద్యార్థులును నుపాధ్యాయులును గొలదిపాటి వ్యయముతో నధిక లాభమును బొందుటకు బడిలోని పనిని పునర్నిర్మాణ మొనరించుటయే ఈపద్ధతి యొక్క ముఖ్యసూత్రము. దీనిలో బాలుర నిష్ప్రయోజకత్వమును నిర్మూలించుటకు వసతులుకలవు. ఇది పఠ్యప్రణాళికను మార్చదు. దీనికి విశేష వ్యయముతోఁగూడిన కట్టడములుగాని బోధనోపకరణములుగాని యవసరములేదు. పాఠములను నేర్పుట కేదో యొకకచ్చితమైన పద్ధతి యున్నదను వాదమును నీ పద్ధతి యొప్పుకొనదు. తెలివిగల విద్యార్థులను మందబుద్ధులుగా నుండువారును తమతమ శక్తినిబట్టి సాగుట కిది యవకాశముల నిచ్చును." ఈపద్ధతికి మూడు సూత్రము లాధారములు. అవి యేవన: (1) స్వేచ్ఛ (2) బాలుర సంఘముల పరస్పర ప్రభావము (3) ప్రతిబాలుఁడును చేయవలసినపని.

సామాన్యముగ నిప్పటి పాఠశాలలలో బాలురకు స్వేచ్ఛ లేదు. వారి కిష్టమువచ్చినపాఠము నిష్టమువచ్చిన గంటలో జదువుకొనలేరు. కాలనిర్ణయపట్టికప్రకారము మేర్పఱుపఁబడిన పాఠములను జదువవలయును. డాల్టనుపద్ధతిలో విద్యార్థి తన కిష్టమువచ్చిన పాఠములను జదువవచ్చును. అంతియగాక యొక్కొక్క విద్యార్థియు నుపాధ్యాయుఁడిచ్చిన పనిని స్వంతముగఁ జేసి చూపవలయును. దీని మూలమున నొకవిద్యార్థి పాఠమును గ్రహించినాఁడా, లేదా యని వెంటనే తెలిసికొనవచ్చును.

డాల్టనుపద్ధతిని బడిచేయు విధము:— ఈ పద్ధతికి నాలుగు ప్రత్యేకలక్షణము లున్నవి. వానిలో 'పాఠములగదు' లనునది మొదటిది. అనఁగా బడిలో నేర్పఁబడుచున్న యొక్కొక్క పాఠమున కొక గది యుండవలయు ననుట. వాచకమున కొక గది, లెక్కలకొక గది, ప్రకృతిశాస్త్రమున కొక గది యిట్లు పాఠమున కొక గది యుండును. బాలుర విభజన తెలివితేటలనుబట్టి కాక వయస్సునుబట్టి యుండును. అనఁగా 10 యేండ్ల బాలు రొక తరగతిగాను, 11 ఏండ్ల బాలుర మఱొక తరగతిగాను, 12 యేండ్ల బాలురు వేరొక తరగతిగాను, 13 ఏండ్ల బాలు రింకొక తరగతిగాను విభజన చేయఁబడుదురు. వీరి కంతటికిని నాలుగేండ్లకు సరిపోవు పాఠముల నేర్పవలసి యుండును. ఒక్కొక్క పాఠమున కేర్పడిన గదిలో నా పాఠమును నేర్పుటకు గావలసిన యుపకరణములు, పటములు మొదలగు వస్తువు లుండును. ప్రతిపూట కొకటి రెండైచ్ఛిక పఠనగంట లుండును. ఆ గంటలో విద్యార్థులు తమ కిష్టమువచ్చిన గదిలోనికిఁబోయి యా పాఠమును జదువుకొందురు; లేదా వ్రాసికొందురు. ఏవైనఁ దెలియని విషయము లున్నచో నచ్చటి యుపాధ్యాయుని నడిగి చెప్పించుకొందురు. ఒక పాఠమును నేర్చుకొనఁగనే విద్యార్థి మరియొక గదికిఁ బోవును.

బడిలో నేర్పవలసిన ప్రతిపాఠముల కొక ప్రవీణుఁడుండుట రెండవలక్షణము. ప్రవీణుఁడగు నీయుపాధ్యాయుఁడు తానేపాఠమును జెప్పునో యాగదిలోనే యుండును. అతఁడొక్కొక్క తరగతిలోని బాలురకుఁ దాను నేర్పు పాఠములమీఁదఁ బ్రశ్నలు సిద్ధముచేసి విద్యార్థుల కిచ్చుటయేగాక వారాపాఠములో నెట్టియభివృద్ధినొందుచున్నదియుఁ గనిపెట్టుచుండును.

విద్యార్థి చేయవలసిన పని నిర్దిష్టముచేయుట మూడవ లక్షణము. బడిలో నాలుగు తరగతు లుండినయెడల నొక్కొక్క తరగతిలోని బాలురును సంవత్సరమునకు జదువవలసిన వాచకము, లెక్కలు, భూగోళము మున్నగు పాఠముల ప్రమాణము పాఠ్యప్రణాళికనుబట్టి తెలియును. ఒక్కొక్క పాఠము విషయమున నేమి జరుగు

నదియు నాలోచింతము. భూగోళపాఠమును దీసికొందము. బడిలోని ప్రతిబాలుఁడు నొక్కొక్క సంవత్సర మా సంవత్సరపు భూగోళపాఠములను నేర్చుకొనవలయును. విద్యార్థి 'ఎ' అను తరగతిలో నున్నా డనుకొందము, భూగోళపాఠప్రవీణుఁ డీ బాలుఁడు సంవత్సరములో జదువవలసిన పాఠములను బదిభాగములు చేయును.

ఒక్కొక్కభాగమును విద్యార్థి యొకనెలలోఁ జదివి ముగింపవలయును. ఆ నెలభాగము నుపాధ్యాయుఁ డిరువది చిన్నభాగములుగఁ జేయును. అట్లు చేసినపని నొక చీటిమీఁద వ్రాసి బాలుని కిచ్చును. దీనికే నిర్దిష్టపత్రమను పేరు. నిర్దిష్టపత్రములోఁ జూపిన యిరువది చిన్నభాగముల పనిని విద్యార్థి తన కిష్టమువచ్చినట్లు దినమున కెన్ని భాగములనైనను ముగింపవచ్చును. విద్యార్థి దినమున కైదు భాగములచొప్పున ముగించినయెడల నాలుగు దినములలోనే భూగోళములోఁ జేయవలసిన పని అంతయు ముగించును. కాని తక్కిన పాఠములలో వెనుకఁబడిపోవును కనుక నతఁ డితర పాఠములను నయితము చదువవలయును. తాను నేర్చుకొన్న పాఠముల నుపాధ్యాయునికిఁ జూపించి తన నిర్దిష్టపత్రములో నతని సంతకము చేయించుకొనవలయును. నెలలోపలఁ దాను జదువవలసిన పాఠముల నన్నిటిని ముగించి లేకున్నయెడల నావిద్యార్థి యెందుకు ముగించలేదో కనుగొని వానికిఁ బ్రత్యేకముగ సాయము చేయుట కేర్పాటులు జరుగును. ఈ విధముగ ప్రతిపాఠములోను నుపాధ్యాయుఁడు నిర్దిష్టపత్రముఁ జూపిన పనిని విద్యార్థి 10 నెలలలో సంవత్సరపు బనిని ముగించినయెడల రెండవ సంవత్సరపు పాఠముల నితఁడు ప్రారంభింపవచ్చును.

విద్యార్థులపని పరిశీలనపు టేర్పాట్లు నాల్గవలక్షణము. ఈపని జరుగుటకు విద్యార్థియొద్ద నొక చీటియు, నుపాధ్యాయునియొద్ద నొక చీటియుఁ, బ్రధానోపాధ్యాయునియొద్ద నొకచీటియు నుండును. విద్యార్థియు నుపాధ్యాయుఁడును ప్రతిదినమును, ప్రధానోపాధ్యాయుఁడు

వారమున కొకపర్యాయమును విద్యార్థి యెంతవరకు ముందునకుఁ బోయినదియుఁ దెలిసికొనుచుందురు.

ఈ పద్ధతివలన లాభములు:—డాల్టను పద్ధతిలో విద్యార్థికి స్వేచ్ఛయుండును. ఎవరియొత్తిడి లేకుండ విద్యార్థి తనకిష్టము వచ్చిన పాఠము ఇష్టము వచ్చినంతకాలము చదువుకొనవచ్చును. మంద బుద్ధులు మెల్లగను, కుశాగ్రబుద్ధులు వడివడిగను వృద్ధిపొందుట కీ పద్ధతిలో నవకాశములు గలవు. మందబుద్ధు లెవ్వరైనదియు నుపాధ్యాయుఁడు కనిపెట్టుటకును దగిన సాహాయ్యము చేయుటకును వసతులు గలవు. విద్యార్థు లందఱు తమతమపనులలో నిమగ్నులై యున్నందున దుంటరితనమునకుఁ బోరు. కనుక బడిలో మంచి క్రమశిక్షణ యుండును. ఉపాధ్యాయుఁ డొక్కొక్క బాలుని శక్తిసామర్థ్యములు గనిపెట్టుట కీ పద్ధతి యవకాశముల నిచ్చును. విద్యార్థులకును నుపాధ్యాయులకును మంచి స్నేహభావము ఏర్పడును.

## ప్రశ్నలు

(1) ఫ్రొబెలు ఎవ్వరు? అతని పేరును మన మెందులకు జ్ఞాపక ముంచుకొనుచున్నాము?

(2) నూఱేండ్లక్రిందట మన దేశములో నీ వొక వీధిబడిలోఁ జదువుచుండిన ట్లూహించుకొని యప్పటి నీ యనుభవమును వ్రాయుము.

(3) కిండర్ గార్టన్ బడిలో నేర్పవలసిన పాఠములు, నుపయోగింపవలసిన యాట వస్తువులను పట్టీగా వ్రాయుము.

(4) మాంటిసోరి పద్ధతికిని కిండర్ గార్టను పద్ధతికిని గల భేదములను వ్రాయుము.

(5) మాంటిసోరిపద్ధతి మన దేశమునకు సరిపడునో సరిపడదో కారణములతో వ్రాయుము.

(6) డాల్టను పద్ధతికి ఆ పేరెట్లు కలిగెను? ఆ పద్ధతిలోని ముఖ్యసూత్రము లేవి?

(7) డాల్టనుపద్ధతి మంచిదని యొకరును, సామాన్యముగ వాడుకలోనున్న నేర్పు పద్ధతియే మంచిదని యింకొకరును వాదించుచుండగా నీవు విన్నావనుకొని వారి సంవాదములను వ్రాయుము.

(8) డాల్టనుపద్ధతివలన లాభములను వ్రాయుము.

# 20. నవీన బోధనాపద్ధతులు: ప్రోజెక్టు, వార్ధా పద్ధతులు

**ప్రోజెక్టు పద్ధతి:—** నవీన బోధనాపద్ధతులలో 'ప్రోజెక్టు' పద్ధతి మిగులఁ బ్రధానమైనది. ఇది అమెరికా దేశములోని పాఠశాలలలో నధికముగ వాడఁబడుచున్నది. అమెరికా దేశమునుండి మనదేశమునకుఁ గ్రైస్తవమత ప్రచారమునిమిత్తము వచ్చిన మిషనరీలు తా మిచ్చట స్థాపించిన పాఠశాలలలో మొదట దీనిని బ్రవేశపెట్టిరి. పంజాబు ప్రాంతములో నున్న మోగా యను గ్రామమునందలి మిషను పాఠశాలలో నీ పద్ధతి మెక్కీదొరగారిచే జయప్రదముగ వాడఁబడి త్వరలో నాప్రాంతపు దొరతనమువారి యామోదమును బొందెను. గ్రామోపాధ్యాయులకు ప్రోజెక్టుపద్ధతిని నేర్పుటకై నేఁడిప్పు డచ్చటి బోధనాభ్యాసనపాఠశాల యొకటి గలదు. ఈ పద్ధతి యచ్చటనుండి దేశములోని యన్నిభాగములకును బ్రాకినది. కాని, పంజాబులో దప్ప దక్షిణ ప్రాంతములలో నీ పద్ధతి సామాన్యముగ వాడుకలో లేదు. మన రాజధానిలో నే యొకటి రెండు పాఠశాలలలో నో యీపద్ధతి యాచరణమునందున్నది. ఈరోడ్ పట్టణమునందలి లండన్ మిషన్ బాలుర పాఠశాలలో నిది జయప్రదముగ సాగుచున్నట్లు తెలియఁ బడుచున్నది.

**ప్రోజెక్టనగా నేమి:—** అమెరికాదేశపు విద్యావేత్తలలో నొకరగు కిల్ పాట్రిక్ దొరగారు ప్రోజెక్టు అను పదమున కీ క్రింది విధమున నిర్వచనము చేసియున్నారు. "ఏదైన నొక బలవత్తరమగు నుద్దేశముతోఁ గూడినపని 'ప్రోజెక్టు' అనిపించుకొనును. తలపెట్టిన పని ముగించువఱకు నా యుద్దేశము బలముగా బనిచేయుచుండవలయును." అని. ప్రోజెక్టు మానవజీవితమునకుఁ జెందిన యేవిషయమును గురించి యైన నుండవచ్చును. ఈయుద్దేశము ననుసరించి ప్రోజెక్టు నాలుగువిధములుగ నుండవచ్చునని కిల్ పాట్రికు పండితుని యభిప్రాయము.

1. మనస్సులోని యభిప్రాయమును ప్రకటించు వస్తువును నిర్మించుట. ఇది మొదటివిధము. వస్తువెంత చిన్నదియైనను గావచ్చును. ఆ వస్తునిర్మాణమునకు వినియోగించబడు పదార్థము లేవియైనను గావచ్చును. అనగా కాగితము, వెదురుపుల్లలు, జిగురు-వీనిలో నొకబాలుడొక గాలిపడగను నిర్మించెనని యనుకొందము. గాలిపటము నిర్మాణమొక ప్రాజెక్టు. షాజహాను చక్రవర్తి కాలమున నిర్మించబడిన లోకప్రసిద్ధమగు తాజ్‌మహాల్ భవనము సయితము ప్రాజెక్టే. పైరెండును నిర్దిష్టవ్యక్తులయొక్క మనస్సులలోని యభిప్రాయములను ప్రకటించుచున్నవి.

2. ఏదేకధ్యానముతో నొక వస్తువు ననుభవించి యానందించుట. ఇది రెండవవిధము. ఒక బాలుడు బాణాసంచను గాల్చుచుండగా జూచి యానందించును. లేదా యొక తియ్యని మామిడిపండును తిని యానందించును. ఈ రెండు పనులు ప్రాజెక్టు లనిపించుకొనునా యని యడిగినచో వాని ననుభవించు నుద్దేశముండినదా యని మనము ప్రశ్నింప వలసియున్నది. అట్టి యుద్దేశ ముండిన యెడల నవి ప్రాజెక్టు లనిపించుకొనును. ఉద్దేశము లేనియెడల నవి ప్రాజెక్టులు కాజాలవు. అట్లే యొక రొక చక్కని కథను చదివి యానందింతురు; లేదా సూర్యాస్తమయమును జూచి సంతసింతురు. ఈ రెండు పనులను జేయునపుడు సైతము ఒక్కొక్క పనియు నొక బలమగు నుద్దేశముతో గూడి యుండినయెడల నది ప్రాజెక్టనిపించుకొనును.

3. ఒక చిక్కును విడదీయుట మూడవవిధము. ఒక చిక్కు సమస్యను విన్నంతనే యొక ప్రాజెక్టేర్పడదు. ఆసమస్యను గ్రహించి దానిని విడదీయుటకు బూనుకొన్నప్పుడే ప్రాజెక్టేర్పడును. గంటకిరువది మైళ్ళచొప్పున బోవు రైలుబండి యొక మైలు పోవుట కెంత కాలము పట్టును? అనునది యొక సమస్య. దాని నొకడు విన్నంతనే ప్రాజెక్టేర్పడదు. కాని యందలి చిక్కును గ్రహించి దానిని విడదీయుట కుద్దేశించినపుడే ప్రాజెక్టేర్పడును.

4. జ్ఞానోపార్జనము:—ఇది నాలుగవ విధము. ఒకఁడొక సంగతిగూర్చి యొక గ్రంథములో జదువును. చదివిన వెంటనే ప్రాజెక్టు ఏర్పడదు; కాని ఆ చదివిన సంగతి తనకుముందు కాలమునకు పనికివచ్చునని యెంచి దానిని కంఠస్థముచేయ నుద్దేశించును. అట్లు కంఠస్థము చేయ నుద్దేశించినప్పుడే నాలుగవ విధమగు ప్రాజెక్టేర్పడును.

ప్రాజెక్టులు సమష్టిప్రాజెక్టులనియు, వ్యష్టిప్రాజెక్టు లనియు రెండువిధములుగ నుండును. సమష్టి ప్రాజెక్టులలో ననేక బాలురు కలసి పని చేయవలసియుండును. వ్యష్టిప్రాజెక్టులలో నొక్కొక్క బాలుఁడు తనకుఁదాను ప్రాజెక్టునకుఁ జెందిన పనులన్నింటిని జేయును. బాలురు పెరిగి పెద్దవారైనపు డితరులతోఁ గలసి మానవశ్రేయమునకుఁ బాటుపడవలసి యున్నారు. సమష్టిప్రాజెక్టులట్లనేకులు కలసి పనిచేయుట కవకాశములను గల్పించును. కాని వ్యష్టిప్రాజెక్టులలో నట్టి యవకాశము లుండవు. కనుక వ్యష్టి ప్రాజెక్టులకంటె సమష్టి ప్రాజెక్టులే శ్రేష్ఠమైనవి.

ప్రాజెక్టుపద్ధతి యననేమి?:—ప్రాజెక్టుమూలమున విద్య నేర్పు పద్ధతికి ప్రాజెక్టుపద్ధతి యనిపేరు. బడిలో నుపాధ్యాయుఁడును బాలురును కలసి మాటలాడుకొనునపుడు బాలు రేదోయొకపనిని జేయుట కిష్టపడుదురు. ఆ యిష్టము బలమై నుద్దేశముగ నేర్పడి విద్యార్థు లెల్లరు నాపనినే చేయఁగోరినయెడల నొక ప్రాజెక్టేర్పడును. కాని, యావిషయమున నుపాధ్యాయుఁడు హెచ్చరికతో మెలగవలయును. బాలురు చేయుదమని కోరిన ప్రతిపనిని ప్రాజెక్టుక్రింద నుపాధ్యాయుఁ డేర్పరచుకొనరాదు. తాను ముందుగనే కొన్ని ప్రాజెక్టుల నుగుఱించి యోచించుకొని యట్టి ప్రాజెక్టులను బాలురే యేర్పఱచుకొనుటకుఁ దగిన వాతావరణమును బడిలో నుపాధ్యాయుఁడు కల్పింపవలయును. ఉదాహరణముగ గాలిపటమును జేయుటయను ప్రాజెక్టును తన విద్యార్థులు కోరుకొనవలయునని యొక యుపాధ్యాయుఁడు తలఁచె ననుకొందము. అట్టియుపాధ్యాయుఁడు గాలిపటమును గూర్చిన కథలను

తన విద్యార్థులకుఁ జెప్పవలయును. లేదా యొక గాలిపటమును బడి లోనికిఁ దెచ్చి గోడకు వ్రేలాడగట్టి యుంచవలయును. మఱియు బడిలో బాలుర కగపడునట్లుగ కొన్ని రంగుకాగితములను, వెదురు పుల్లలను, జిగురును నుంచవలయును. వీనిమూలమున బాలుర గాలిపటము నుగూర్చి తలంతురు. అప్పుడు వారే గాలిపటములను చేయుదమని యుపాధ్యాయునితోఁ జెప్పుదురు. బాలురలో నట్టి యుద్దేశము కలిగి యాయుద్దేశమును నెఱవేర్చుటకుఁ బూనుకొన్నప్పుడు గాలిపటమును జేయుటయను ప్రాజెక్టేర్పడును. అప్పు డుపాధ్యాయుడు గాలిపటమును సిద్ధముచేయు పద్ధతులనుగుఱించి బాలురతో ముచ్చటింపవలయును. దీనిఫలితముగ గాలిపటమును జేయుటయనునది ప్రధానమైన ప్రాజెక్టుగా నేర్పడగా రంగుకాగితములను సంపాదించుట, వాని వెలను దెలిసికొనుట, కాగితములను కొలుచుట, కావలసిన కొలతలు కత్తిరించుట, వెదురుపుల్లలను సంపాదించుట, వానిని జీల్చి సిద్ధముజేయుట, సరిపడిన ముక్కలుచేయుట, జిగురులను సంపాదించుట, గాలిపడగ చక్కగ నెగురుటకుఁ గావలసిన వాతావరణమును గూర్చి నేర్చుకొనుట మున్నగున వెన్నియో చిన్న ప్రాజెక్టు లేర్పడును. వీనినే 'సబ్ ప్రాజెక్టు' లందురు. కావున నొక ప్రాజెక్టు మొదలు పెట్టి ముగించునప్పటికనేక సంగతులను బాలురు నేర్చుకొందురు.

ఈప్రాజెక్టుమూలముననే వాచకము, లెక్కలు, భూగోళము ప్రకృతిశాస్త్రము మున్నగు పాఠములను నేర్పుట కవకాశములుండును. పైన వివరించిన గాలిపటము ప్రాజెక్టులో గాలిపటములను గూర్చిన కథలు, వెదుళ్ళు పెరుగు అడవులు, గాలిపడగ యెగురుటకుఁ గావలసిన వాతావరణము-వీనినిగూర్చి చదువుట వాచకమగును. కాగితము, వెదురుపుల్లలు, వీనిని కొలుచుట, వాని వెలలు తెలిసికొని గాలిపటము చేయుటకు గావలసిన మొత్తపు వెలలను కనుగొనుట లెక్కల పాఠమగును. గాలులు, అవి వీచుదిక్కులు, ఋతువులు మున్నగు విషయములు భూగోళపాఠమునకుఁ జెందినవి. అట్లని పాఠశాలలో నేర్పవలసిన ప్రతిపాఠమును ప్రాజెక్టులో సంబంధపఱచి తీరవలయునని

తలంపరాదు. అట్లు చేసినయెడల ప్రోజెక్టులో గొన్ని పాఠములకు కృత్రిమ సంబంధము కల్పించినట్లగును. ప్రోజెక్టు మొదలుపెట్టినప్పటి నుండియు నది ముగియువఱకును బాలురుత్సాహముతో నేర్చుకొను చుందురు.

కాబట్టి ప్రోజెక్టుపద్ధతినిగూర్చిన యీ విషయములను మనము గమనింపదగును.

1. ఒక బలమైన యుద్దేశముచే ప్రేరేపింపబడి కొనసాగింపబడు పనికే ప్రోజెక్టుఅని పేరు. ప్రతి ప్రోజెక్టును బాలురు తామే యేర్పఱచుకొనవలయును. అట్లుకానిచో బాలురకు దామువేయు పనియం దుత్సాహముండదు. కాని ప్రోజెక్టుల నేర్పఱచుకొనుట కుపాధ్యాయుడు తగిన వాతావరణమును బడిలో గల్పించి బాలురకు దోడ్పడవలయును.

2 బాలు రేర్పఱచుకొన్న ప్రోజెక్టుల నుపాధ్యాయుడే సాగింపవలయును. ప్రోజెక్టులమూలమున నెన్ని విషయములు బాలురకు నేర్పుటకు వసతులున్నవో కనిపెట్టి వాని నన్నిటిని బాలురకు నేర్పవలయును. సంవత్సరాంతములోపల బడిలోని పాఠముల ప్రణాళిక చొప్పున పాఠములన్నియు ముగియునట్లును జూడవలయును.

3. ప్రోజెక్టు ముగియువఱకును బాలుర యుత్సాహము తగ్గరాదు. ఉత్సాహము ప్రోజెక్టునకు ప్రాణము. ప్రోజెక్టులో సహజముగా సంబంధములేని విషయముల నుపాధ్యాయుడు బోధించినచో నుత్సాహము తగ్గును. ఉదాహరణముగ గాలిపటము ప్రోజెక్టు మూలమున బైబిలుపాఠమును నేర్పుటకు ప్రయత్నింపరాదు.

4. సామాన్యముగ జనుల జీవితమునకు సంబంధించిన ప్రోజెక్టులనే కోరుకొనుట మంచిది. అవియును సమష్టి ప్రోజెక్టులై యుండవలయును. ఇల్లుకట్టుట, తోటను పెంచుట, నాటకములను ప్రదర్శించుట-యిట్టివి మంచి ప్రోజెక్టులు.

ప్రోజెక్టుపద్ధతియొక్క వ్యాప్తి:—మానసిక శాస్త్ర సూత్ర

ములనుబట్టి చూచినచో ప్రాజెక్టుపద్ధతి బాలుర విద్యకు మిక్కిలి తగి యున్నది. మన మే పనిని చేయ నుద్దేశింతుమో దాని నుత్సాహ ముతో చేయుదుము. దేనిని జేయుదుమో దానిని నేర్చుకొందుము. మనకు దేనియం దభిరుచికలదో దానిని మనము సులువుగా నేర్చు కొందుము. విద్యార్థులు తామే యొకవిషయమును సంకల్పించి దాని నుత్సాహముతో నెఱవేర్చునట్లు చేయునది ప్రాజెక్టు పద్ధతి. కనుకనే యీ పద్ధతి యవలంబింపదగియున్నది; కాని, యిది వ్యాప్తిలో కెందుకురాలేదు? ఈ పద్ధతి నాచరణలోఁ బెట్టుటకుఁ బ్రత్యేకముగ నీ పద్ధతియందు శిక్షణము పొందిన యుపాధ్యాయులు కావలయును. అట్టి యుపాధ్యాయులు మన రాజధానిలో నిప్పుడు లేరు. ప్రస్తుతమందలి బోధనాభ్యసన పాఠశాల లట్టి యుపాధ్యాయు లను తర్ఫీదు చేయవలయును. ప్రాజెక్టు పద్ధతినిగూర్చిన గ్రంథములు తెలుగుభాషలో లేవు. కనుక నుపాధ్యాయులందఱు నీ పద్ధతినిగూర్చి తెలిసికొనుట కవకాశములు లేవు. ఈ పద్ధతి నాచరణయందుఁ బెట్టి జయప్రదముగఁ బనిసాగించునట్టి పాఠశాలలు సైతము మన రాజ ధానిలో లేవు. సర్కారు పాఠశాలలుగాని, ప్రైవేటు పాఠశాలలు గాని యీ పద్ధతి నవలంబించుపాఠశాలలలోఁ బ్రవేశపెట్టి యది యాచ రణ సాధ్యమనియు, నిప్పుడున్న బోధనాపద్ధతులకంటె నుత్కృష్టమైన దనియుఁ జూపిన యెడల నిది విరివిగ వాడుక లోనికి రాఁగలదు.

## వార్తాపద్ధతి

పుట్టు పూర్వోత్తరములు:— మన దేశములో నాంగ్లేయుల దొరతనము స్థిరపడినప్పటి నుండియు నాంగ్లేయ విద్యాప్రభావము హెచ్చి, దేశీయవిద్య క్రమముగ నశించెను. విద్యావంతులగుచుండెం దవ యువకు లాంగ్లభాషావ్యామోహముచే బడి దేశభాషల నుపే క్షించిరి. దేశములోని విద్యావిధానమంతయుఁ బాశ్చాత్య పద్ధతుల ననుసరింపసాగెను. జనసామాన్యమునకు విద్య యందుబాటులో నుండక పోవుటయేగాక దీనిమూలమున గ్రామములలోని విద్యావంతు

లందఱు పల్లెలు విడిచి పట్టణములు చేరసాగిరి. కనుక విద్యావంతులకును పల్లెటూరి జనులకును మధ్య గొప్ప యెడ మేర్పడెను. విద్యవలనఁ గలుగుచున్న యిట్టి దుష్ఫలితముల నరసి జనులయొక్క జాతి సంప్రదాయమునకుఁ దగిన విద్యావిధానమును దేశములో నేర్పఱుపవలయునని దేశనాయకులు తలఁచిరి. ఈ విధముగఁ దలచిన వారిలో మహాత్మాగాంధీగారొకరు.

ప్రస్తుత విద్యావిధానములోని యీ క్రిందఁ జూపిన లోపములనాయన "హారిజన్" అను పత్రికలో వివరించియున్నారు. "ప్రస్తుత విద్య జనసామాన్యమునకుఁ బనికివచ్చునది కాదు. ఏలయన : పాఠశాలలలోఁ గఠినమగు నాంగ్లభాష మూలమున బాలురకు విద్య నేర్పుటవలన, విషయములను బాలుర సరిగా గ్రహింపజాలకుందురు. అంతియగాక యనేకములగు నితర విషయములను నేర్చుకొనుటకు వినియోగింపవలసిన కాలమును నాంగ్లభాష నేర్చుకొనుట కుపయోగించుచున్నారు. ఏవో కొన్ని యింగ్లీషు ముక్కలు నేర్చుకొనుచున్నారే కాని, బాలురకు నిజమగు విద్య చెప్పబడుట లేదు." ఇట్లు ప్రస్తుత విద్యావిధానమును విమర్శించిన పిదప మహాత్ముఁ డాదర్శప్రాయమగు ప్రాథమికవిద్యను గూర్చిన తన యభిప్రాయముల నిట్లు వెల్లడిచేసి యున్నాడు. "ప్రాథమికవిద్య యేడేండ్లపర్యంతము సాగవలయును. పాఠములబోధన మాతృభాషా మూలముననే జరుగవలయును. ఆంగ్లభాషను ప్రధాన భాషగ నేర్పరాదు. పాఠములన్నింటిని నొక చేతిపనినాధారము చేసికొని బోధింపవలయును. చేతిపనుల మూలమున విద్యార్థులు సిద్ధము చేసిన వస్తువులను విక్రయించి పాఠశాలలను నడుపుటకుఁ గావలసిన సొమ్ము సంపాదింపవలయును" అని మహాత్ముఁడు సూచించిన యీ నూతన విద్యాపద్ధతిని గూర్చి యాలోచించుటకు విద్యాధికులతోఁ గూడిన విచారణ సంఘ మొకటి 1937 లో వార్ధాపట్టణమున నేర్పఱుపఁబడెను. ఆ సంఘము గాంధిమహాత్ముని సూచనల ననుసరించి యొక విద్యావిధానమును సిద్ధము చేసెను. దానికే వార్ధాపద్ధతి యని పేరు.

వార్ధాపద్ధతిలోని ముఖ్యవిషయములు:

1. ప్రాథమికవిద్య యంతయు నేదేని యొక చేతిపని మూలమున సాగవలయును. అనగా నుపాధ్యాయుడు నూలువడుకుట, నేతనేయుట మున్నగు నేదో యొక పని నాధారముగా చేసికొని దాని మూలమున సాధ్యమయినంతమట్టుకు వాచకము, లెక్కలు, భూగోళము మొదలగు పాఠములను బోధింపవలయును, ఏపాఠమునైనను చేతిపని మూలమున బోధించుటకు వీలుకానియెడల వానిని ప్రత్యేకముగ బోధింపవలయును. బాలురు చేయు పనులమూలమున వారికి విద్య నేర్పవలయును. ఆధునిక విద్యాసూత్రము నీ పద్ధతి యనుసరించుచున్నదనవచ్చును. బాలురందరును చేతిపనులను నేర్చుకొన్నచో విద్యాధికులకును చేతుల కష్టముతో జీవించువారికిని మధ్యనుండు భేదము లంతరింపగలవు. వట్టి పుస్తకముల చదువులోనే తమ కాలము గడపు వారికీ పద్ధతి వలన నిప్పుడు పనిమార్పు కలుగును. విద్యకును జనుల జీవితమునకును సంబంధ మేర్పడును. కాని బాలురకు వృత్తిని సంపూర్ణముగ నేర్పవలయునను నుద్దేశముతో గాక వారికి ప్రధానముగ విద్య నేర్పవలయునను నుద్దేశముతోనే తగిన చేతిపనిని గోరుకొన వలయును.

2. పాఠశాలల నడుపుటకు గావలసిన సొమ్మంతయు బాలురు సిద్ధముచేయు వస్తువుల నమ్మి సంపాదింపవలయును. బాలురు సిద్ధము చేయు వస్తువులను సర్కారువారు కొనవలయును. పాఠశాలకగు వ్యయము నంతయు నీవిధముగ సంపాదింప లేకపోయినను నెక్కువ భాగమును సంపాదించుటకు నవకాశమున్నది. అట్లని బాలురచేత దినమంతయు పనిచేయించి వారికి నేర్పవలసిన ఇతరపాఠములను నేర్పక విడువరాదు. ఉపాధ్యాయుల కొక్కొక్కరికి నెలకు గనీసము రు 20-0-0 లు జీతముండవలయును.

3. మాతృభాష మూలముననే పాఠము లన్నియు బోధింపబడ వలయును. ప్రాథమికవిద్య కిది పునాదిగనుండవలయును. మాతృ

భాషలో విద్యార్థి త్వరితముగాఁ జదువుటకును, వేగముగను భావ సహితముగను సలక్షణముగను మాటలాడుటకును కావలసిన నేర్పు పొందవలయును, తప్పులు లేకుండగను, విశదముగను వ్రాయుట యును, వ్యాపారమునుగూర్చిన యుత్తర ప్రత్యుత్తరములు జరపుట యును దెలిసియుండవలయును.

4. ప్రతివిద్యార్థియు నేడేండ్ల కాలము విద్య నభ్యసింప వల యును. అనఁగా విద్యార్థి తనయొక్క యేడవయేటినుండి పదునా లుగవ యేఁడువఱకు బడిలో నుండవలయును. ప్రస్తుతము ప్రాథమిక ఉన్నతవిద్యలలో నేర్పు పాఠములన్నియు నీ యేడేండ్ల కాలములో బాలురకు నేర్పవలయును. ఇప్పుడాంగ్లభాషను నేర్చుకొనుట కెక్కువ కాలమును వినియోగించుచున్నారు. కనుక నితరపాఠములకు సమయము చాలుటలేదు. ఆంగ్లభాషను దొలగించినచో నితర పాఠములకుఁ గావలసినంతకాలము లభించుటయేగాక యాంగ్ల భాషను నేర్చుకొనుటలో విద్యార్థులకు గల శక్తియంతయు నుడిగి పోవును. ఈ పద్ధతిప్రకారము దినమున కైదున్నర గంటలచొప్పున సంవత్సరమునకు రెండువందల యెనుబది యెనిమిది దినములు బడిపని జరుగవలయును.

వార్ధాపద్ధతియొక్క గుణదోషములు:—ప్రస్తుత మమలులో నున్న విద్యావద్ధతులవలెఁగాక వార్ధాపద్ధతి భారతీయ సంప్రదాయ ములకుఁ దగ్గియున్నది. ఉన్నతపాఠశాలలోని విద్యనంతయు మాతృ భాషలో నేడేండ్లకాలములో బాలురకు నేర్పుట యొక గొప్ప విష యము. చేతిపనులను నేర్పుటవలన వట్టి పుస్తకవిద్య యంతరించి బాలురకుఁ జేతిపనులు ఉత్సాహమును బుట్టింపగలవు. మనదేశ ములోఁ జేతుల కష్టమును నీచముగఁ జూచు గుణము జనులలో గలదు. అందఱును జేతిపనులను నేర్చుకొన్నచోఁ జేతుల కష్టమున కంటియున్న నీచభావము తొలఁగును. భారతదేశము బీదల బీదది. కావున విద్యకుఁ గావలసినంత ధనమును వెచ్చింప లేకున్నది. కాఁబట్టి దొరతనమువారి కెట్టివ్యయమును లేకుండగనే ప్రాథమికవిద్య బాలుర

చేయు కష్టముతోనే సాగఁగలిగినయెడల నది దేశమునకు మిగుల గొప్పలాభముగ నుండును. ప్రస్తుతము మనదేశములో ననేకులు నిరుద్యోగులై యన్నవస్త్రములు సంపాదించుకొనలేక యవస్థలు పడుచున్నారు. బాలురు వార్ధాపద్ధతి ననుసరించి ప్రతివాడు నొకవృత్తి నేర్చుకొనును. గనుక నిరుద్యోగసమస్య యుండనేరదు. ప్రతిసంవత్సరమును మనదేశములో కోట్లకొలది రూపాయలు విద్యకై వెచ్చించఁబడుచున్నవి. కాని విద్యావంతులసంఖ్యమాత్ర మంతగాఁ బెరుగుట లేదు. బడిలోఁ జేరి రెండుమూడేండ్లుమాత్ర ముండుండి బడి విడుచుటవలన నెందరో నిరక్షరులగుచున్నారు. కాని, ఈ పద్ధతివలన ప్రతి బాలుఁడును నేడేండ్లు పర్యంతము బడిలోనుండవలసి యుండును. గనుక నొకసారి బడిలోఁ బ్రవేశించి చదువుకొన్నవారు నిరక్షరులగుట కవకాశముండదు.

బాలురకు దేనియం దభిరుచిగలదో దానిని సులువుగను త్వరితముగను నేర్చుకొందురను మానసికశాస్త్ర సూత్రమునుబట్టి చూచినయెడల వార్ధాపద్ధతి విమర్శనకు నిలువఁజాలదని చెప్పవలసి యున్నది. ఎట్లన నుపాధ్యాయుఁడు నేర్పు వడుకుపనియందుగాని, నేతపనియందుఁగాని బాలున కేమియభిరుచియుండును? ఆ పరిశ్రమ బాలుఁడు కోరుకొన్నదికాదు. జీవనము సంపాదించుకొనగోరు పెద్దవారికి దానియం దభిరుచి యుండవచ్చునుగాని, చిన్నబాలుర కది యుత్సాహము బుట్టింపదని చెప్పవచ్చును. విద్యార్థి కభిరుచిలేని పనిని వారిచే జేయించినయెడల వాని కది భారముగఁ దోచుటయేకాక వానివిద్యకే భంగము కలుగును. మఱియు నొకచేతిపనినే ప్రతిదినము చేయవలసి వచ్చినయెడల బాలుర కది విసుగును బుట్టించును. ప్రాజెక్టు పద్ధతిలోఁ బ్రతిదినము, లేదా ప్రతివారము కొకటో యొక క్రొత్త సబ్ ప్రాజెక్టును బాలురు చేయుచుండుటవలన నందులో వారియుత్సాహ మంతరింపకయుండును. వార్ధావిధానములో నానాపాఠములకుఁ గాలమును భాగించుటలో మూఁడు గంటల యిరువది నిమిషములు చేతిపని కేర్పాటుచేసి బాలుర సంపాదనవలననే విద్య సాగించవలయునను నేర్పాటు కలదు.

అందువలన నుపాధ్యాయులు చేతిపనిని శ్రద్ధగ నేర్పి యితర పాఠముల నశ్రద్ధచేయుట కవకాశముకలదు. అంతియకాక తమబిడ్డలు బడిలో వడ్లకుట్టువంటి చేతిపని నేర్చుకొనుట కిష్టపడని తల్లిదండ్రులుందురు. అందువలన నీ పద్ధతి సర్వజన సమ్మతముగా నుండదు. ఈ విధానము ననుసరించి విద్య నేర్చుకొన్న బాలుర కాంగ్లభాషాపరిచయ ముండకపోవుటచే నా భాషలోని విజ్ఞానమును జదువుకొనుటకు శక్తియుండదు. మతబోధ కీ పద్ధతిలో స్థానమియ్యకుండుటయు లోపమే యనవలసి యున్నది. భిన్నమతములుగల మన దేశములో పాఠశాలయందు మతబోధన కేర్పాటు చేయుట సులభముగ నుండకపోవచ్చును. అట్లని దానిని బూర్తిగ వదలివేయరాదు. అట్లు చేసినయెడల బాలురకు దైవభక్తి నేర్పుటకుగల యవకాశములను జారవిడిచి నట్లగును.

వార్ధాపద్ధతి వార్ధాపట్టణములో నున్న బోధనాభ్యసన పాఠశాలలలోదప్ప మఱియెచ్చటను నాచరణమునందున్నట్లు తెలియదు. ఆంధ్రదేశమున బందరు పట్టణమున యీ పద్ధతిని నేర్పుటకొరకు యుపాధ్యాయక శిక్షణశాల నేర్పరచి యున్నారు. కాంగ్రెసు ప్రభుత్వమధికారములో నుండిన కాలమున నీ పద్ధతిని మన రాజధానియందలి పాఠశాలలన్నిటిలోను బ్రవేశపెట్టునని తలంపబడెనుగాని, యంతలోనె ప్రభుత్వము మాఱినందువలన నీ యత్నము వెనుకబడినది. కాని గ్రామపాఠశాలలలో నీ పద్ధతి నుపయోగించుట కీపద్ధతిలో శిక్షణము పొందిన యుపాధ్యాయులు కావలయును. ఇప్పుడు శిక్షణము పొందుచున్న యుపాధ్యాయులు గ్రామములలోని ప్రాథమిక పాఠశాలలలో నీ పద్ధతి ప్రకారము విద్య నేర్పవలయును. ఈ పద్ధతిని గొన్ని పాఠశాలలలో నైనను వాడిచూడనిదే దీనియందలి సాధక బాధకములను గాని లాభనష్టములను గాని నిశ్చయము చేయజాలము.

## ప్రశ్నలు

(1) "ప్రోజెక్టు" అనగా నేమి? ప్రోజెక్టులలో నెన్నివిధములుగలవు? అవి యేవి?

(2) మానసికశాస్త్రము యేసూత్రముమీద ప్రోజెక్టుపద్ధతి యాధారపడియున్నది? దానిని వివరింపుము.

(3) ప్రోజెక్టుపద్ధతి యనగానేమి? బడిలో నేర్పవలసిన పాఠముల నన్నింటిని దాని మూలమున నేర్పుటకు వీలగునా? ఈ యుత్తరము నొక్క దృష్టాంతముతో విశదపఱచుము.

(4) ప్రోజెక్టుపద్ధతికిని, వార్ధాపద్ధతికిని గల పోలికలను, భేదములను వ్రాయుము.

(5) ప్రస్తుత విద్యావిధానములోని కొంతలోపములను చేర్కొని వానిని దొలగించుటకు మార్గములను సూచింపుము.

(6) వార్ధాపద్ధతిలో గల నాలుగు గుణములను వ్రాయుము.



Printed at the S.R.P. Works, Rajahmundry E.G. 33—10000